1277

A

# చిత్రలేఖ



మూలం:— శ్రీ భగవతీ చరణ వర్మ

అనువాదం:— చల్లగుళ్ల వెంకటసుబ్బారావు

నవసమాజ పబ్లికేషన్సు,

గుడివాడ — కృష్ణాజిల్లా.

TPLA 1088 33

C

మానవ జీవితం—అందుగల
మంచి-చెడ్డలను నాదృష్టికోణం
తో, చూడడమే, చిత్రలేఖలోని
సమస్య. అదే నాఆత్మ ఆలాపించే
సంగీతము—

శ్రీ
భగవతీ చరణ శర్మ.

## * సమర్పణ *



# చల్లగుళ్ల పెదఆదినారాయణగారి కుమారుడు
# శ్రీ
## * శాయన్నకు *

మిత్రమా శాయన్న! ,,అడుగులోనే హంసపాదు'' అన్నట్లు
నా అధ్యయన ప్రారంభదశలోనే వచ్చిన చిక్కులకు
పిరికిపారి ఆక్షేత్రాన్నుండి పారిపోయి వచ్చిన నాకు
ఉద్రిక్తమైన మాటలను చెప్పి, ఉత్సాహపర్చి,
ముందుకు పంపించావు. తత్ఫలితమే ఈ
అల్పరూపం—నీ ఈప్రోత్సాహ ప్రతి
ఫలాన్ని ముందుగా నీకే సమ
ర్పించుకొంటున్నాను.

— సుబ్బారావు —

Y

## ఆశ

ఇది శ్రీభగవతీ చరణవర్మగారి రచనలలోకల్లా శ్రేష్ఠమైన నవలా రాజము. ఉత్తమ సాహిత్య కోటికిచెందిన ఈ నవలను నాబోటి అల్పులు అనువదించ బూనుట నిజంగా హాస్యాస్పదమే.

ఏలో ఉబుసుపోక ప్రయత్నించాను. మిత్రులు కొందరు చూచి ప్రోత్సహించారు. తత్ఫలితంగా ఆశ జనించింది. ప్రయత్నాన్ని గట్టి పర్చాను. అయినా నా ఈ ప్రయత్నం అనధికారమేనేమో నన్న సందేహముగూడా లేక పోలేదు. ఇది నా మొదటి ప్రయత్నం కావడంవల్ల లోపములనేకము లుండవచ్చును. అధికార—అనధికారములను నిర్ణయించిన పాఠకలోకము, నా ఈ అనధికార చేష్టను మన్నించి, చిత్త సలహానిస్తుందని నా ఆశ.

—: అనువాదకుడు :—

చల్లగుళ్ల వెంకటసుబ్బారావు

ముక్కపాడు. దోసపాడు పోష్టు, కృష్ణాజిల్లా

# రెండు మాటలు

"మాది అభ్యుదయకవిత్వం. మేముఅభ్యుదయ కవులం మాకవిత్వమంతా విజ్ఞానులకే, మాకవిత్వంలోనే నూతన భావాలు యిమిడివున్నాయి" ఇదికొంతమంది రచయితల ప్రద్దేశ్యాలు—అంటేమిగిలినవాళ్ళంతా అల్పజ్ఞానులని, తామే సర్వజ్ఞులమని అనుకొనే మహానుభావులుంటారు. కొందరు యీదృష్టితోనే ఏవేవోరాస్తారు. అందులో అహంభావపద జాలం మిక్కుటంగావుంటుంది.

ఈనాడువెలువడుతున్న సాహిత్యసర్వస్వప్రయోజనం ఏమిటి? అన్నవిషయంపై పౌర్వాపర్య పరిశీలన__జరిపి అక్షర జ్ఞానంగల అయిదారుగురుకూడి ఒకసంఘంగానో, పరిషత్తు కలాలుతీసుకుని పరస్పర ప్రశంసలు చేసుకోడం, లేదా జకీయవర్గపు అదృశ్యహస్తాల్లో కీలుబొమ్మలుగాతయా త్యాన్ని హతంచేసుకొని, ప్రచార సాహిత్యాన్ని చేసి దానికి "ప్రజాసాహిత్యం అనేఘోషావేసి నడ అనేనిర్ణయానికివచ్చారు నునవినుగ్రకులు .

శ్రమచేసేవాడు నాలుగుడబ్బులు ఎక్కువరాబట్టుకో చేయించుకునేవాడు తక్కువయిప్పడానికిమూస్తాడనేది త్వం. ఇలాభిన్నప్రయోజనాలు, భిన్నఆశయాలువున్న సాహిత్యంలోనూ, వివిధప్రయోజనాలుగల సాహిత్యం కోసం వివిధసంఘాలు వుండకతప్పదు. జనాభాలో అత్య సంఖ్యాకులు శ్రామికులుకాబట్టి వారిప్రయోజనాలు ప్రతి

బింబించి వారికి మార్గదర్శక మయ్యేదానిని "ప్రజాసాహిత్యం" అంటాము. అంతేగాని స్వభావరీత్యా యీ సంఘాలు పరస్పర ప్రశంసించుకోడానికిగాని లేక ఒక రాజకీయ వర్గానికి తమవ్యక్తిత్వాన్ని అమ్ముకోడానికిగాదు. మనం మానవులం. మానవుని మధ్యనే జీవిస్తున్నాం. యీ జీవితాన్ని సుఖమయం చేసుకునేందుకే ఏపనైనా చేస్తున్నాం అందుకే విమానాలను, రైళ్ళను అనేకరకాల సాహిత్యాన్ని సృష్టించుకుంటున్నాం. అలా కాను, మానవుల భిన్నప్రయోజనాలతో మాకు సంబంధం లేదు, వాటన్నిటికీ అతీతులమంటారా? అయితే యీ మానవ ప్రపంచంలో అవస్థలు పడడం దేనికి? అంగారక గ్రహంలో జీవరాసులున్నాయంటున్నారు. అక్కడికి పయనిస్తే యీ బాధలేమీ వుండవు.

ఇక వీరికి కీదరపుట్టించే మరో విషయం. అనువాదసాహిత్యం, అనువాదకులు వీరిదృష్టిలో ప్రతిభాశూన్యులట! ఇదిఎంత ఛాందసకూపస్థ మండూకవాదమో వేరే చెప్పనక్కరలేదు. ఏ కవి ఏసంస్కర్త ఐనా మనోవికాసాన్ని తనయింట్లోకి తీసుకొస్తే భవిష్యత్వాన్ని ఆరోపిస్తూ యిలాగే కాకిగోల పెడ్తేనా? ముసలయ్యేలంతా అన్ని భాషల్లోని. మంచిని తనలో యిముడ్చుకొని కాలదోషం పట్టినవాటిని విడిచివేస్తూ యిలాముందుకు సాగిపోయేదే సజీవసాహిత్యం, పురోభివృద్ధి చెందగలిగేదినూ. ఇది జరగనినాడు నిలవనీరులాగా క్రుళ్ళిపోకొడుతుంది. ఇదిగమనించే రష్యన్లు మనమహాభారతాన్ని తమభాషలోకి అనువదించుకున్నారు. మనప్రభుత్వ సహాయప్రోత్సాహాలు లేనికారణాన మనకలాంటి అవకాశాలు లేకపోయాయి. సరైనప్రోత్సాహ

ముంటే యింకాయెన్నో క్రొత్త భావాలు, రీతులుయిముద్దు కుని మనసాహిత్యం ధనవంతమైవుండేది. ఇప్పటికీ ఆంగ్ల సాహిత్యసంపర్కమువల్ల మనభాషలోలే నినవల. ఏకాంకిక, ఏకపాత్రైక రూపాలను మనం సంపాదించుకోగల్గాము. మనప్రాచీన సాహిత్యంలోగూడా నన్నెచోడుడులాంటివారు కన్నడ మొదలైన భాషలలోనుండి పదాలనేగాక భావాలనుకూడ జొప్పించారు. అంతదాకాఎందుకు? రామాయణ మహాభారతములు తెలుగులోనికి అనువదించడం అనవసరమనేనా విరివూహ?

ఉత్తమసాహిత్యం ఒక నాగరికజాతికి ఒకఅమోఘమైన వజ్రాయుధం అదిప్రజాభ్యుదయాన్ని దృష్టిలోపెట్టుకుని సరిగ్గాప్రయోగించినప్పుడు మాత్రమే. అంతేకాదు, జాతినిమ్నోన్నత్యాలను ప్రతిబింబించేది సాహిత్యమే. జీవితంయొక్క వెలుగుచీకట్లను అవలోకనింప జేసేది సాహిత్యప్రభావమే, ఒకజాతియొక్క పురోభివృద్ధి ఆజాతియున్నత సాహిత్యాన్ని సంపాదించుకొనడంమీద ఆధారపడివుంటుంది. కానిప్రస్తుతం సమాజంవైపు మనదృష్టినిమరల్చితే అదియెటువంటి పతనావస్థలోవున్నటు గోచరిస్తుంది. నిన్నమొన్నటివరకు సమాజంఅభివృద్ధి నిరోధకంగావుంది. మార్పులేనిజీవశ్ఛవంలావుంది. కాని నేడో రేపో యీసమాజంమారిపోవాలి. మారిపోకతప్పదు. మారిపోతుంది, పెద్దపెట్టున విప్లవఝంఝా మారుతం వీచాలి... అప్పుడేనవసమాజ నిర్మాణం కుళ్ళిగూలిపోయిన శిథిలమైపోతున్న పాతసమాజపు పునాదులపైన నవసమాజ నిర్మాణం జరగాలిమనజీవితాలలోక్రొంగ్రొత్త వెలుగులువెలగాలి

నవసమాజం అనేకఅభ్యుదయ వుద్యమాల్ని జీర్ణించుకుంటూ ముందుకు శరవేగంతో పురోగమించాలి. అందుకువున్నతమైన నవ్యసాహిత్యం మనకుఎంతో అవుసరముంది, నూతనభావాలతో నూతనసమాజాన్ని పురోగమింపజేయడానికి మా ,,నవ సమాజ్‌పబ్లికేషన్స్'' పూనుకుంది. అదే మా ఆశయం కూడాను.

మనపురోగమనానికి, మన సమాజఅభ్యున్నతికి, సమాజం నూతన భావాలతో అభివృద్ధి చెందాలంటే అన్ని దేశాల సాహిత్యం కావాలి. అన్యదేశ సాహిత్య రీతులనుబట్టి మనసాహిత్యానికి పుష్టికలిగించవచ్చు. ఇతర సాహిత్యాల అనువాదాలను చాలామంది నిరసించవచ్చు స్వతంత్రి రచనలతో బాటు ప్రపంచములోని మేటి రచయితల వున్నత సాహిత్యాన్ని మీకు మా 'నవసమాజ్ పబ్లికేషన్సు'ద్వారా సమర్పించబూను కున్నాము.

భగవతీ చరణవర్మ హిందీసాహిత్యంలో వున్నత పథాలనందుకున్న ప్రఖ్యాత రచయిత. ఆయన రచనలలో ,,చిత్రలేఖ'' ప్రముఖమైంది. ,,పాపమంటే ఏమిటి? పాప పుణ్యాల్లో భేదమేమిటి? ,,అన్న సమస్యపై తర్క వితర్కాలతో కూడుకొన్నటువంటి, అందరి ప్రముఖుల చేతను వుత్తమ గ్రంథమనిపేరుబడసిన యీనవలను వుత్సాహవంతులైన యువకులు శ్రీ చల్లగుళ్ళ వెంకట సుబ్బారావుగారు సాహితీ సరస్వతికి సేవ చేయాలన్న వుదాత్తమైన భావంతో ,,చిత్రలేఖ''ను అనువదించారు, తెలుగు పాఠకలోకానికి మాచిత్రలేఖను

తొలిపుష్పముగా ఆదరించమని సమర్పించుతున్నాము. తెలుగు పాఠక లోకంలో మాకు విశ్వాసముంది. మా ప్రచురణలకు సమాదరణ పొందగలమని ఆశించుతున్నాము. మున్ముందు మరింతగా ఉన్నత సాహిత్యం అందించడానికి మీ అండదండలు, మీ ఆదరణ మాకు అవసరము. ఇక మేము పురోగమిస్తాము.

మీ ఆదరాభిమానాలను చూరగొంటూ మా రెండో ప్రచురణ నవరత్నాలు (కథల సంపుటి) త్వరలో అందజేస్తాము.

సెలవు.

నవ సమాజ్ పబ్లికేషన్స్

సంపాదకులు;- చల్లగుళ్ళ
"క్రాంతికార్"
"అజయకుమార్"

గుడివాడ
అక్టోబరు 1951



# — విషయప్రవేశం —

"మరి పాపమంటేమిటి?" అని శ్వేతాంకుడడిగాడు.

మహాప్రభు రత్నాంబరుని స్థితి గాఢమైన నిద్రనుండి మళ్ళీ పక్షి లేచినట్లయింది. అతడు శ్వేతాంకునివంక తదేకధ్యానంగా చూచాడు. "పాపమా? చాలా కఠినమైన ప్రశ్న వత్సా! అయినప్పటికీ, సహజమైనదే! నీవు పాపమంటే ఏమిటని అడుగుతున్నావు!" కోలాహలభరితమైన పాటలీపుత్రమువైపు రత్నాంబరుడు చూచెను పాటలీపుత్రములోని ఆకాశాన్నంటుతున్న పెద్దపెద్ద ప్రాసాదములు అరుణకాంతితో ఇంకనూ కనుపించుచున్నవి. "అవును! పాపానికి పరిభాష సృష్టించాలని నేను ఎన్నిసార్లు ప్రయత్నించాను. కాని అసఫలుడనైతిని. పాపమంటేమిటి? దాని నివాసమెక్కడ? దాని ఆకారమేమిటి? అన్నదొకగొప్ప చిక్కుసమస్య. ఆచిక్కును నేనింకా విడదీయలేకపోయాను. అవిరళకృషిసల్పి అనుభవమునే సాగరాన్ని తరచితరచి చూచినాగాని తెలుసుకోలేని ఆచిక్కు సమస్యకు సమాధానము నేను మీకెలా చెప్పగలను?"

రత్నాంబరుడు కొంచెమాగి— "శ్వేతాంక్! నీవు పాపాన్ని తెలుసుకోగోరితే ప్రపంచాన్ని అన్వేషించాల్సి వుంటుంది. ఇందుకుసిద్ధమైతే, బహుశా పాపాన్నిగుర్తించగలవు" అన్నాడు.

శ్వేతాంకుడు గౌరవముగా శిరమొంచి— "అందుకు నేను సిద్ధముగానేయున్నా" నన్నాడు.

"నీవుకూడా పాపాన్ని తెలుసుకోగోరుచున్నావా?" అని రత్నాంభరుడు విశాలదేవ్‌నుఅడిగాడు.

విశాలదేవ్‌కూడా శిరమొంచి- "అవును" అన్నాడు.

రత్నాంభరుని ముఖముప్రసన్నముచే ప్రకాశించెను. "ఇందుకుముందు మిమ్ములను అనుభవప్రాప్తికోసం ప్రపంచములోనికి పంపుతున్నాను. పరిస్థితులకు మిమ్ముల పరిచితుల చేయడం అవసరము. ఈనగరంలోని ఇద్దరి మహానుభావులను నేనెరుగుదును, వారి ఇద్దరిసహాయం మీకార్యానికి చాలా అవసరము.ఒకరుయోగులు—ఇంకొకరుభోగులు. యోగిపేరు కుమారగిరి—భోగిపేరు బీజగుప్తుడు. మీఇద్దరి జీవితాన్ని వారిజీవిత ప్రవాహంలోకలిపి ప్రవహింపచేయాలి."

ఇద్దరుశిష్యులు ఏకకంఠముతో "అంగీకారమే" అన్నారు

"విశాలదేవ్! నీవుబ్రాహ్మణుడవు. నీకుఆరాధనయెడ అనురక్తిమెండు.కాబట్టి కుమారగిరి శిష్యుడవగుట నీకు వీలగును శ్వేతాంక్! నీవు క్షత్రియుడవు నీకుప్రపంచముయెడ అనురక్తి గలదు. కనుకనీవు బీజగుప్తుని సేవకుడవుగా వుండాలి".

ఇద్దరూ ముక్తకంఠంతో "అంగీకారమే" అన్నారు.

మీఇద్దరి మార్గంనిశ్చితమైపోయింది. ఇంకమిగిలింది నేను. మీరునన్నుగురించి విచారించవలదు జీవితానికిఉపాసన ఎంతఅవసరమో, అనుభవముకూడాఅంతే అవసరము మీరు అనుభవాన్ని పొందండి—నేనుతపస్సుచేస్తాను. ఒక సంవత్సరముతరువాత మీరుతిరిగి నాతోఇచ్చటే కలుసుకోండి. అప్పుడుమనం ఒకనిశ్చితమైన మార్గాననుసరించుదాము".

"కాని ఒకవిషయం జ్ఞాపకముంచుకోవాలి. అధ్యయన మునద్వారా తెలుసుకోలేనటువంటి విషయాన్ని అనుభవం ద్వారా తెలుసుకోగలుగుతాము. అందుకేనిమ్ములను బాహ్య ప్రపంచములోనికి పంపించుచున్నాను. కానిమీరుస్వయంగా ఆ వాతావరణ ప్రవాహంలోపడి కొట్టుకపోవద్దు, ప్రపంచంలో నిత్యంలేస్తున్న అలల్లో మీరుతప్పకపడతారు. కాని ఎక్కడా మునిగిపోకుండా జాగ్రత్తనుతీసుకోండి".

శ్వేతాంక్, విశాలదేవులు ఒకరిముఖంవంక ఒకరు చూచుకొన్నారు.

రత్నాంభరుడు కొంతతడవు మౌనమువహించి ఇట్లు చెప్పనారంభించెను — "మీరువెళ్ళబోయేపరిస్థితులను మిమ్ముల ముందుగా పరిచితులచేస్తాను. కుమారగిరియోగి ప్రాపంచిక వ్యసనములన్నింటిని జయించాననుకొంటాడు. ప్రపంచమంతా అతనికివిరక్తి, అతనిఉద్దేశ్యమునునుసరించి అతనుసుఖాన్నిగూడా పొందాడు. అతిలో ప్రకాశమున్నది—ప్రతిభయున్నది— శారీరకబలమున్నది— ఆత్మికబలముగూడానున్నది. అందరూ అనుకొంటునట్లే అతడుమమత్వాన్నివశీభూతం చేసుకొన్నాడు కుమారగిరి యువకుడు యవ్వనము—విరాగముకలసి అతని లో ఒకరకమైన అలౌకికశక్తిని ఉత్పన్నంచేశాయి నిగ్రహమే అతని సాధనము—స్వర్గమేఅతనిలక్ష్యం విశాలదేవ్! ఆ కుమారగిరియే నీగురువగును".

"శ్వేతాంక్! బీజగుప్తుడు భోగి. అతనిహృదయంలో యవనోత్సాహం, కండ్లలో మదిరామాదకత్వం ఇంద్రియ

న్నాయి. ఆతని విశాలభవనంలో, భోగవిలాసాలు నాట్యమాడుతుంటాయి. రత్నజటిత మధుపాన పాత్రలలోనే ఆతని జీవిత సుఖమిమిడియున్నది. వైభవ, ఉత్సాహం, అనేకరంగాలలో నిత్యం అతడు హాయిగా ఆడుకొంటూవుంటాడు. ఆతనికి సిరిసంపదలకులోటులేదు. అతనిలో సౌందర్యమున్నది. శరీరంలో ప్రపంచములోని సర్వవ్యసనాలు నివాసంచేస్తున్నాయి. అతని ద్వారం వద్ద మాతంగకన్యలు - ఉద్రూపతలూగుతూవుంటారు. భవనంలో సౌందర్యమదంతో మదించిన నాట్యకత్తెలు నాట్యం చేస్తూఉంటారు. ఈశ్వరుడంటే ఆతనికి విశ్వాసంలేదు. అసలు ఈశ్వరునిగురించి యెన్నడూ ఆలోచించికూడాఉండడు. స్వర్గం-నరకం-అనేవిచారమతనికిలేదు. ఆనందమే ఆతనిజీవితసాధన-లక్ష్యంకూడాఅదే. అట్టిబీజగుప్తునకు నీవు సేవకుడవుగా ఉండాలి. శ్వేతాంక్! నీకిష్టమేనా?"

"మహాప్రభువులఆజ్ఞ అనుసరణీయమైనది"

శ్వేతాంకుడు ఒక్కసారి ఐశ్వర్యములోపుండేసుఖాన్ని అంతుతెలుసుకొందామనే మధురకల్పనలోమునిగాడు.

"విశాలదేవ్! నీకిష్టమేనా?"

"మహాప్రభువులఆజ్ఞ అంగీకారమే" విశాలదేవ్ యవ్వనము — విరాగముల మిశ్రణతో ఉత్పన్నమయ్యేశక్తి యొక్క మహత్తును తెలుసుకోగోరుచుండెను.

"అయితే అల్లేజరుగుతుంది" అనిరత్నాంబరుడు లేచి నిలబడినాడు.

రెండవరోజు కుటీరముఖాళీయైనది. గురువుగుప్తమైన సాధనాక్షేత్రంలోనికి—శిష్యులుఅగాధమైన ప్రపంచములోనికి పయినమైవెళ్ళారు.

# 1.

తొణికిసలాడుతున్న మధుపాన పాత్రను చిత్రలేఖ నోటికందిస్తూ బీజగుప్తుడన్నాడు. "చిత్రలేఖా! జీవితసుఖమంటే ఏమిటో నీకు తెలుసా?"

చిత్రలేఖ అర్ధనిమీలితనైన నేత్రాలు మాదకత్వ భరితమైయున్నవి. ఆననకపోలాల్లో ఉల్లాసం. యావనోత్సాహంలో సౌందర్యాల హాసలు వరుసగా లేస్తున్నాయి. ఆమె కౌగిలింతలో వాసనావృత్తి నాట్యమాడుతున్నది. ఆమె కొంచెము మధుపానమును సేవించింది. తరువాత చిరునవ్వు నవ్వింది. ఒకక్షణంపాటు చిత్రలేఖ అధరములు ప్రియుని అధరములతో మౌనభాషలో సంభాషించాయి. తరువాత మెల్లగా జవాబిచ్చింది. "ఆనందము"

అది అర్ధరాత్రి సమయము. బీజగుప్తుని భవనం సహస్ర దీపికలతో వెలుగొందుతూంది ద్వారంవద్ద సంగీత వాయిద్యాలు మారుమ్రోగుతున్నవి. నగరంలోకెల్లా సర్వ శ్రేష్ఠమైన నర్తకే చిత్రలేఖతో తనకేళిమందిరంలోబీజగుప్తుడు యవనోత్సాహంలో నిమగ్నుడై యున్నాడు. బైట అంధకారయుతమైన ప్రపంచం.

"యవ్వనంయొక్క అంతమేమిటా? యని ఆలోచిస్తున్నాను చిత్రలేఖా!" అని నవ్వుతూ అన్నాడు బీజగుప్తుడు.

చిత్రలేఖకూడా నవ్వింది. కాని ఆనవ్వు క్షణభంగురమే. అకస్మాత్తుగా ఉల్లాసభరితమైన ఆ తియ్యని నవ్వు, వేదనాయుతమైన గంభీరతగా మారింది. ఆమె ఈ ప్రశ్నను ఎప్పుడో వేయాలనుకొన్నది. ఎక్కువసమయం ఆలోచించలేనంతటి భయంకరముగానున్నదా ప్రశ్న. అమె తల తిరుగ నారంభించినది. కాని వెంటనే ఆ విచారసమయాన్ని మధుపాన పాత్రలో ముంచివేసింది. నేను ఈ ప్రశ్నను విని త్రుళ్లిపడింది "జీవిత మృత్యువు".

"జీవితమృత్యువు! ఇది అసంభవము. యవ్వనంయొక్క అంతము. ఒక అజ్ఞాతయుతమైన అంధకారం. ఆ అంధకారములో ఏమి మరుగుపడియున్నదో, దానిని తెలుసుకోవాలనే కోర్కె నాకులేదు. మనకు ప్రయోజనం లేనటువంటి భూత-భవిష్యత్తులు కల్పనాయుతమైనవి. వర్తమానమే మన ఎదుట నున్నది. ఆ................" అంటూ బీజగుప్తుని కంఠమాగిపోయింది. బహుశా ముందు కావలసిన శబ్దాలను వెతుకుటకు కాబోలు.

"ఆ ఉల్లాసమే, విలాసము. ప్రపంచసారం-సుఖమే. అదే యవ్వనరసం" అని నవ్వుతూ చిత్రలేఖ వాక్యాన్ని పూర్తిచేసింది.

బీజగుప్తుడు తనబాహుపాశములో చిత్రలేఖనుబంధించి "నీవు నామాదకత్వానివి"వన్నాడు. చిత్రలేఖజవాబుగా "నీవు నాఉన్మాదివి" అన్నది.

చిత్రలేఖ కేవలంనాట్యకత్తె. వేశ్యమాత్రంగాదు. పాటలీపుత్రపు ఒక సుందరమైన నాట్యకత్తె వేశ్యావృత్తినవలంభించకపోవడం అసాధారణమైన విషయమే. కాని అమెకొక కారణమున్నది కారణానికి ఆమెగతజీవితానికి కనిష్టసంబాధమున్నది.

చిత్రలేఖబ్రాహ్మణవిధవ ఆమెను పదునెనిమిది వత్సరముల వయస్సునందే వైధవ్యము ప్రాప్తించినది విధవరాలు అయినప్పటినుండి నిగ్రహపాలనే ఆమెకు నియమమయిపోయింది. ఆమెహృదయంలో ఒకరోజున కృష్ణాదిత్యుడనే యువకుడు ప్రవేశించాడు. ఆతడు క్షత్రియశూద్ర వర్ణసంకర పుత్రుడు.అందమైనయువకుడు.అతని సౌందర్యం ప్రత్యేకఆకర్షణాయుతమైనది. కృష్ణాదిత్యుడు విధవరాలైన చిత్రలేఖ తపస్సును భంగపర్చాడు.

ఇంతకాలంగా వాడియున్న చిత్రలేఖ యవ్వనకుసుమ వికసించింది. ఆమె వైరాగ్యతేజము ఉల్లాసమనే ప్రకాశంలో విలీనమైపోయింది.ఇప్పుడు చిత్రలేఖజీవితం మారిపోయింది "మనం జీవించియున్నంతకాలం మనలనెవ్వరూ వేరుచెయ్యజాలరు. వేరుపడం"అని శపథం చేశాడు కృష్ణాదిత్యుడు. అతని

శభధాన్ని విశ్వసించింది చిత్రలేఖ. తరువాత ఆకాస్త జరిగి పోయింది.

చిత్రలేఖ గర్భవతయ్యింది. అగు ప్తపేమ పపంచానికి వెళ్ళడి అయింది. తలి దండులు ఇద్దర్ని ఇంటినుండి బహిష్కరించారు. గర్భవతియైన చిత్రలేఖను తీసుకొని కృష్ణాదిత్యుడు భిక్షువుడుగా కలవర ప్రపంచములో కలసి పోయ్యాడు. త్యాగమూర్తియైన కృష్ణాదిత్యుడు సమాజంచే వంచితుడైనాడు. అవమాన భరితమైన జీవితంమీద ఆతని కసహ్యం వేసింది. అవమాన భరితమైన జీవితంకంటే మృత్యువే మేలని తోచింది. భౌతిక దేహాన్ని త్యజించాడు కృష్ణాదిత్యుడు. ఇక ఈపపంచములో మిగిలింది చిత్రలేఖమే. చిత్రలేఖను ఒక నాట్యకత్తె ఆశ్రియమిచ్చింది.

చిత్రలేఖను ఒక బాలుడు జనించాడు, కాని వెంటనే మృత్యుడైనాడు. చిత్రలేఖ కంఠంలో మాధుర్యత శరీరంలో సౌందర్యం ఉన్నాయి. ఆశ్రయదాత నర్తకి చిత్రలేఖను నృత్యము, సంగీతకళా నేర్పించి. తరువాత చిత్రలేఖకూడా నాట్యకత్తె అయింది. భోగ విలాసాలు ఆగిపోయినాయి. తిరిగి మరొక్కసారి నిగ్రహంలో నిగ్గుతేల యత్నించింది. కృష్ణాదిత్యుడు పుత్రుడు ఆమెహృదయాకాశంలో ఉదయించారు, హాస్తమించారుకూడా. కాని వారు ఆమెహృదయంలో స్మృతి చిహ్నలనుమాత్రం విడచివెళ్ళారు.

పాటలీ పుత్రములోని జన సముదాయమంతా చిత్రలేఖ పాద పద్మాలమీద వ్రాలిపోతుంది. కాని ఆమె తన

నిగ్రహ తేజమునకు కాంతి విహీనతనుమాత్రం రానీయకుండా కాపాడు కొంటున్నది. పెద్ద పెద్ద శక్తిశాలురైన సేనానాయకులు, సామంతులు, ధీమంతులు, లక్షాధీసులైననవయువకులు ఆమె పరిణయ ప్యాసక్తులై యున్నారు. కాని ఎవ్వరూఅనుభవించలేక పోతున్నారు. జన సముదాయ సమక్షమున అనుపమ సుందరి చిత్రలేఖ విద్యుద్దీపంలాగా ప్రకాశించి, లుప్తమైపోతుంది. ఆమె నొక్కసారి చూచినవారికి తిరిగి ఎన్నో పర్యాయములు చూడాలనే ప్రబలకోరిక జనించుట అతిశయోక్తిగాదు.

ఒకరోజు బీజగుప్తుడు చిత్రలేఖ నృత్యాన్ని చూడడానికి వెళ్ళాడు. నృత్యంచేస్తూ చేస్తూ చిత్రలేఖ దృష్టి బీజగుప్తునిపై ప్రసరించింది. అగస్మాత్తుగా ఆమె శ్వేత వర్ణముఖియైనది. కృష్ణాదిత్యుడే స్వర్గాన్నుండి తననృత్యాన్ని చూడడానికి వచ్చాడా అనిపించింది. తనకు తెలియకుండానే ఆగిపోయింది. ఎదుటనున్న ప్రేక్షక లోకాన్నిగూడామరచి ప్రత్యక్షముగానే బీజగుప్తుని చూడసాగింది. బీజగుప్తుడు ఇరువదిన్నైదు వత్సరముల యువకుడు. చిత్రలేఖ సౌందర్యానికి వశీభూతుడై ఆమెవంక తదేకధ్యానంతో చూస్తున్నాడు. ఇద్దరి నైనాలు పరామర్శించుకున్నాయి. ప్రేక్షకలోకంగూడా చిత్రలేఖ చూస్తున్న వ్యక్తినే చూడసాగింది. "అరె! అతను బీజగుప్తుడే!" అనేశబ్దం ప్రేక్షక లోకాన్నుండి ఒకసారిగా వెలువడింది.

చిత్రలేఖగూడా ఈశబ్దాన్ని ఆకర్షించింది. తన పొరబాటుకు పశ్చాత్తాపంగూడా చెందినది. కొంచెము క్రోధం





గూడా కలిగింది. బీజగుప్తుని వైపునుండి దృష్టిని మరల్చి నృత్యం చేయసాగింది. నృత్యం సమాప్తమైన పిమ్మట బీజగుప్తుడు చిత్రలేఖ సమక్షమున వాలిలాడు. „ఎప్పుడైనా తమ స్వస్థానములో తమ దర్శనంచేసే భాగ్యం నాకు లభించుతుందా?" అని ప్రశ్నించాడు.

చిత్రలేఖ బీజగుప్తునిచూచి నవ్వింది. „లేదు! నాకు ఎప్పుడూ ఒకవ్యక్తితో పనిలేదు. నేను కేవలం జనసముదాయంలోనికి వస్తాను ఏవ్యక్తికీ నాజీవితంతో ఏసంబంధమూ లేదు" అన్నది.

బీజగుప్తునిఆశ నిరాశైపోయింది. అతని ముఖకమలం ముడుచుకపోయింది, అయినప్పటికి సాహసించాడు „వ్యక్తులతోనే సముదాయ మగుచున్నది. కాబట్టి సముదాయం యొక్క ఉల్లాసం దానిప్రత్యేకవ్యక్తి ఉల్లాసమె. అయినప్పుడు ఈభేదమెందుకు?"

"భేదాన్ని తెలుసుకోదలిస్తే విను. సముదాయ ఉల్లాసమనేది. దాని వ్యక్తుల శక్తి సంగ్రహము. బలమైన వ్యక్తుల కోర్కెలు సంఘటితమై, సముదాయంద్వారా ఉత్పన్నమై, కాంతిరూపము పొందగలుగుతుంది. సముదాయంవల్ల ఏ హాని లేనటువంటి చోటవ్యక్తియొక్క మమత్వ భావన భయోత్పాదక కేంద్రంగా తయారవుతుంది "

బీజగుప్తుడు ప్రేమించడానికి వెళ్లాడుగాని సిద్ధాంతమును తర్కించుటకుగాదు. "అయితే నాకు మీలో స్థానంలేనట్లుకోవలసిందేనా? " అన్నాడు.

చిత్రలేఖ గంభీరాన్ని విడవకుండానే జవాబిచ్చింది. "వ్యక్తి కొరకా? అవును వ్యక్తి సముదాయములోని భాగమైతే లేదు".

బీజగుప్తుని ముఖముమీద నిరాశజనితమైన చిరునవ్వు ఉదయించింది. "వ్యక్తిత్వమే జీవితానికి ప్రధానమైతే, వ్యక్తుల సమూహామే సముదాయమౌతుంది. వ్యక్తి వరిత్యుడై నప్పుడు ఆ వ్యక్తి సముదాయంలో ఒక వ్యక్తినని చెప్పుకోవడం తనను తాను అవమానించుకోవడమే" అని శీఘ్రవేగంగా అచ్చటనుండి వెళ్ళిపొయ్యాడు.

బీజగుప్తుడు వెళ్ళిపొయ్యాడు. కాని అతడు చిత్రలేఖ హృదయంలో కల్లోలాన్ని రేకెత్తించి మాత్రం వెళ్లాడు.

ఎన్నో దినాలు త్వరగా గడచిపోయినాయి. చిత్రలేఖకు మాత్రం బీజగుప్తుడు కనుపించలేదు. చిత్రలేఖ హృదయాకాశంలో నిశ్వాసమేఘాలు మెల్లగా అదృశ్యమైనాయి. బీజగుప్తుని స్మృతి నక్షత్రాలు వెలుగొందసాగాయి. నృత్యమండలములో తూగుచున్నప్పుడు ఎప్పుడూ ఆమె నైనాలు బీజగుప్తుని అన్వేషిస్తూనే ఉంటాయి. కాని తుదకు నిరాశ శరణ్యమౌతుంది.

ఆ అభిలాషను అణచుకొనేందుకు లక్ష ప్రయత్నాలు చేసినాగాని, పొంగి పొర్లిపోతూనేయున్నది. "బీజగుప్తుడనే వ్యక్తి ఈ నగరంలో ఉన్నాడా?" అని అడిగింది ఒకనాడు తన దాసీతో చిత్రలేఖ.

"బీజగుప్తుని ఎవరు ఎరుగరమ్మా? ఆయన ఈనగరంలో కల్లా, అందమైన ప్రతిభాశాలియైన, యువసామంతులు". అని జవాబుచెప్పిందిదాసీ. చిత్రలేఖ ఒకఉత్తరాన్నివ్రాసి బీజగుప్తునకివ్వమని దాసీచేతికిచ్చింది.

దాసీ బీజగుప్తున కిచ్చిందా ఉత్తరం. దానిలోఇలా వ్రాసివుంది. "చిత్రలేఖ చాలాతర్కించి, ఆలోచించినమీదట ఒకవ్యక్తి తనజీవితంలో ప్రవేసించగలడన్నా నిశ్చయాని కొచ్చింది. ఆవ్యక్తి ఒక్క బీజగుప్తుడే." ఉత్తరము చదువుట తోడనే హృదయభారం తగ్గినట్లయింది. శరీరానికి సుఖవంతమైన గాలితగిలినట్లనిపించినది. ఆరోజునుండే, ఆరెండుప్రాణుల కలయికజరిగింది. అయినప్పటికి చిత్రలేఖ వేశ్యమాత్రంగాదు.

"మాదకతా! ఉన్మాదము! ఈరెండిటికి అవినాభావసంబంధమున్నది. ఎల్లప్పుడూ ఇవికలసి మెలసి ఉండగల వ" న్నాడు బీజగుప్తుడు నవ్వుతూ. చిత్రలేఖగూడా నవ్వింది.

ఈసమయంలో మంగళవాయిద్యాలుఆగిపోయినాయి శ్రీమాన్! ద్వారంవద్ద ఎవరోఅతిథులున్నారు. ఏమిఆజ్ఞ?" అని బిగ్గరగాకేకపెట్టాడు పరిచారికుడు,

బీజగుప్తుడు బాహుపాశాన్ని సడలించాడు. చిత్రలేఖ తొలగి కొంచెము దూరముగాకూర్చున్నది. "అతిథులనుఇచ్చటకురానీ" అనిచెప్పాడు పరిచారికునితో బీజగుప్తుడు. మధుపాత్రను ఖాళీచేశాడు.

అర్ధరాత్రి సమయమున వచ్చేఅతిథులెవ్వరా? యని బీజగుప్తుడాలోచిస్తున్నాడు. ఇంతలో శ్వేతాంక్ సహితముగా,

రత్నాంభరుడు బీజగుప్తుని కేళీమందిరమున ప్రవేశించాడు. రత్నాంభరునిచూచి బీజగుప్తుడు లేచినిలబడి అభివందనమాచరించాడు. చిత్రలేఖ కొంచెము శిరమొంచినది.

కేళీమందిరమంతా ఒక్కసారి బాగా పరికించినమీదట రత్నాంభరుని నైనాలు చిత్రలేఖవద్ద ఆగిపోయినాయి. "నగరంలోకల్లాసుందరి! పైగా పవిత్ర నర్తకి! అర్ధరాత్రిసమయంలో బీజగుప్తుని కేళీమందిరములో! ఆశ్చర్యము!" అన్నాడు కొంచెమాగి రత్నాంభరుడు. ఈ మాటలను అని రత్నాంభరుడు ఆసనాన్ని అధిష్టించాడు. శ్వేతాంకుడు నిలబడియేయున్నాడు.

"మహాప్రభువులు ఏదో కారణంమీద ఈ దాసుని యందు దయచేత చాలా ప్రయాసపడి వచ్చుటకేతువరయ వచ్చునా?" అన్నాడు బీజగుప్తుడు.

రత్నాంభరుడు నవ్వి—బీజగుప్తా! నీతో ఉన్న యథార్థాన్ని చెప్పుచున్నాను. నేను నా ఈ శిష్యుడు పాపమంటే ఏమిటని ప్రశ్నించాడు. నేను తగిన జవాబు చెప్పటానికి అసమర్థుడను. నీవు నాకు సహాయపడగలవు. నీవు గూడా నా శిష్యత్వం చేసియున్నావు. కాని నిన్ను ఎప్పుడూ గురుదక్షిణ కోరియుండలేదు. పాపానికి సరిగ్గా పరిభాష తెలుసుకోవాలంటే బ్రహ్మచారి కుటీరము ఉపయుక్తముగా నుండదు. ప్రపంచ భోగవిలాసములలోనే పాపం జాడ తెలుసుకోగలుగుతాడు. నీభవనం, నీ ఈ సమాజం— వీటితో శ్వేతాంకునకు తెలియజేయవలసిన అవుసరమున్నది. ఇందుకనే ఈతనిని నీవద్ద సేవకరూపంలో నియమించు

చున్నాను. నీవు ఈతనిని సేవకుడుగా స్వీకరించ గోరు చున్నాను. కాని ఒక విషయం మాత్రం గుర్తుంచుకో—ఈతడు నీసహాధ్యాయ సోదరుడుగూడా.

‹‹మహాప్రభువుల ఆజ్ఞ అనుసరణీయమైనది›› అన్నాడు శిరానొంచి బీజగుప్తుడు.

‹‹మంచిది! యిక నేను వస్తాను—నాపని ఒకటిపూర్తి యైనది. శ్వేతాంక్! వీరు నీ ప్రభువులు—నీవు వీరి సేవకుడ వని మాత్రం గుర్తుంచుకో. ఈ వైభవాన్ని అనుభవించు. పాపం ఎలాఉంటుందో తెలుసుకోవడానికి ప్రయత్నించు. మంచి, చెడులుగూడా నీకన్నులకు పొడచూపుతూ ఉంటాయి. కాని నీకు మంచిని కలుగజేస్తూ, ఇతరులనుగూడా మంచిని కలుగజేసేవే మంచిలనే గీటు రాతిని ఆధారము చేసుకొని మాత్రం ఉండు. బీజగుప్తా! నీతో మరొక విషయాన్ని చెప్పదలచా. శ్వేతాంకుని దోషాలను మాత్రం మన్నించుతూఉండు. బాహ్యప్రపంచములో ఇప్పుడిప్పుడే అడుగిడుచున్నాడు. ఏమీఎరుగని అమాయకుడు›› అని చెప్పి రత్నాంభరుడు కేళిమందిరాన్ని విడచి వెళ్లాడు.

రత్నాంభరుడు వెళ్ళిన తరువాతబీజగుప్తుడు శ్వేతాంక్ వైపుకు ధ్యానముగా చూచాడు. “నీపేరు శ్వేతాంకుడా? నేటినుండి నీవు నాసేవకుడవు” ఈవ్యాఖ్యానన్న తరువాత బీజగుప్తునిమోమున చిన్ననినవ్వు ఉదయించినది. ‹‹శ్వేతాంక్! ఈమె ఎవ్వరో నీకుతెలుసా?›› అని ప్రశ్నించాడు చిత్రలేఖ వైపుకు సాంకేతంచేస్తూ బీజగుప్తుడు.

రాత్రిసమయంలో జ్యోతులలాగావెలుగొందె శ్వేతాంకుని నైనాలు, అలంకృతమైన కేళీమందిరములో చిత్రలేఖ సౌందర్యాన్నిచూచి, మిరిమిట్లు గొలుపాయి. ‹‹ఎరుగను›› అన్నాడు.

‹‹మంచిది! అయితే విను. ఈమెపేరు చిత్రలేఖ. ఈమె పాటలీపుత్రమున సర్వ సౌందర్యవతియైన నాట్యకత్తెయైయుండికూడా నాకు పత్నిసమానురాలు, కాబట్టి ఈమె నీయజమానురాలు›› అంటూ పకపకా నవ్వాడు బీజగుప్తుడు. ‹‹నీవు ఆశ్చర్యపడి ఉంటావు. దీనిలో ఆశ్చర్యపడవలసినదేమీలేదు. ఇక్కడనీవు పరిస్థితులను తెలుసుకో గలుగుతావు. మంచిది! ఈమధుపాన పాత్రను, మీయజమానురాలుకివ్వు›› అని బీజగుప్తుడు సుగంధితమైన మధుపానపాత్రను శ్వేతాంకుని చేతికిచ్చాడు. శ్వేతాంకుడు మధుపాత్రను చిత్రలేఖ వైపుకు అందించాడు. ఆపాత్రను తీసుకొనేటప్పుడు ఆమె హస్తం ఈతని హస్తాన్ని స్పర్శచేసింది. శ్వేతాంకుని శరీరమంతా కంపించి పోయింది. చిత్రలేఖ శ్వేతాంకుని వైపుకు చూచింది. ‹‹నవయువకా! నీవు ప్రథమముగా ఈవిలక్షణ ప్రపంచములో పాదార్పణం చేసినందులకు నాధన్యవాదాలు›› అని ఆమె మధుభాండమును ఖాళీచేసింది.

నిద్రించు వేళయైనదని పరిచారికుడు సూచన యిచ్చాడు.

‹‹ఇచ్చటే వుంటావా, లేక నీభవనానికి వెళతావా?›› అన్నాడు బీజగుప్తుడు చిత్రలేఖతో.

చిత్రలేఖ లేచి నిలబడింది, „నాభవనానికి వెళ్ళ డమే ఉచితమను కొంటున్నాను. బహుశా వంటరిగా వెళ్ళ జాలనేమో?" అంటూ ద్వారం వైపుకు సాగింది చిత్రలేఖ కాళ్ళు తడబడుతున్నాయి.

పరిచారకుడు కేళీమందిరమున ప్రవేశించాడు. బీజగుప్తుడు గూడా లేచి— „అవును. ఇప్పుడు వంటరిగా వెళ్ళడం సమంజసముగాలేదు" అన్నాడు.

„ద్వారంవద్ద రథం ఆగియున్నది. దానిలోని కెక్కించుకొని మీాయజమానురాలును, ఆమెభవనమునకు చేర్చేరా ఇంతలోనే శయనాగృహ ఏర్పాట్లుచేయించుతాను" అన్నాడు కొంచె మాలోచించి బీజగుప్తుడు. శ్వేతాంకుడు చిత్రలేఖ వెంట వెళ్ళాడు. బీజగుప్తుడు శ్వేతాంకుని శయనా గృహ ఏర్పాట్లు చేయమని పరిచారకునకు ఆజ్ఞాపించి నిద్రాదేవి శరణజొచ్చాడు.

## 2.

కుమారగిరియోగి. సర్వసంఘపరిత్యాగి. ఈ కలవర ప్రపంచములో శాంతిలేదు. అన్నీ కలతలే. అందుకనే ఆయన అలౌకికమైన కల్పనా ప్రపంచాన్ని ఆకాంక్షించుచున్నాడు. అచ్చటే పరిపూర్ణమైన శాంతి లభించుతుందని ఆయన విశ్వాసం అందుకనే నిర్జన ప్రదేశంలో నుండనారంభించాడు.

సంయమపాలన ఆయనకు అతి ప్రియమైనది. బ్రహ్మచర్య వ్రత పాలకుడు. కోర్కెలన్నీ ఆయనకు వశీభూతాలైనాయి.

యోగి కుమారగిరి సర్వశక్తి సంపన్నుడుకూడా. అయితే వాటిని ప్రయోగించి చూడడం ఆయనపనిగాదు. వాటిని నియమిత మార్గాన్ని నడుపుటయె ఆయనధేయం. ఏకాంతములో ఆయన మనస్సు ఎక్కువ లగ్నమైయుంటుంది. ఏకాగ్ర చిత్తుడై దేనినైనా అభ్యసించగలడు. అయన చిత్తముతో పాటు శరీరాన్నిగూడ నియమములో సరళంగా బంధించాడు. అప్పుడప్పుడూ శరీరంలో లేచే సహజఉష్ణతను అలౌకిక కల్పనా ప్రపంచమనే ఆశ శీతలపర్చుతూ ఉంటుంది. కోర్కెలను అణచివేశాడు. కోర్కెలవల్లే మానవుడు పాపం చేస్తాడని అయన విశ్వాసం.

యోగి కుమారగిరి సుఖవంతుడు. ఎప్పుడూ సదాలోచనా సాగరంలో మునుగుతూ తేలుతూ ఉంటాడు. వాసనా తృప్తి ఆయనకు చాలాదూరము. ఇచ్ఛాపూర్తి జరుగలేదనే పరితాపం అసలేలేదు. సుఖకల్పనమే ఆయనకు తృప్తి. ఏరకమైన విచారం లేనప్పుడు తృప్తికి నిజంగా మహత్తు లేనే లేదు. ఆయనహృదయానికి అనవసరమైన భారాన్ని ఎన్నడూ కలుగచేయడు. దుఃఖాన్నుండి కల్పనా ప్రపంచములోనికి మనస్సును మరలించడం అతి సులభం. కుమారగిరి ఎల్లప్పుడూ ఆత్మ విస్మృతిలోనూ, సజీవమైన కల్పనా తరంగాలలోనూ, ఆనందమును అనుభవించుచుగా ఉంటాడు. కాల్పనిక కోరిక, కాల్పనిక తృప్తిలోనుండి ఉత్పన్నమైన సుఖంలో నిమగ్నుడైయుంటాడు.

కనుక కుమారగిరి యోగీశ్వరుడే!

మధుపాల్ కుమారగిరి శిష్యుడు. కుమారగిరి శక్తి అతనికి తెలుసు. కాబట్టే అప్పుడప్పుడూ ఆశ్చర్యచకితుడౌతాడు.

"దేవా! బ్రహ్మచర్య లక్ష్యమేమిటి?" అనిమధుపాలు ప్రశ్నించాడు.

కుమారగిరి సరిగ్గా సంభాళించుకొని కూర్చున్నాడు.
"శాంతి, శాంతియుతమైన ఆనందము".

"దేవా! ప్రపంచ వాస్తవిక చలనమేమిటి?" అని తిరిగి ప్రశ్నించాడు.

"బాహ్యదృష్టిలో పరివర్తనము. అంతరంగిక దృష్టిలో శూన్యం... శూన్యం—పరివర్తనము—ఈరెండింటి విచిత్రసంబంధం బహుశా నీకు ఆశ్చర్యమును కలుగ జేస్తుంది. ఈ రెండింటికీ ఏరకమైన సంబంధమున్నదనే ప్రశ్న ఉత్పన్నమగుట సహజమే. కాని ఈరెండింటి బేధభావమును గ్రహించుటయే జ్ఞానముయొక్క గమ్యస్థానము. ప్రపంచమంటే?—శూన్యం—మరిపరివర్తనమో? ఆశూన్యంయొక్క సహజస్థితి పరివర్తనము కల్పన. కల్పన? అది స్వయంగానే శూన్యం. ఆంతే తెలుసుకున్నావా!"

మధుపాల్‌కు ఈజవాబు మరేమంత సంతృప్తిని కలుగ చేయలేదు. తిరిగి ప్రశ్నించాడు. "దేవా! తమరు ప్రపంచమే శూన్యమని శెలవిచ్చారు. ఇది నాకేమీ అర్ధంకావడం లేదు. కండ్లకు గోచరమయ్యేదిగూడా శూన్యం ఎలా అవుతుంది?"

కుమారగిరి ఒక్కసారిగానవ్వాడు. ,,ఇక్కడే యోగం యొక్క అవుసరము ఎంతైనా ఉన్నది. యోగి యోగంలో నిమగ్నుడై కండ్లుమూసుకొన్నప్పుడు అఖండశూన్యం తప్ప మరొకటి కనుపించదు. ఆశూన్యంలోనే సుఖ దుఃఖాలు— రాగ—విరాగములు—దిన రాత్రులు బ్రహ్మతేజమువల్ల అవన్నీగూడా మాయమౌతాయి. ఆపరికాశవంతమైన శూన్యంలో విహరిస్తాడు. వాడు అచ్చటే నిమగ్నుడౌతాడు. కాల్పనిక జీవితంలో విహరించి, విహరించి, అతడు జన్మస్థాన కేంద్రమువరకూ పోతాడు. అక్కడ కొన్ని క్షణాలపాటు ఆగుతాడు. ఆఅనంతమైన బ్రహ్మయుక్త శూన్యంలో సదా కలసిపోవడాన్నే ముక్తి అంటారు. ఈరకంగా యోగి ఈశరీరం తోనే ముక్తియొక్క అనుభూతిని పొందుతాడు.,,

మధుపాల్‌కు తనగురువుయెడ భక్తి శ్రద్ధలు పెచ్చు పెరిగాయి. గురుపాద పద్మాలనంటాడు. తన గురువుయొక్క అఖండజ్ఞానానికి తనలోతానే గర్వపడ్డాడు.గురుఅర్పితం అవ్వాలనే అభిలాష కలిగింది. ఇదేసమయంలో రత్నాంభరుడు విశాల్‌దేవ్ సహితుడై కుమారగిరి కుటీరములోనికి ప్రవేశించాడు.

రత్నాంభరునిచూచి కుమారగిరి గౌరవముగా లేచి నిలబడినాడు. ఇద్దరూ స్నేహాలింగనము చేసుకొన్నారు. తరువాత రత్నాంభరునకు ఆసనముచూపి ,,ఆచార్యులు ఏదోకారణం లేనిదే విచ్చేయరు,, అన్నాడు.

"అఖండతేజో విభూషితులైన యోగి కుమారగిరిగారిచే నాశిష్యునకు దీక్ష ఇప్పించే ఉద్దేశ్యముతో వచ్చాను," అన్నాడు రత్నాంభరుడు నిశ్చలభావంతో.

"ఆచార్యవర్యా! ఈతుచ్ఛ సేవకునికి ఉన్నతస్థానమొసంగుచున్నారు నేను అందుకు సర్వదా అయోగ్యుడను." అన్నాడు కుమారగిరి గౌరవభావంతో.

"కాదు! యోగి కుమారగిరి! ఇదిమీ ఉదారత. మీరు వాస్తవంగా సర్వశ్రేష్ఠులు. మీరీ ప్రపంచముకంటే ఉన్నత పథాన్ని అధిష్టించారు. నేనో! ఇంకా ఈప్రపంచములోనే ఉన్నాను. ఏదైనా విషయాన్ని పరిశీలించడంలో తర్కంగూడా అసమర్థత చెందినచోట, అనుభవము, లేదా కాల్పనికశక్తి సమర్థత చెందును. మీలో జ్ఞానముంది. కల్పనాశక్తి ఉన్నది. అనుభవముగూడా ఉన్నది. కాని నాలో అనుభవమొక్కటే. ఇందువల్లే మీవద్దకొచ్చాను. మీవద్ద మనుష్యుడు కఠినాతి కఠినమైన జీవిత సమస్యలనుగూడా అతి సులభంగా పరిష్కరించుకోగలుగుతాడు. కనుకనే విశాలదేవ్‌ను మీశిష్యునిగా చేయదలచాను. యోగి కుమారగిరి! మీరు నాఅనురోధాన్ని తృణీకరించరను కొంటాను. నాప్రార్థన స్వీకరిస్తారను కొంటాను."

కుమారగిరి విశాలదేవ్ వంకచూచి "వత్సా! జీవితంలో ఏరకమైన అనుభవము పొందదలచి నావద్దకు రాదల్చావు?"

విశాలదేవ్ కుమారగిరికి వందనమాచరించి, వినయవిధేయతతో జవాబిచ్చాడు—"నేను పాపమంటే ఏమిటో తెలుసుకో గోరుచున్నాను."

కుమారగిరి నవ్వాడు. ఆనవ్వులో మాధుర్యమున్నది. "పాపమంటేఏమిటో తెలుసుకో గోరుచున్నావా? ఎక్కువగా అనుభవం ద్వారానే పాపమంటే ఏమిటో భోధపడుతుంది. నావద్దనుండి నీవు దానిజూడా తెలుసుకోలేవేమో? నాక్షేత్రం నిగ్రహం. నియమపాలన. నిగ్రహ- నియమములఎదుట పాపము నిలువలేదు. అయినప్పటికీ నిన్ను నాశిష్యునిగా చేసుకోవాలని ఆచార్యులవారి అనురోధం. శిష్యునిగా స్వీకరించే ముందు ఆచార్యులయెదుటే చెప్పదలచిందేమంటే 'నీకు పుణ్యంయొక్క రూపాన్ని చూపుతాను. తద్వారా పాపాన్ని చూటగలుగుతావు" అన్నాడు కుమారగిరి.

కుమారగిరి మాటలకు రత్నాంభరుడు తనలో తానే నవ్వుకున్నాడు. "యోగి కుమారగిరి! మీరు యదార్థంచెప్పారు. దీనిలో తెలిసినవారికి ఏఅభ్యంతరమూ ఉండదు".

"ఆచార్యులవారి అనురోధం సాకృతియైనది" రత్నాంభరుడులేచి నిలబడినాడు. "యోగి! వాస్తవంగా పాపమంటే ఏమిటో నాకుతెలియదు. మీకు ఆశ్చర్యము కలుగవచ్చు. ఎన్నోవత్సరముల అనుభవము, అధ్యయనంద్వారాగూడా జ్ఞానంయొక్క గమ్యస్థానాన్ని చేరలేక పోయ్యాను. ఇప్పుడు నాశిష్యులను యోగ్యులైన గురువులకు వప్పగించాను. నేను కొంతకాలం తపస్సు చేయుదలచాను. నేనుఅధ్యయనంద్వారా

తెలుసుకో లేనటువంటి విషయాన్ని. ఆరాధనద్వారా తెలుసుకో గలుగుతానేమో చూస్తాను» అని రత్నాంభరుడు అచ్చటనుండి శెలవ తీసుకొన్నాడు.

రత్నాంభరుడు వెళ్ళినతరువాత కుమారగిరి సైగచేసి విశాలదేవ్‌ను కూర్చుండబెట్టెను.

«వత్సా! నీవు శిష్యుడవయ్యావు. కాబట్టి నిన్ను కొన్నిప్రశ్నలడుగుతాను.వ్యసనమంటే ఏమిటో నీకు తెలుసా?»

«దేవా! వ్యసనం కోర్కెలకు మరొక పర్యాయపదం మాత్రమేనని» విశాలదేవ్ జవాబిచ్చాడు.

"బాగుంది! కాని మానవుని జీవితములో వ్యసనస్థానమేదో నీకు తెలుసా? బహుశా నీకు తెలియకపోవచ్చు. దానిని నేడు నీకు తెలియజేస్తాను. వ్యసనం పాపజనితమైనది. వికారములను రేకెత్తించి, జీవితాన్ని కలుషితం చేయడానికది సాధనము మాత్రమే. వ్యసనావృత్తిచే ప్రేరేపించబడి మానవుడు ఈశ్వరీయ నియమముల నుల్లఘించుచున్నాడు. దానిలో మునిగిపోయి తనను తానేగాక సృష్టికర్తయైన బ్రహ్మను గూడా మరుస్తున్నాడు. కాబట్టి వ్యసనం తిరస్కార యోగ్యమైనది. మానవుడు తన కోర్కెలను చంపుకో గలిగితే ఉచ్ఛతర పథాన్నందుకో గలుగుతాడు. ఈశ్వరీయ గుణములు మూడు—సత్—చిత్త—ఆనందము. ఈమూడు గుణములు వ్యసనారహితమైనవి శుద్ధమనస్కులకే లభ్యపడతాయి.వ్యసనాభరితమైన మమత్వము.భ్రాంతిరహితము కానటువంటివారు వీటిల్లో ఏఒక్కదానిని పొందలేరు.విశాలదేవ్! నీవు మొదటగా

నాశిష్యుడవై చేయవలసినది ఇదే. వ్యసన్నాన్ని త్యజించి, మనస్సును శుద్ధపర్చుకోవాలి. ఇది ఒక దుఃఖరహితమైన తపస్సు. కోర్కెలను అణచడంగూడా ఒకరకమైన హింసే, కాబట్టి అసలు కోర్కెలను ఉత్పన్నము కాకుండానే చూడాలి. ఒక పర్యాయము ఏదైనాకోర్కె రేకెత్తితే అదిప్రచండరూపాన్ని దాల్చుతుంది. కాన నీప్రధాన కర్తవ్యం దానిని చేరనీయకుండానే ఉండాలి. ఈమాత్రం చేస్తావుగదూ? చెప్పు.

,,దేవా! ఇదంతా చేయడానికి ప్రయిత్నిస్తాను. కాని ఇదంతా చేయగలుగు తానని మాత్రం చెప్పజాలను. తమరు చూపినమార్గం చాలసులభమైనదే.గాని కొంచెం సంతోషించవలసిన అవుసరముగూడా లేకపోలేదు, కోర్కెలను నాశనం చేసుకోవడం, జీవిత సిద్ధాంతమునకు వ్యతిరేకముగదా? మనుష్యుడు అసలు పుట్టేది దేనికి? కర్మనుచేయడానికే. కర్మిష్టిగా తయారుచేసే ప్రధాన సాధనములను నాశనంచేయడం సృష్టి విధానానికే వ్యతిరేకముగదా? అయ్యా! తమరు నాసందేహ నివృత్తి చేసినప్పుడే తమరు చూపినమార్గా ననుసరిస్తాను.”

కుమారగిరికూడా ఈజవాబుకోసరమే నిరీక్షించుచున్నాడు. ,,నీవు చెప్పింది అనుచితముగాదు నాయనా? నీమీద వేరొక గురువు ప్రభావమున్నది. ఆప్రభావాన్ని దూరంచేసి ఆస్థానే వేరొక ప్రభావాన్ని ప్రసరింప జేయడం నాకర్తవ్యం. నేను నీసందేహనివృత్తి చేయగలను. కాని ఇప్పుడుమాత్రం గాదు. భ్రాంతిలో మునిగితేలే గురువుగారి శిష్యునిలో భ్రాంతిఉండుట ఆశ్చర్యగాదు. కాని విశాలదేవ్! ఆచార్య రత్నాంభరుని అభిప్రాయములు ఎంతవరకూ నాస్తి

కర్త్వముువైపు కొరిగాయాయని యోచిస్తున్నాను. నేను ఆస్తికుడను. సరే! ముందునీవు రెండు విషయాలనుమాత్రం ఒప్పుకోవాలి. ఒకటి బ్రహ్మఅనేవాడు ఉన్నాడు. రెండు జీవితానికి ప్రధాన అంగము కర్తవ్యము"

"దేవా! నేను ఈరెండు విషయాలను ఒప్పుకొంటున్నాను" అన్నాడు విశాలదేవ్.

కుమారగిరి లేచి నిలబడినాడు. "నేను నీకు దీక్షనివ్వడానికే నిశ్చయించాను. నీకు ముక్తిమార్గాన్నిచూపి, పాపానికి పరిచితుడను చేస్తాను" అన్నాడు.

## 3.

శ్వేతాంకుడు బ్రహ్మచారి. అనుభవరహితమైన అధ్యయనం అతనిక్షేత్రం. జ్ఞానోపార్జనే అతనిలక్ష్యం. ఇరువదినైదు వత్సరముల యువకుడు. ఈచిన్న వయస్సునందే సర్వశాస్త్ర పారంగతుడైనాడు. సజీవమైన ప్రేమువర్ణననుధ్యానంగా చదివాడు. ఎంతో విశేష సాహిత్య పఠనంగూడా చేశాడు. ప్రేమను తెలుసుకోవాలనే ప్రయత్నంగూడా చేశాడు. కాని తెలుసుకోలేక పోయ్యాడు. ఇంతవరకూ అతను స్త్రీని ఎరుగనేఎరుగడు. యవ్వన మాదకత్వానికిగూడా అపరిచితుడే.

నిష్కల్మష బ్రహ్మచారి శ్వేతాంకుడు, సర్వసౌందర్యవతియైన నాట్యకత్తె చిత్రలేఖ. అందులోనూ బీజగుప్తుని భవనంలో, ఒకేచోట కలసి మెలసి ఉండుట! మొదట చిత్రలేఖ

పరిచయం శ్వేతాంకునకిచ్చినప్పుడు బీజగుప్తుడు వ్యంగ్యముగా మాత్రమే నవ్వాడు. కాని పరిస్థితులను గురించి ఆలోచించి నప్పుడు ఆశ్చర్యకరమైననవ్వు ఉదయించిందాతని ముఖమున. బీజగుప్తుని ఆనవ్వు శ్వేతాంకుని జీవితంలో కోలాహలమును రేకెత్తించింది. నిత్యం చిత్రలేఖకు ఆమెభవనమునకు పంపించె బాధ్యత శ్వేతాంకునపై నున్నది. ఆసమయంలో చిత్రలేఖ విహారంలో మునిగిఉంటుంది. చిత్రలేఖ కండ్లలోని ఆకర్షణ శ్వేతాంకుని హృదయంలో కలవారన్ని కలిగించినది. ఒకవైపు సుందరమైనస్త్రీ, రెండవవైపు మధుపాన మహిమ!— ఈరెండూ నూనెనిండుగానున్న అగండములాగా దేదీప్యమానంగా వెలుగొందుతున్నాయి. జ్యోతిచుట్టూ తిరిగే పురుగులాగావుంది శ్వేతాంకునిస్థితి. శ్వేతాంకుడు చిత్రలేఖను చూచినప్పుడు విలక్షణమైన సుఖానుభూతిని పొందుతున్నాడు. అది ఏలాంటిసుఖం? అజ్ఞాతంలో అణగి మణగి వున్నకోరిక. చిత్రలేఖ అర్థ నిమీలితమైన కాటుకకండ్లు, శ్వేతాంకుని కండ్లలో కలసినప్పుడు పిచ్చివాడై పోతున్నాడు.

ఆభవనంలో బీజగుప్తుని సోదరునిలాగా ఎన్నబడు చున్నాడు. ఇతర సేవకులుగూడా ఇతనిని యజమానిలాగ గుర్తించు చున్నారు. భోగవిలాసములకు కావలసిన పరిపూర్ణ సాధనాలు శ్వేతాంకుని ఎదుట తాండవ మాడుతున్నాయి. నగరంలోని ప్రముఖ వ్యక్తులకు ఈతని పరిచయంగూడా జరిగింది. శ్వేతాంకుడు గొప్ప అంధకారాన్నుండి ప్రకాశవంతమైన, ప్రపంచములో ప్రవేశించాడు. అందువల్ల తనను తానే విశ్వసించలేక పోతున్నాడు. మెల్లగాపరిస్థితులను లొంగ

సాగాడు. ఈప్రపంచపు పాపపుణ్యాలలో, వాసనాయుతమైన, వికారాల ఉచ్చులో చిక్కుకున్నట్టుమాత్రం గ్రహించాడు. ప్రపంచ ప్రవాహంలోపడి కొట్టుక పోతాననే భయంగూడా కలిగింది.

ఆరోజు ఏదో అత్యావసర కార్యార్థం బీజగుప్తుడు బైటకు వెళ్ళాడు. సాయంసమయానికి రాలేకపోయ్యాడు. నియమిత సమయానికి చిత్రలేఖరథం బీజగుప్తుని ద్వారంకద్ద కొచ్చి ఆగింది. యజమానిలేని ఆగృహంలోనికి శ్వేతాంకుడే స్వాగతమిచ్చి ఆహ్వానించాడు. ఇద్దరూ బీజగుప్తుడు కూర్చునే గదిలోనికి వెళ్ళారు. బీజగుప్తుడు లేనందువల్ల— "మీయజ మాని యెక్కడ?" అని అడిగింది చిత్రలేఖ.

"మీయజమాని ఎక్కడ?" అన్నప్రశ్నను నాట్యకత్తె నోటనుండి విన్నాడు బ్రహ్మచారి. అతనిమనస్సు బాధపడింది. ఈవాక్యం బాణంలాగా హృదయమునకు గుచ్చుకొన్నది. ఈవ్యాఖ్యాన్నే మరియొకస్త్రీ నోటనుండి విన్నట్లయితే. శ్వేతాంకుడు తగిన విధముగానే జవాబిచ్చేవాడు. అతనికి గతం జ్ఞాపకమొచ్చింది. చాలా పరితాపముగూడా చెందాడు. కాని అతని మనోభావములు నణచుకొని జవాబిచ్చాడు— "ఏదో కార్యార్థం బైటకు వెళ్లారు"

"ఎప్పుడొస్తారు?"

"బహుశా వస్తూనే ఉండొచ్చు."

"శ్వేతాంక్! నాకు దాహం వేస్తుంది"

శ్వేతాంకుడు లేచి నిలచాడు. ఆత్మాభిమానం రేకెత్తింది. కాని 'ఈమె నీయజమానురాలు' అన్న బీజగుప్తుని మాట వెంటనే స్మరణకొచ్చింది. స్వర్ణపాత్రితో స్వయంగానే చల్లనినీరు తెచ్చియిచ్చాడు.

చిత్రిలేఖ మంచినీటి పాత్రినుచూచి నవ్వింది. "శ్వేతాంక్! నీప్రవృత్తి అమాయకుడవు."

చిత్రిలేఖ వ్యంగార్థాన్ని గ్రిహించలేదు శ్వేతాంకుడు. "దేవీ! నావల్ల ఏమిపొరబాటు జరిగింది?"

ఈసారి పకపకా నవ్వింది చిత్రిలేఖ. "శ్వేతాంక్! నీవు ఇప్పటికి తెలుసుకోలేక పోయ్యావు. పిపాస తృప్తిపడేది గాదు. అగ్నికి నీటఅవుసరం ఉండనే ఉండదు. దానికి కావలసినది ఘృతం జీవితమే వికలత్వ లేనటువంటి పిపాస. దానిని తృప్తి పర్చడమంటే. దాని అంతము చేయడమే. నాకు నీరు అవుసరంలేదు. మధుపానం కావాలి."

శ్వేతాంకుడు ఆశ్చర్య చకితుడైనాడు. విషయం ఎంత భయంకర మైనదో. అంత భావపూరితమైనది. శ్వేతాంకుడు గూడా నవ్వాడు. "దేవీ! నాకు బహుశా పాటలీపుత్రిపు సర్వసుందరి శిష్యత్వం చేయవలసి ఉంటుంది." అని శ్వేతాంకుడు మధుపానమును తెచ్చి చిత్రిలేఖకు అందించాడు.

చిత్రిలేఖ కొంచెము సేవించి, శ్వేతాంకుని ఎదుట పాత్రినుఉంచినది. ఆసనయంలో దిండుసహాయంతో కూర్చున్నది చిత్రిలేఖ. శిరముపై మేలిముసుగు తొలిగింది. ఆమె తలవెంట్రికలు కటికి చీకటికన్నా మిక్కిలి నల్లగా వంకిలు

తిరిగి ఉన్నవి. ఆనల్లని వెంట్రుకలలో రత్నమాల దేదీప్య మానంగా మెరుస్తూంది. ఆహా! ఆవేషమెంత అందముగా నున్నది!—శ్వేతాంకుడు ఇంత అనుపమ సుందరిని స్వప్న ములోగూడా చూచిఎరుగడు. చిత్రలేఖ యవ్వనము ఉన్మా దమునకు ప్రతిబింబముగా నున్నది అరుణకపోలములలో లాలిత్వం ఇమిడియున్నది. ఆమె ఎర్రని అధరములలో మంద హాసం తొణికిస లాడుతున్నది. ఆమె నైనాలు అందముగా నవ్వుతున్నాయి.

మౌనంగా శ్వేతాంకుడు చిత్రలేఖ అందాన్ని పరికించి చూస్తూన్నాడు. "శ్వేతాంక్! నీవెప్పుడు చూచినా మధుపాన మును సేవించినట్లుండవే? నేను నీకు మధుపానమును అందిం చాను. కాని నీవు దానిని సేవించే సాహసం చేయలేక పోతున్నావు. నిన్ను నేను ఒక ప్రశ్న అడగదలచాను. సరి యైన జవాబునివ్వాలి." అన్నది చిత్రలేక,

శ్వేతాంకుడు అంగీకారంగా తలవొంచాడు.

«నీవు బ్రహ్మచారివి. మీగురువుగారు మధుపానం సేవించొద్దని భోధించి ఉంటారు. ఎందువల్లో? తెలుసుకో గోరుచున్నాను.»

«దేవీ! ఇంద్రియ నిగ్రహం జీవితానికి ప్రధానాంగము ఇంద్రియ నిగ్రహానికి మధుపానమునకు ఘోర విరోధము.»

«ఆనిగ్రహంయొక్క లక్ష్యమేమిటి?»

«సుఖము—శాంతి»

‹‹చిత్రలేఖ మధుపానమును సేవించుతూ ప్రశ్నించింది. ‹‹అయితే జీవిత లక్ష్యమేమిటి?››

చిత్రలేఖకండ్లు మాదకత్వంతో కొంచెము కొంచెముగా ఎర్రబడుతున్నాయి. శ్వేతాంకుడు చిత్రలేఖ స్వరంలో శ్రావ్యమైన సంగీతాన్ని, సంభాషణలో కవిత్వాన్ని చూస్తున్నాడు. ‹‹జీవితలక్ష్య! సుఖము—శాంతి›› అని జవాబిచ్చాడు.

‹‹నవయువకా ఇక్కడే పొరబడుతున్నావు!›› అని చిత్రలేఖ సంభాళించుకొని కూర్చున్నది. ‹‹సుఖమంటే తృప్తి. శాంతి అకర్మణీయమైనది. జీవితం నిర్వికల్పమైన కర్మతో కూడుకొన్నది. తృప్తిపడేదిగాదు పిపాస. జీవితం పరివర్తనమైనది. కల్లోలమైనది. పరివర్తన—కల్లోలాల్లో శాంతికి స్థానములేదు.›› అంటూ మధుపాన పాత్రను శ్వేతాంకుని నోటకందించింది.

శ్వేతాంకుడు మధుపాత్రను నోటవద్దనుంచీ తొలగించుదామనుకొన్నాడు. కాని చిత్రలేఖయొక్క ఆకర్షణమైన కాటుక కండల్లో విచిత్రమైన గారడీఇమిడియుండుటచే. తన్ను తానాపుకోలేక పోగా, చిత్రలేఖనుగూడా అటకాయించ లేక పోయ్యాడు. మధుపానం శ్వేతాంకుని గొంతుకనుండి దానంతటదే లోపలకు దిగజారింది.

ఇంతలోబీజగుప్తుడు వెనుకనుండినవ్వుతూ—‹‹బ్రహ్మచారీ! నేడు నాట్యకర్తె నీకు దీక్షనిచ్చింది. అందుకు చిత్రలేఖకు సాధన్యవాదాలు›› అన్నాడు.

శ్వేతాంకుడు మోహ నిద్రనుండి తుళ్ళిపడి లేచాడు. బీజగుప్తునినవ్వు, ఆతని పొరబాటును బయలు పర్చిందా అని పించింది. శ్వేతాంకుడు చిత్రలేఖవంక నొకసారి, బీజగుప్తుని వంక నొకసారిచూచాడు. తరువాత లజ్జతో సిరమొంచాడు. బీజగుప్తుడు వస్త్రాలను మార్చుకొనుటకై లోపలికి వెళ్ళాడు. బీజగుప్తుడు వెళ్ళినతరువాత—"దేవీ! నేను మీరు నాసాధ నావ్రతాన్ని మట్టిపాలుచేశారు. ఇలాఎందుకు ప్రవర్తించారు? మీరు నాహృదయంలో ఒకరకమైన జ్వాలనుత్పన్నంచేశారు మీరు నాజీవితంలో బవండరులాగా అగస్మాత్తుగా ఎందుకు ప్రవేశించారు?" అంటూ శ్వేతాంకుడు చిత్రలేఖ హస్తాన్ని గట్టిగా పట్టుకున్నాడు.

చిత్రలేఖ చిరునవ్వు నవ్వుతూ జవాబుచెప్పింది. "శ్వేతాంక్! నీవు భ్రమచెందుతున్నావు. నీసాధనావ్రత మనేది ఆత్మవినాశనంతప్ప మరొకటిగాదు. నేను నీకు ప్రధానంగా మాదకత్వం జీవితానికి ప్రధాన అంగమనేది చూపాను ఇంక మిగిలింది జ్వాలోత్పన్నంగురించి. జీవితవాస్తవిక మహత్తును చూపాను అంతే" చిత్రలేఖ అగస్మాత్తుగా గంభీర వదనయైనది. శ్వేతాంకుని చేతిని విదిలించుకొన్నది. "శ్వేతాంక్! నీజీవితంలోనికి నాప్రవేశం జరగడం, అసంభవమునేదిమాత్రం గుర్తుంచుకో. ఏది ఎలాఉన్నప్పటికీ నామనోవృత్తి నాకు తెలుసు. నేను కేవలం ఈప్రపంచములో ఒకే ఒకవ్యక్తిని ప్రేమిస్తున్నాను. ఆవ్యక్తి బీజగుప్తుడు. ఎప్పుడైనా నేను నీహృదయాకాశములో ఉదయిస్తానన్న కలనైనా గాంచొద్దు ఇక నీవెళ్ళవచ్చును."

శ్వేతాంకుని ముఖము వెలవెల బారినది. జ్ఞానంలోనూ కర్తవ్యపాలనలోనూ, వ్యక్తిత్వంలోనూ, అతనొక నాట్యకత్తెతో పరాజయం పొందాడు. ‹‹చిత్తం›› అంటూ వెళ్ళబోయాడు.

చిత్రలేఖ బాగాఆలోచించింది. వెళ్ళిపోతున్న శ్వేతాంకుని పిలచింది. ‹‹శ్వేతాంక్! ఆగు. నీతో ఇంకా కొన్నివిషయాలు చెప్పాలి, ఇటురమ్ము›› శ్వేతాంకుడు ఆగిపొయ్యాడు. కాని వెనుతిరిగి రాలేదు. అచ్చటనుండే జవాబిచ్చాడు. ‹‹దేవీ! ఇంకేమైనా అవమానం మిగిలుందా? ఈఆత్మ నిర్చలత్వానికి ఈబహుమానంచాలదా? దేవీ! మీరునాయజమానురాలై యుండికూడా నాజీవిత..........! కాదు! కాదు! మరచాను. క్షమించండి. మీరు కేవలం నాయజమానులు. కాబట్టి మీఆజ్ఞ సిరోధార్యమైనది. ఏమిచెప్పాల దేవీ?›› శ్వేతాంకునికండ్లు అశ్రుపూరితమైనాయి.

చిత్రలేఖ హృదయంలో శ్వేతాంకుడు ——బాల హృదయంగల శ్వేతాంకునకు ఈమాటలు అఘాతాన్ని కలుగజేశాయి. ‹‹శ్వేతాంక్! నేను పొరబాటు చేశాను. నీయెడల కఠినంగా ప్రవర్తించాను. కాబట్టి నిన్ను నేను క్షమాపణ కోరుచున్నాను. శ్వేతాంక్! నీయెడల నాకు అనుపమ అనురాగమున్నది. నీవు నాసోదర సమానుడవు. నీదుఃఖమే నా దుఃఖం నేను బహుశా తెలియకుండానే నిన్ను అవమానించాను. కనుక క్షమించమని వేడుకొంటున్నాను.›› అన్నది గౌరవముగా చిత్రలేఖ.

చిత్రలేఖ క్షమాప్రార్థన శ్వేతాంకుని క్షోభనుదూరం చేసింది. అతని హృదయం హిమకణంలాగా కరిగిపోయింది. అతను చిత్రలేఖలో ప్రకాశవంతమైన మూర్తి స్వరూపాన్ని చూచాడు. ఇక చిత్రలేఖను నాట్యకత్తెగా భావించుటలేదు. స్వర్గంలోఉండే దేవతా అన్నట్లుంది. ,,దేవీ! క్షమా ప్రార్థన చేయవలసిన అవుసరము లేదు. పొరబాటునాది. నేను యదార్థంగా శిక్షార్హుడును. కాని కృపాపాత్రుడనైనాను. ఒకప్రవాహంలోపడి ప్రవంహిచుక పొయ్యేవాడిని దరిజేర్చి నాయెడ ఎంత అనుగ్రహం చూపారో చెప్పజాలను." అని శ్వేతాంకుడు అచ్చటనుండి తిన్నగా బీజగుప్తునికడకు చేరాడు. చిత్రలేఖ చేసిన మూర్తిలాగా నిలబడి పోయింది. తెలియకుండానే ఒక అభోధయువకుని తన యవ్వన మాదకత్వమునకు గురిజేసి నందులకు చింతిల్లుచున్నది.

బీజగుప్తుని చరణ పద్మాలమీదపడి శ్వేతాంకుడు ఈ వ్యాక్యాన్నిమాత్రం అన్నాడు. ,,స్వామీ! నన్ను శిక్షించండి"

బీజగుప్తుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. ,,శ్వేతాంక్! ఏమిజరిగింది?"

శ్వేతాంకుడు కంపిత స్వరంతో ,,స్వామీ! నేను విశ్వాస ఘాతకుడను. స్వామిద్రోహిని. గొప్ప అపరాధం చేశాను. ఏస్త్రీయైతే తమను గాఢంగా ప్రేమిస్తున్నదో, ఆమెను ప్రేమించాను. పైగా నాయజమానులైన మీరు

గూడా ఆమెను ప్రేమిస్తున్నారు. అది అలావుంచి ఆమె నా యజమానురాలుగూడా." అన్నాడు.

బీజగుప్తుడు అంతా తెలుసుకొన్నాడు. మనస్సులో నవ్వుకున్నాడు. "శ్వేతాంక్! ఆస్త్రీ నన్ను ప్రేమించుచున్నదని ఎలా తెలుసుకొన్నావు?"

"ఆమె స్వయంగానే చిత్రగించినది" శ్వేతాంకుని మీూదముఖుపాన మహిమ సోకింది. ఆశరీరంలో ఒక విధమైన స్ఫూర్తిని చూచాడు. "నేడు నేను ఆమెచేత్తో మధువును సేవించి నియమాన్ని ఉల్లంఘించాను. ప్రేమిస్తున్నస్త్రీ తనచేత్తో ఇచ్చే ఆధిత్యాన్ని స్వీకరించకుండా ఉండలేక పొయ్యాను."

లేనిగంభీరతను తెచ్చుకొని బీజగుప్తుడు ప్రశ్నించాడు, "శ్వేతాంక్! ఆస్త్రీ నన్ను ప్రేమిస్తునట్లు తెలియకుండా, ఆత్మార్పణ చేయడానికి సిద్ధపడితే ఏమిచేశేవాడవు?"

శ్వేతాంకుడు కొంచె మాలోచించి జవాబిచ్చాడు. "బహుశా యజమానులఎదుట క్షమాభిక్ష కోరియుండేవాడనుగాను. విశ్వాస ఘాతకానికి ఒడిగట్టి, గురు అపరాధుడనయ్యేవాడను."

శ్వేతాంకుని సవరించుచూ, బీజగుప్తుడన్నాడు. "శ్వేతాంక్! నీకు క్షమాపణకోరె అగత్యంలేదు. ఈపరిస్థితులలో, ఇదే స్థానంలో మరియొకరైతే. ఇలావ్యవహరించి యుండేవారుగాదు. నీవుచేసింది, చెయ్యనున్నదిగూడా అనుచితం మాత్రింగాదు. ఇందులో నీదోషంఎంతమాత్రింలేదు. అంతా పరిస్థితులదే, నీవు ఎవరియెడ అపరాధము చేశావో, ఆవ్యక్తి

ఎదుట అపరాధాన్ని ఒప్పుకొని కళంకాన్ని కడుగుకొన్నావు. అందుకుమాత్రం సంతోషిస్తున్నాను. నీవు యదార్థాన్ని చెప్పావు. విశ్వాస రహితంగా ప్రవర్తించానని పొరబడుతున్నావు. నీవిప్పుడే ఈప్రపంచములో ప్రవేశించావు. అనుభవ రహితుడవు. ఇంకా ఎన్నోసార్లు ఇలాంటి పరీక్షల నెదుర్కొనవలసి యున్నది. అప్పుడు నీవు నీకర్తవ్యాన్ని విస్మరించరాదు. కోర్కెలు ప్రబలరూపాన్ని దాల్చినిన్ను పీడిస్తాయి. నీవు వాటిని అణచివెయ్యాలి. ఇదే నీ ఆత్మశక్తికి పరీక్షాసమయం. జయాపజయాలకు ఈప్రపంచమే ముఖ్యస్థానము. కాని నిర్జన ప్రదేశంగాదు."

శ్వేతాంకుని కండ్ల వెంట అశ్రువులు ప్రవహిస్తున్నాయి "స్వామీ! మీరు చెప్పింది తప్పక ఆచరిస్తాను. కాని ఈనుహా అపరాధమునకు తగిన శిక్షనుమాత్రం ఇవ్వాలి."

బీజగుప్తుడు శ్వేతాంకుని శిరముని నిమురుతూ, అన్నాడు "దుఃఖించు తావేమున్నది? అపరాధానికి శిక్ష కావాలా? అపరాధం అసలునీవు చెయ్యలేదు. కదా? అయినప్పుడు శిక్ష ఎలా సంభవము? అపరాధం ఆచరణలో ఉంటుంది. భావాలలో గాదు. భావన ఆచరణకు సాధనా మాత్రమైనది. అయినా శిక్షను అనుభవించడమే నీకు ప్రధానమైతే! కఠినమైనశిక్షను విధించుచున్నాను. ఇదిగో వినునీవు ఎప్పటివలే భవిష్యత్తులో గూడా చిత్రలేఖను ఆమె భవనానికి చేరుస్తూ ఉండాలి."

# 4.

విశాలదేవ్ కుమారగిరిలో ఒకమహత్తరమైన ఆత్మను చూచాడు. కుమారగిరి జ్ఞానతేజముముందు విశాలదేవ్ శిర సొంచాడు. కుమారగిరితర్కం దృఢతరమైనది. విశాలదేవ్ని ధర్మసందేహాలన్నింటినీ ఒక క్షణములో నివారించుచున్నాడు. కుమారగిరి విశాలదేవ్కు యోగభ్యాస శిక్షణ ప్రారంభిం చాడు కుమార గిరికి యోగ్యుడైన శిష్యుడు లభించాడు. విశా లదేవ్కు యోగ్యుడైన గురువులభించాడు.

ఒకరోజుకుమారగిరి ఉపాసనామహాత్మ్యాన్ని విశాలదేవ్ కుచెప్పుచున్నాడు. అప్పటికిసూర్యాస్తమయం అయిపోయింది. ఒకనిర్జన ప్రదేశంలో కుమారగిరి కుటీరమున్నది దానిలోదీప మొకటి మినుకు మినుకుమంటూ వెలుగుచున్నది. అగన్మా త్తుగా ద్వారంవద్ద అడుగుల చప్పుడు వినిపించింది. ‌‌„మార్గం తప్పిన పాంథులు ఈరాత్రికి మీ ఆశ్రియము కోరుచున్నారు” అని ఎవరో బైటనుండి అన్నారు.

కుమారగిరివారికి స్వాగతమిస్తూ „మార్గంతప్పిన ప్రతి ప్రాణికోసరం నాకుటీరద్వారం తెరచిబడేఉంటుంది” అన్నాడు కుమారగిరి తనజవాబుకు తానే నవ్వుకున్నాడు.

తరువాత ఒకపురుషుడు స్త్రీ సమేతంగా కుటీరంలో ప్రవేశించాడు. స్త్రీని చూచి యోగి చకితుడయ్యాడు „అధి తీ! స్త్రీగూడా ఉన్నదనిమీరు నాతో ముందు ఎందుకు చెప్ప

లేదు? ఇది సర్వసంఘ పరిత్యాగి కుటీరమని తెలియదా? అని పురుషునితో అన్నాడు యోగి.

"స్వామీ! ఇది ఒక యోగి కుటీరమని నాకు తెలుసు. కాని జితేంద్రియులైన యోగులకు, కేవలం ఒక రాత్రికి అందులోనూ, పురుషునితో గూడాయున్న స్త్రీకి ఆశ్రయమివ్వడానికి సంకోచిస్తారనుకోలేదు" అని జవాబిచ్చాడు పురుషుడు.

ఈజవాబును నిశ్చేష్టుడైనాడు కుమారగిరి ఇంతలో సమీపంలోనున్న ఆసనము మీద కూర్చున్నదా స్త్రీ. మినుకు మినుకుమాడే దీపపుకాంతి ఆమెముఖముమీద ప్రసరిస్తున్నది. "అదితి! స్త్రీ అంధకార యుతమైనది. మాయ, మోహ, వాసనా భరితమై ఉంటుంది స్త్రీ. అందువల్ల స్త్రీకి నాకుటీరములోనికి ప్రవేశం ఇవ్వడానికి సంకోచించాను. జ్ఞానమనే ప్రకాశయుతమైన ఈ ప్రపంచములో స్త్రీకి ఎట్టిస్థానమూ లేదు. అయినప్పటికీ మీరు నా అతిథులు కాబట్టి మీ ఆదర సత్కారములు చేయుట నా కర్తవ్యము" అన్నాడు యోగి.

స్త్రీ ఈసంభాషణను ఆశ్చర్య చకితయై కుతూహలం గావింటున్నది. కుమారగిరి చెప్పడం పూర్తియైన తరువాత ఆమె విస్మయసూచకంగా శిరమొంచి ఇలా అన్నది. "ప్రకాశ మోహితమైన ప్రాణికి ఈ అంధకారము యొక్క నమస్కారములు."

వాక్యం బాణంకంటే తీక్ష్ణంతముగా నున్నది. కాని ఆస్వరంలో కోమలమైన సంగీతలయ, సౌందర్యములో ఆకర్షణ, వాసనాయుతమైన ఆనందములో అహంకారం, ఇమిడి

యున్నాయి. కుమారగిరి ఒక అసాధారణమైన స్త్రీయొక్క అసంధర్భ వాక్యాన్నివిని తుళ్ళిపడి, ఆమెను తదేక ధ్యానంగా చూచాడు. ఆమెనుచూచి యోగి ఆశ్చర్య చకితుడై నాడు. ఇలాంటి అనుపమ సౌందర్యవతిని యోగి స్వప్నంలో కూడాచూచి ఎరుగడు. ఆమెవాక్యానికి జవాబివ్వడం అనుచితమను కున్నాడు ‟అధితుల పరిచయ మరయవచ్చునా?” యని పురుషునితో అన్నాడు యోగి.

‟స్వామీ! ఈదాసుని నామము బీజగుప్తుడు. పాటలీపుత్రపు సామంతులలో నొకరు. ఈమె పాటలీపుత్రపు సర్వ సుందరి నాట్యకత్రైయైన చిత్రలేఖ” అని జవాబిచ్చాడు పురుషుడు.

‟బీజగుప్తుడూ—చిత్రలేఖ!” ఈసారి కుమారగిరి చిత్రలేఖ వైపుకు తిరిగాడు. ‟చిత్రలేఖా! నీకర్కశకవిత్వంలో ఉన్మాదం ఆవరించి యున్నది. నీవిషపూరిత మనస్సును సౌందర్యము దాచేసింది. మీరునాఅధితులు అభ్యర్థించారు గనుక అశీర్వదించడం నాధర్మం. భగవంతుడుమీకు మంచిని కలుగ జేయుగాక!”

చిత్రలేఖ ఒకసారి నవ్వింది. మనస్సును ఆకర్షించే శక్తి ఆమె మధుర హాస్యములోనున్నది. ‟యోగి! మంచికి అనేక అర్థములున్నవి. ఒకరికి మంచిదైనది, ఇంకొకరికి చెడు కావచ్చు. అనురాగమునకు సుఖమైతే, విరాగమునకు దుఃఖ మౌతుంది. ప్రతివ్యక్తి తనసిద్ధాంతమును విశ్వసించి, దాన్నే

నిరూపించడానికి ప్రయత్నిస్తాడు. ప్రతిమానవుడు తానను సరించేమార్గమే సరియైన దనుకొంటాడు. వేరొక సిద్ధాంత మునునమ్మి అదిచూపే మార్గము ననుసరించే ఇతర్లు పొర బాటు పడుతున్నారను కొంటాడు”

అనురాగమునకు దాసియైన నాట్యకర్తె, విరాగయుతు డైన యోగిని ఎదుర్కొన్నది. ఇది శాంతికి—క్రాంతికీ జరిగే ఘర్షణ. జీవితం—ముక్తికీమధ్యజరిగే బంటుపందెము. ‘‘కాని సత్యము ఒకటి, వాస్తవికజ్ఞానం మరొకటి! శాంతి సుఖం లభించే మార్గం ఏదో అదే సరియైనది’’ అని యోగి నిశ్చల భావంతో జవాబిచ్చాడు. కుమారగిరి స్వరంలో గంభీరత యున్నది. తపశ్య తేజం నవయువకుడైన యోగి వేషానికి అందాన్ని చేకూర్చుచున్నది.కుమారగిరి పెద్దపెద్ద నైనాలలో కాంతిజ్యోతి వెలుగొందుతుంది.

యోగి నైనాలు నర్తకీ నైనాలలో ఒక క్షణంపాటు కలసి పోయినాయి. వాసనావృత్తి తపస్సుఎదుట గడగడా వణక నారంభించింది. ఒక ఉన్నతమైనయోగి సమక్షాన కూర్చున్నాననుకొనికూడా చిత్రలేఖ సాహసించి చెప్పింది. ‘‘శాంతి—సుఖము! శాంతి అకర్మణీయతకు రెండవపేరు. ఇకమిగిలింది సుఖాన్ని గురించి దానిపరిభాష ఒకరకంగాలేదు.

దార్శనిక సిద్ధాంతమును గురించికూడా నర్తకీ చిత్ర లేఖ తర్కించిన కుమారగిరి విభ్రాంతుడైనాడు అతనితో సం భాషించే స్త్రీ సౌందర్యవతియేగాక, విదుషీకూడా ఆమెలో ప్రతిభ ఆలోచనాశక్తి ఉన్నాయి. ఒక ప్రతిభను ప్రతిభే

ఎదురౌతుంటుంది. జ్ఞానక్షేత్రంలో ప్రతిభకు, వాలి కత్వానికి సర్వోచ్చస్థానమున్నది. కుమారగిరి కొంతసమయం నిశ్శబ్దంగా నున్నాడు. తరువాత మెల్లగా ధైర్యముతో చెప్పాడు. ,,నిజంచెప్పుచున్నావు. శాంతి అకర్మణీయము యొక్క రెండవపేరు అకర్మణీయతే ముక్తి ప్రస్తుత ప్రపంచము చెప్పే అకర్మణీయత నిజమైన అకర్మణీయత మాత్రం కాదు. వారుచెప్పే అకర్మణీయతలో మెదడుకు ఎక్కువ పరిశ్రమ చేయవలసి యుంటుంది. శూన్యంలోనుండి మనము ఉత్పన్నమైనామో, తిరిగి దానిలో లీనమగుటయే, నిజమైన అకర్మణీయత. ఆశూన్యమే జీవితానికి నిశ్చితమైనలక్ష్యం ఇక మిగిలింది సుఖపరిభాష. దానికికూడా నీవుచెప్పిన దానిని కొంతవరకూ అంగీకరించుతాను. కాని సుఖమనేది ఒకటే. భేధమేమీలేదు. ఆసుఖమేమిటో మనుష్యుడు తెలుసుకోగలిగితే వర్తమానస్థితినుండి ఒక వున్నత పధాన్నందుకొంటాడు"

చిత్రలేఖ కుమారగిరిమాటలలో సారాన్ని చూచింది. తనకు తెలియకుండానే తాను యువకుడైన యోగి కుమారగిరి వైపుకు ఆకర్షించబడినట్లు గ్రహించింది. మరొకపర్యాయం సాహసించింది. ,,యోగీ! మీరుచెప్పే శూన్యాన్ని ఎవరు విశ్వసిస్తారు? మనకు గోచరమైనదేదో అదే సత్యం. నిత్యం గూడా. శూన్యం కాల్పనిక వస్తువు. శూన్యం—శూన్యం—అని దాని మహత్తును మాటమాటకి పేర్కొనేయోగీ! మీకు మనఇద్దరి మమత్వంలోనూ భేధమున్నదనుకొంటున్నారా? ఒకవేళ వున్నదనుకొంటే మీరు శూన్యాన్ని విశ్వసించుటలేదన్నమాటే, లేదనుకొంటే మీఅజ్ఞానం-అంధకారము సుఖం-

దుఃఖం-పాపము-పుణ్యము, మరియు స్త్రీ పురుష అనే భేద భావముమధ్య తప్ప వేరుగాదు. ఈశ్వరుడు మనుష్యునిపుట్టించుతూనే అతనికొక కర్మక్షేత్రాన్ని నిశ్చయించాడు. ఈప్రపంచములోదిగి కర్మక్షేత్రంలో మునిగిపోవడానికే మనుష్యుని పుట్టించాడుగాని, పిరికి పందలులాగా ఈదుఃఖాలనుండి తప్పించుకోవడానికిగాదు. ఇక సుఖం!——తృప్తియొక్క రెండవపేరు కోరిక వాసనా యున్నచోటనే తృప్తికిగూడా స్థానమున్నది."

యోగి గంభీరుడైనాడు. చిత్రలేఖ చిరునవ్వు నవ్వుచున్నది. బీజగుప్తుడు తన శిష్యుశాలు, లేదా జీవిత సాంగత్యరాలు అయ్యి చిత్రలేఖ నోటినుండి తన సిద్ధాంత సమర్ధన తర్కయుతంగా విని, తనలో తానేవిని ఆనందపడ్డాడు. విశాలదేవ్ నాట్యకర్తె జ్ఞానానికి చకితుడైనాడు. ఇద్దరుగూడా కుమారగిరి జవాబుకోసం నిరీక్షించుతున్నారు.

కుమారగిరి కొంత తడవాగి గంభీరంగా ఇలాఅన్నాడు.

"ఈశ్వరుడు!—— ఈశ్వరునిలోనూ, మనుష్యునిలోనూ భేధములేదు, భేధంకేవలం బాహ్యంగానే, మాయ, బ్రహ్మ యొక్క సంయోగాన్నే మనుష్య మంటారు. వాస్తవంగా మాయ బ్రహ్మలోని ఒక అంశమై యుండిగూడా బాహ్య దృష్టిలోవేరు. బ్రహ్మమాయలో లీనమై యున్నంతకాలం వాడు ప్రపంచిక చిక్కులో చిక్కుకొని ఉంటాడు. మాయ నుత్యజించ గలిగినప్పుడే స్వతంత్రుడౌతాడు. వాస్తవంగా నేను——నీవుఅనే భేధమేమీలేదు. ఏలనన నీవు——నేనుగూడా బ్రహ్మలోని అంశాలమే. కాని చిన్న భేధంమాత్రం ఉన్నది. నీవు మాయమిశ్రిత బ్రహ్మవు. నేనుమాయరహిత బ్రహ్మను.

తిరోగమనం జీవిత ధర్మంగాదు. అందుకని మాయను జీవితా న్నుండి వేరుచేయ గోరుచున్నాను. సుఖాన్ని తృప్తిగా ఎంచ డంలో పొరబడుతున్నావు. తృప్తే సంతోషానికి సాధనా కా గలిగితే అదిసుఖం తప్పకుండా అవుతుంది. కాని కర్మజా లంలో చిక్కుకొన్నప్పటికీ తృప్తితో సంతోషం కలుగదు. బ్రహ్మ, మాయసం యోగంవల్ల తనను తానే మరచి కర్మ జాలంలో చిక్కుకొంటాడు. మాయను త్యజించి నటువంటి వాడు తనను తాను గుర్తించ గలుగుతాడు. తృప్తి చెందు తాడు, దానితోపాటు సంతోషంగూడాకలుగుతుంది ఈదుఃఖ మయ ప్రపంచమును విడనాడడమే సుఖమంటాము." కుమా రగిరి కొంతతడవాగి తిరిగి చిత్రలేఖకు జవాబిచ్చే అవకాశం ఇవ్వకుండానే చెప్పనారంభించాడు. "తర్కానికి అంతము ఉండదనేది జ్ఞాపక ముంచుకోవాలి. సత్యమనేది అనుభవము మీద తెలిసేవస్తువు. విశ్వాసం అనుభవము లేనటువంటి మనుష్యునకు దారిజ్ఞాన మరయడం అసంభవము. చాలా రాత్రి గడచిపోయింది. ఇక విశ్రాంతి తీసుకోవడం మంచిది," అన్నాడు కుమారగిరి లేచినిలబడి.

చిత్రలేఖ ఈజవాబుకు తృప్తిపడలేదు. కుమారగిరి కూడాచిత్రలేఖ సంతుష్టురాలుకాలేదని గ్రహించాడు, కుమా రగిరి వ్యక్తిత్వం, చిత్రలేఖను ఆకర్షించింది. యోగి నర్త కింలో జ్ఞానాన్ని చూచాడు. నర్తకి యోగిలో సౌందర్యాన్ని చూచింది. ఒకరివల్ల ఒకరు సంతృప్తిమాత్రం పడలేకపోగా ఒకరి ప్రభావం ఒకరిమీద సోకింది. ఇది విచిత్ర విషయమే ఒకరిలో మరియొకరికి ఆకర్షణమాత్రం కనుపించింది. కాని

బీజగుప్తుడో? ఈరెండు విషయాలనుగూడా స్వయంగా తెలుకోలేక పోయ్యాడు. వారిద్దరి సంభాషణతో బీజగుప్తునిఆత్మలో ఒకరకమైన అశాంతి అంకురించింది. అది సిద్ధాంతములకు సంబంధించినది మాత్రంగాదు. అది ఏలాంటిదో తెలుసుకోవాలని లక్షప్రయత్నాలు చేస్తాడుగాని తెలుసుకోలేక పోయ్యాడు. చిత్రలేఖ హృదయంలో యోగి కుమారగిరి ఆకర్షణఛాయ ఆవరించిందని బీజగుప్తుని హృదయం సంకోచించింది. కాని పూర్తిగా విశ్వసించ లేకపోయ్యాడు.

"నాశిష్యుడు ఈరాత్రికి నాకుటీరంలోనే శయనిస్తాడు ఆతని కుటీరంలో మీరు శయనించవచ్చును" అన్నాడు కుమారగిరి.

బీజగుప్తుడు లేచి నిలబడినాడు. చిత్రలేఖగూడా ఆతనిని అనుసరించింది. "యోగీ! తపస్సునిజంగా జీవితానికి ఒక తెరనిమచ్చ. అది ఆత్మవినాశనమని దృఢంగా చెప్పుచున్నాను. సుంచిది! శ్రీవారికి చిత్రలేఖ నమస్కారములు" అని చెప్పుతూ చిత్రలేఖ బీజగుప్తుని వెంటసాగింది.

చిత్రలేఖ వెళ్ళిన తరువాత కుమారగిరి తనలో తానే నవ్వుకున్నాడు. "నిజం చెప్పుతున్నావు! తపస్సును ఆత్మవినాశనమంటారు. బ్రహ్మ మాయసంయోగాన్నే ఆత్మ అంటారు ఆత్మ చచ్చిపోతే మాయలోనివికారం లుప్తమైపోతుంది. సత్ చిత్త—ఆనందము మిగిలిపోతాయి. నర్తకీ! నీలోతగిన అనుభవముంటే, పరిస్థితిగూడా మరొకటి అయినట్లయితే, బహుశా నీవుగూడా ఈరహస్యాన్ని తెలుసుకో గలిగేదానవు. నీలో

జ్ఞానముంది. 'కాని దానికి తగిన మార్గదర్శకుడు లేడు ఇదివిచారించదగ్గ విషయం!"

బీజగుప్తుని, చిత్రలేఖను తన కుటీరమునకు పంపించి విశాలదేవ్ యోగి కుటీరమునకు తిరిగి వచ్చాడు. నిద్రించే ముందు బీజగుప్తుడు "చిత్రలేఖా!" అన్నాడు.

చిత్రలేఖ జవాబుగా "ప్రియతమా!" అన్నది.

"హృదయంలో ఏదో ఒకరకమైన బాధకలుగుతుంది. మన జీవితాకాశంలో దుఃఖ మేఘాలు ఆవరించుతున్నాయా అనిపించుచున్నది. చిత్రలేఖా! కుమారగిరి ఒక యోగి. అంతే గాదు అతనిలో ఒకవిధమైన ఆకర్షణశక్తికూడా ఉన్నది." అని దీర్ఘశ్వాస తీసుకొన్నాడు బీజగుప్తుడు.

చిత్రలేఖ ముఖం ఒకక్షణంపాటు తెల్లబడి పోయింది. కాని వెంటనే సంభాళించుకొని జవాబిచ్చింది. "ప్రియతమా కుమారగిరి యోగి. దానితోపాటు మూర్ఖుడుకూడా. అతని ఆత్మ చచ్చిపోయింది."

చిత్రలేఖ బీజగుప్తుని మోసగించడంతో పాటు తనను తానుకూడా మోసగించుకో ప్రయత్నించినది. తిరిగి చెప్ప నారంభించింది. "కుమారగిరి నిర్జనవాసి. మన కర్మక్షేత్రములో అభినయించే అభినేతృలం కుమారగిరి వాసనాప్రవృత్తిని త్యజించాడు. మనము వాసనాప్రవృత్తిని విశ్వసిస్తున్నాము. కుమారగిరి జీవితలక్ష్యం కాల్పనిక శూన్యం మన జీవితలక్ష్యం హృదయానందము. ప్రియతమా! ఈ ప్రపంచములోని ఏ ఇతర వ్యక్తికి మనమధ్య స్థానం లేదు.'

బీజగుప్తుని మోము ఆనందముతో వికసించింది. ‘‘భగవంతుడట్లొనరించుగాక!’’ చిత్రలేఖ బీజగుప్తుని మోసగించినదిగాని, తనను తాను మోసగించుకో లేకపోయింది. ఆమె మనస్సులోనే అనుకున్నది. ‘‘కుమారగిరి గొప్ప అందమైనవాడు.’’

# 5.

మహాయజ్ఞమునుండి వెలువడే పవిత్రమైన ధూమ్రముతో రాజమహాలు సువాసనా భరితమైయున్నది. రాజమహాలులోని విశాల ప్రాంగణములో సామ్రాట్ చంద్రగుప్తుని అతిథులు ఆసీనులై యుండిరి. రత్నాలు పొదిగిన బంగారపు రాజ సింహాసనముమీద మహారాజులు విరాజమానులైయుండిరి. వారిముఖం తూర్పునకు తిరిగియున్నది. ఆయనకు దక్షిణమున క్రిమానొప్ప ఆహ్వానితులైనటువంటి విశాల సామ్రాజ్యములోని సామంత గణులెల్లరు, తమ తమ యోగ్యతాను సారముగా కూర్చొని యుండిరి. వామపార్శ్వమున ప్రధాన కర్మచారులు. ఖర్మ—ఖాండవములను జరిపే పురోహితులు, పండితులు, తపస్వులు మొదలగువారి సమూహమున్నది.

లాంఛన ప్రాయంగా మహాయజ్ఞం తరువాత దార్శనిక సిద్ధాంతమును గురించి, తర్కించడానికిగాను ఈసభను ఏర్పాటు చేశారు. “నీతికుశలురైన మంత్రివర్యా! తమునీతిశాస్త్రం అనేకచోట్ల ధర్మసిద్ధాంతమును అవహేళనచేయుచున్నది ఈవ్యతిరేకమునకు కారణమేమి? నీతిశాస్త్రం, ధర్మశాస్త్రం

యొక్క అంతర్గత మైనదో, కాదో, దయచేసి తెలవిస్తారా? అని మంత్రిని సంబోధించి మహారాజా చంద్రగుప్తుడన్నాడు.

చాణక్యుడులేచి సభికులకు, మహారాజుకు అభివందన మాచరించి కూర్చున్నాడు. తదుపరి చెప్పనారంభించాడు ,,మహారాజుగారి కథనం సర్వత్రా ఉచితమైనది. నాసీతిశాస్త్రంలో అక్కడక్కడా నిర్మించబడిన ధర్మాచారములకు వ్యతిరేక సిద్ధాంతము లున్నమాట వాస్తవమే. దానిని నేను అంగీకరిస్తాను. కాని ధర్మం అనేది సమాజంద్వారా నిర్మించబడినదని మాత్రం చెప్పుచున్నాను. ధర్మమే నీతిశాస్త్రమును సృజించినది. అంతే కాకుండా నీతిశాస్త్రమే ధర్మాన్ని శృజించినదనికూడా చెప్పొచ్చు. సమాజాన్ని సజీవంగా ఉంచేదాని కొరకు సమాజంద్వారా శృజించబడిన కొన్నినియమాలనే నీతి శాస్త్రమంటారు. దీనికి ఆధారము తర్కం. ధర్మానికి ఆధారము విశ్వాసం. విశ్వాసమనే బంధనాలలో ప్రతిమనుష్యుని బంధించి, తద్వారా నియమపాలన జరపించడమే సమాజానికి హితము. కాబట్టి సమాజ కళ్యాణంకోసం ధర్మానికి విరుద్ధంగా నడచే పరిస్థితులుగూడా రావచ్చు. అప్పుడుధర్మం యొక్క రూపముగూడా మారిపోతుంది.,,

చాణక్యునివాక్యం పూర్తికావడంతోనే సభలో ఘోరని స్తబ్ధత వ్యాపించినది. మహారాజా చంద్రగుప్తుడు సగర్వంగా విద్వాంసులవంక, మంత్రి చాణక్యునివంక. చూచాడు. మంత్రిగారు గంభీర విషయమును చెప్పారు. అందులో సారముంది విషయములో క్రొత్త దనముంది. నిర్ధారితమైన

సిద్ధాంతములకు వ్యతిరేకం. ఈప్రశ్నకు జవాబెవరు ఇస్తారా? యని సభికులు ఎదురు చూస్తున్నారు.

విద్వాంసులలో కూర్చున్న ఒక యువకుడైన యోగి శాంతముగా జవాబిచ్చాడు. "మహారాజా! ఈశ్వరుడు మనుజుని శృజించిన ధర్మధాత మనుజుడు సమాజాన్ని నిర్మించిన నిర్మాణకర్త. ధర్మం ఈశ్వరుని బాహ్యరూపము అది ఈశ్వరుని తెలుసుకొనేందుకు సాధన మాత్రమే. ధర్మాన్ని తిరస్కరించడమంటే, ఈశ్వరుని తిరస్కరించడమే కాగలదు. సత్యానికి దూరంకావడమే. సత్యము ఒకటే. ధర్మమనేది సత్యానికి ద్వితీయ నామము. ధర్మసిద్ధాంతములను, నీతిశాస్త్రము వ్యతిరేకమైతే, అది నీతిశాస్త్ర మనబడదు, పైపెచ్చు అవినీతిశాస్త్ర మనబడుతుంది, ఉచితం — అనుచితం — న్యాయం — అన్యాయం — వీటన్నింటికీ గీటురాయి ధర్మం. ధర్మంలో విశ్వమంతా విలీనమై యున్నది."

వయోవృద్ధుడైన మంత్రి చాణక్యుడు, ఎదుట కూర్చొనియున్న యోగిని, పులి మేకను చూచినంత తీక్షణంగా చూచాడు. మనస్సులో నవ్వుకున్నాడు. "ధర్మగురుత్వాన్ని స్వీకరించి, ధర్మాన్ని ఘోషించే యోగీ! ధర్మాన్ని ఎవరు సృష్టించారో నీకు తెలుసా?"

"మనుష్యుని అంతరాత్మ ద్వారా, ఈశ్వరుడు."

"అయితే ఈశ్వరునో?"

సభికులందరూ చాణక్యుని ప్రశ్నకు చకితులైనారు. "ఈశ్వరుని ఎవరు సృష్టించారు?" ఎంతభయంకరమైన ప్రశ్న

సభలో ఒకరకమైన కోలాహలం లేచింది. కుమారగిరి శాంత ముగానే జవాబిచ్చాడు. "ఈశ్వరుడు అనాదివాడే."

"బాగా చెప్పావు యోగి! ఈశ్వరుడు అనాదివాడు. ఇదేమంత కొత్తవిషయంకాదు. ప్రతివారు ఈశ్వరుడు అనాది వాడేనని చెప్పుచున్నారు. అయితే మీరు ఈశ్వరుని ఎరుగుదురా? ఇచ్చటి సభికులలో ఏఒక్కడైనా ఎరుగుదురా?" చాణక్యుని స్వరము గంభీరముగా నున్నది. కండ్లు జ్యోతిలాగా ఎర్ర బారినాయి. జవాబుకోసం నిరీక్షించకుండానే తిరిగి చెప్పనారంభించాడు. "ఈశ్వరుడే అనాదే—కాని ఈశ్వరుని ఎవరు ఎరుగరని నేను గట్టిగా చెప్పగలను. అది ఒక కాల్పనికవస్తువు అదిఒక సత్యం. దాని ప్రచండ ప్రకాశము ఎదుట మనుష్యుడు కండ్లు తెరువలేడు. అసత్యాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నం చేయండి. ఈశ్వరుని పొందడానికి ఘోరతపస్సు చేయండి. కాని అప్రయత్నాలన్నీ వ్యర్థమే, నిష్ఫలమే, నిరుపయోగమే ఒకవేళ మీరు ఈశ్వరుని తెలుసుకో గలిగితే, మీ కల్పనలోకి అఖండమైన, సీమారహితమైన, అనంతమైన రచయిత రాగలడు. కాని అది ఈశ్వర రూపమెలా అవుతుంది? యోగి! మనం నిత్యం పూజచేసే ఈశ్వరునకు, ఆ ఈశ్వరునకు చాలా బేధమున్నది. మన ఈశ్వరుడు కేవలం కల్పితమైనవాడు. తన అవుసరాలు పూర్తిచేసు కోవడానికి సమాజం సృష్టించుకొన్నది."

చాణక్యుడు ఆగి నాల్గువైపులా పరికించాడు. సభంతా నిశ్శబ్ధంగా ఉన్నది. ఏదోపెద్ద ఆలోచనలో నిమగ్నుడైనాడా అన్నట్లు యోగి కండ్లు మూసుకొని ఉన్నాడు. తనదు తర్కం





లో ఎదుర్కొనేవారు ఎవరూలేరు అన్నట్లు సగర్వంగా పండితులవంక పరికించి చూచాడు చాణక్యుడు. కొంత తడవాగి తిరిగి చెప్పనారంభించాడు. ‘‘ఇంకా విషయం సంపూర్ణం కాలేదు, మనం నిత్యం పూజలు, పునస్కారములు జరిపే ఈశ్వరుడు కల్పితుడు, సమాజంచే నిర్మింపబడినవాడు. వివిధసమాజముల కల్పన ననుసరించి వివిధ రూపములలో నున్నాడు. ఇకమిగిలింది అంతరాత్మను గురించి. అంతరాత్మ ఈశ్వరుని ద్వారా నిర్మించ బడినదనేది భ్రమాత్మక మైనది. అది నిజంగా ఈశ్వరుని ద్వారా శృజించబడితే వేరు వేరు సమాజముల లోని వ్యక్తుల ఆత్మలు వేరు వేరుగా ఉండేవిగావు. ఈశ్వరుడు ఒక్కడే అయితే,అతనిద్వారా నే ధర్మనియమాలు నిర్ణయించ బడితే మానవులలో భిన్నతకు ఆస్కారములేదు. కాని అలా జరుగుటలేదు. ఒక అంతరాత్మను సంబంధములేదు. సమాజం అనుచితంగా భావించే దానినే ఆత్మగూడా అనుచితంగా బావించుచున్నది. అంతరాత్మ సమాజంద్వారా నిర్మించబడినదని దీనిని బట్టే నిశ్చయంగా చెప్పగలం. మనుష్యుని హృదయం సమాజ నియమాలను విశ్వసిస్తుంది. దానినే అంతరాత్మ అంటాము. సమాజాన్నుండి వేరుపడితే, దానికి అస్థిత్వమే లేదు.’’

చాణక్యుడు ఆసనముమీద కూర్చున్నాడు. విద్వాంసులుఅతని తార్కిక ప్రతిభను విభ్రాంతులై వినమ్రులైనారు.

కుమారగిరి చాణక్యుని వాక్యాలు విన్నాడో లేదో చెప్పడం కష్టం. అతను ఏదో ఆలోచనలోమాత్రం తల్లీనుడై యున్నాడు, ఇప్పటికీ కండ్లుమూసుకొనే యున్నాడు. యోగి

శాంతి యుతమైన ముఖంలో ఒకరకమైన అలౌకిక తేజము విరాజిల్లు చున్నది. అప్పుడు కుమారగిరి చాణక్యుని తార్కిక ప్రశ్నకు జవాబివ్వలేదు. సభికులందరు చాణక్యునిదే విజయ మంటున్నారు. చంద్రగుప్తుడు ముసిముసి నవ్వులు నవ్వుచున్నాడు "వాద వివాదం పూర్తియైనది. ఇక నృత్యం ప్రారంభమగును." అని మహారాజు ఆజ్ఞానుసారము సభలో ప్రకటించబడింది. సభలోని నిశ్శబ్దం శాంతముగా విచ్ఛిన్నమైపోయింది. సామంతుల హర్షధ్వని ప్రతి ధ్వనించింది.

నర్తకి శృంగార గృహాన్నుండి సభా మండపానికి మెరుపు తీగోయన మిరుమిట్లు గొలుపుతూ ప్రవేశించింది. అమె ధరించిన ఆభూషణముల ఝూంకారములోనే శ్రావ్యమైన సంగీత మున్నది. వాయు మండలమంతా సుగంధభరితమై యున్నది. ప్రాతఃకాల సూర్యకిరణాల అరుణకాంతి ఆకాశాన్ని చీల్చుకొని వస్తున్నదా అనిపించినది. నర్తకి రాక ఆనందమునే సౌరభముతో కలసి వీచే హేమంతపు శీతలవాయువు ఎంతో హాయినిస్తున్నది. వాతావరణమంతా మారిపోయింది. సభామధ్యమున్న వేదికమీదకొచ్చి చిత్రలేఖ ముందుగా సామ్రాట్‌కు వందన మాచరించింది. ఆమె సౌందర్యము వర్ణింపరాని మనోరంజకమై యున్నది. ఆమె ముఖము పూర్ణచంద్రుని దిక్కరించుచున్నది. అటు నిటు నూగులాడే ఆమెజడ అమృతాన్ని గ్రోలచంద్రుని చుట్టియున్న నాగుబాము వలెనున్నది. ఆజడలో గూర్చబడిన ముత్యాల జాలరీ, అపదంలోనున్న చంద్రుని చూచి, తారకాగోళమంతా బారులుతీరి కాలసర్పముతో పోట్లాడుతున్నదో యన్నట్లున్నది. ఆమె అతి

సన్నని పట్టుమేలిముసుగు ధరించుటచే అంగప్రత్యాంగముల కోమలత్వం ఉన్నది ఉనట్లు కనిపించుచున్నది. ప్రశాంతమైన మేఘములను చీల్చుకొంటూవచ్చే. ప్రాతఃకాలీన సూర్యకిరణములవలే, దృఢమైన ఆమె ఉరోజముల ఆప్ట్సురవికను పటాపంచలుచేసుకొంటూ ప్రసరిస్తున్న దాయని పించుచున్నది. ఆమెలంగాలో పొదిగిన బాంగారపు నక్షత్రముల ప్రకాశము నకు సభికుల నైనాలు మిరుమిట్లు కొలుపుతున్నాయి. మహారాజుగారికి వందన మాచరించిన తరువాత ఆమె చిరునవ్వు మోమును సామంతుల వైపుకు సారించినది. సామంతులంతా ఆనంద సంభరితులైనారు. ఆమె దృష్టి వరుసగా సామంతుల పరికించుచూ, బీజగుప్తునివద్ద ఆగిపోయింది. ఆమె నైనాల చిరునవ్వు పరుగులు పెడుతూ అతనిని చేరింది. బీజగుప్తుడుగూడా చిరునవ్వు నవ్వాడు. చిత్రలేఖయొక్క మౌనమైన అభివందనమునను, బీజగుప్తుని జవాబుగూడా మౌనంగానే వచ్చింది. చిత్రలేఖ యావత్ విద్వమండలికి నమస్కరించినది. అగస్మాత్తుగా అమెదృష్టి యోగి కుమారగిరిమీద పడింది. అతని జవాబుకోసం కొంతసేపు నిరీక్షించింది. కాని అతడు ఈప్రపంచములో లేడు ధ్యాన వశిష్టుడై కండ్లుమూసుకొని యున్నాడు. చిత్రలేఖను నిరాశే శరణ్యమైనది. దృష్టిని మరల్చింది.

ఫిడేలు, మృదంగము మ్రోగనారంభించాయి. గజ్జలతో సుశోభితంగానున్న చిత్రలేఖ పాదాలు తాళానైనను సరించాయి. నృత్యం ప్రారంభమైనది. ఆవేదికను అన్నివైపుల నల్లని ఆకాశంలో మెరిసే మెరపులాగా మెరసిపోతుంది.

కారు మేఘాలులాగా గర్జించుచున్నది మృదంగము. సభలోని కోలాహలమంతా అణగిపోయింది. అంతా ముగ్ధులై కళాయుక్తమైన సర్వోచ్ఛ ప్రదర్శనమును చూస్తున్నారు.

అగస్మాత్తుగా కుమారగిరి నేత్రాలను తెరచాడు. ఆనేత్రాలలో ఒకవిధమైన దైవికజ్యోతి దేదీప్యమానంగా వెలుగొందుచున్నది. ఆతడు నిలబడి గంభీరంగా ఇలా అన్నాడు.—

"మంత్రివర్యా! నేను ఈశ్వరుని ఎరుగుదును. మిమ్ము, ఈసభను సంతృప్తి పర్చేందుకు ఇచ్చట ఈశ్వరుని చూపగలను.

సభలోని నిశ్శబ్ధానికి భంగము కలిగింది. కొంతమంది కుమారగిరి వ్యాఖ్యాన్ని విన్నారు. మరికొంతమంది విననే లేదు. వినని వారిలో ఎక్కువగా నిమగ్నులై నృత్యాన్ని చూస్తున్నవారు. సామంత యువకులే. వారు యోగిని చూచి కూర్చుండబెట్టుడని అరచారుగూడా.

చిత్రలేఖగూడా యోగి వ్యాఖ్యాన్ని వినలేదు. నృత్యం చేయడంలో నిమగ్నురాలై యున్నది. ఆమె కాళ్ళల్లోని చిత్రమైన గారడీయున్నది. ఆమె కళా కౌశల్యత వర్ణనాతీతమైనది. మహారాజు మంత్రి ఒకరి మొగమొకరు ఒకరు చూచుకొన్న తరువాత చాణక్యుడులేచి ఇలా అన్నాడు. "యోగి కుమారగిరి అభియోగమేమంటే, వారు ఈశ్వరుని ఎరుగుదురట. ఈసభలోనే, ఇప్పుడే, ఈశ్వరుని అందరకు, చూపగలరట. ఇందుకు మహారాజుగారుకూడా సమ్మతించారు. కాబట్టి ప్రస్థుతము నృత్యం ఆపడం ఉచితం."

ఈసారి సామంతులు, చిత్రలేఖాగూడా ఈప్రకటనను విన్నారు. చిత్రలేఖ నృత్యమును ఆపి చాణక్యునివైపు క్రోధ భరిత దృష్టితో చూచింది. అంతను రెండురెట్లు క్రోధంతో కుమారగిరిని చూచింది నిశ్శబ్దంగా ఒక మూలకువెళ్ళికూర్చు న్నది. ,,యోగి! మేమంతా ఈశ్వరుని చూడ ఉత్సుకులమై యున్నాము" అన్నాడు చాణక్యుడు.

కుమారగిరి తన ఆసనమును విడచి సభామధ్యమున కొచ్చాడు. సభలోని అల్లరంతా అణగిపోయింది. నేత్రా లను గట్టిగా మూసుకొన్నాడు. ,,పండితులారా! సామంతు లారా! నావంక చూడండి!" అన్నాడు కొంతతడవాగి కుమా రగిరి.

ఒక్కసారిగా సభాసభులందరూ చూచారు. యోగి కుమారగిరికి దగ్గరగానున్న యజ్ఞవేదికనుండి ఒక అగ్నిజ్వాల లేచింది. భవనకప్పునుగూడా ఛేధించుకొని ఆకాశం వైపుకు సాగింది. గ్రీష్మఋతువులోని మధ్యాహ్న సూర్యునికాంతికన్నా అతి ప్రకాశవంతముగా నున్నది. మెల్లగా ఆసన్నని అగ్ని జ్వాల ఒక ఆకారంగా పెరిగిపోయింది. ఆప్రకాశానికి తాళ లేక ప్రేక్షకులకండ్లుమూసుక పోయినవి. ఆఅగ్నిజ్వాలచాలా ఆశ్చర్య జనకంగానున్నది. దానిలో వేడిమాత్రంలేదు. తీవ్ర మైన ప్రకాశమున్నది. ,,ఇదేసత్యం" అన్నాడు కుమారగిరి.

,,యోగి! నీవబద్ధమాడుతున్నావు అక్కడ ఏమీలేదు· అన్నాడు మంత్రి చాణక్యుడు జవాబుగా.

ప్రేక్షకలోకం ఆశ్చర్యంగా మంత్రివైపును చూచింది, ‹‹వయోవృద్ధా మంత్రి! సత్యమనే ప్రకాశమును చూడలేక పోతున్నావా?›› అన్నాడు కుమారగిరి.

"ఏమిప్రకాశం? అక్కడ ఏమీలేదే!›› అన్నాడు ప్రతి వాదంగా చాణక్యుడు.

"అయితే ఈసారి చూడు›› అన్నాడు కుమారగిరి.

ఈసారి ఆఅగ్నిజ్వాల ఒక చిన్నఅగ్ని పుంజముగా మారింది. ఆచిన్నఅగ్ని పుంజములో ప్రేక్షకులంతా సృష్టిలో జరిగే నటనంతా చూచారు. పెద్ద పెద్ద నగరాల నిర్మాణం, తిరిగి వాటి వినాశనంగూడా చూచారు. వాయువు, భూమి, జలం, ఆకాశం మొదలగునవి గూడా కనుపించినవి. మెల్లగా ఆరంగమంతా మారిపోయింది. ఆఅగ్ని పుంజము మాత్రం అలాగే ఉండిపోయింది.

‹‹ఇదే ఈశ్వరశక్తి.›› అన్నాడు యోగి.

‹‹నాకేమీ కనుపించడంలేదు. యోగి! నీవబద్ధమాడు తున్నావని మరొకసారంటున్నాను›› అని పిచ్చివానిలాగా అర చాడు చాణక్యుడు.

కుమారగిరి కండ్లుమూసుకున్నాడు. అంతా అంతర్ధానమైపోయింది. కండ్లుతెరచినవ్వుతూ ఇలాఅన్నాడు. ‹‹మంత్రీ! నేను నీవే అబద్ధమాడు తున్నావంటున్నాను. నాఈకథనానికి సాక్షి ఈసభే. ఇచ్చట వర్తమానులైన సజ్జన సభాసదులే మీకు జవాబిస్తారు.››

‘‘మంత్రి అబద్ధమాడుతున్నారు. మేమంతా ఈశ్వరుని, సత్యాన్ని చూచాము.’’ అన్నారు ఒక్కొమ్మడిగా సభికులు.

మహారాజువంక చూచాడు చాణక్యుడు. ‘‘మంత్రి! యోగి అబద్ధమాడుటలేదు. నేనుగూడా ఈశ్వరుని, సత్యాన్ని చూచాను’’ అన్నాడు మహారాజు.

‘‘యోగి! నాకండ్లు నన్ను ప్రథమముగా మోసగించాయి. నేను పరాజితుడను మీరు విజయులు’’ అని చతికిలబడినాడు మంత్రి చాణక్యుడు.

యోగి అచ్చటనుండి వెళ్ళసిద్ధమగుచున్నాడు. ఇంతలో చిత్రలేఖభ ఈశబ్దాలు వినిపించాయి. ‘‘యోగి! ఆగు! నాభ్రమ ఇంకా దూరముకాలేదు’’ ప్రేక్షకుల నైనాలు ఒక్కసారిగా చిత్రలేఖ వైపుకు తిరిగినాయి. సభంతా కౌతూహాలంతో నిండిపోయింది. యోగి కుమారగిరి అవశ్యం ఆగిపోవలసి వచ్చింది. చిత్రలేఖ ముందుకుసాగి ఇలాఅంది. ‘‘యోగి! నాకుగూడా మీరుచూపిన ఈశ్వరుడు, సత్యము కనుపించలేదు. మంత్రి చాణక్యుడు అబద్ధ మాడినాడని అందరూ తోసిపుచ్చవచ్చు. కాని నేను అలాచేయలేను. నేనుమిమ్మల ఈశ్వరసాక్షిగా అడుగుచున్నాను. యావత్తు సభకు చూపిన సత్యాన్ని ఈశ్వరుని వాస్తవంగా మీరు చూడగలిగారా?’’

నర్తకి నైనాలు యోగినైనాలలో కలసి పోయినాయి. యోగినైనాలలో దృఢవిశ్వాసం తాండవ మాడుతున్నది. నర్తకి నైనాలలో ఉత్సాహం అవిశ్వాసం యొక్క ఆభప్రి

కాసిస్తున్నది.కుమారగిరి నోటనుంచి అగస్మాత్తుగా—"లేదు" అనే శబ్దం వెలువడింది.

ప్రేక్షకులంతా చకితులైనారు. మంత్రి చెప్పరాని ఆనందముతో లేచి నిలబడినాడు. చిత్రలేఖ అది గమనించ లేదు. "యోగీ! మీరు మీఆత్మశక్తి ప్రభావంతో మీకాల్పనిక నిర్మితమైన ఈశ్వరరూపాన్ని చూపగలిగారుగదూ? అనృతమాడవద్దు. నేను ఈశ్వరసాక్షిగా అడుగుచున్నాను. పైగా మీరు యోగులుసుమా?"

కుమారగిరి కొంచెమాలోచించి జవాబిచ్చాడు. "నీవు యదార్థమే చెప్పుచున్నావు."

ఈప్రశ్నోత్తరముల నాలకించినవారు నిశ్చేష్టులైనారు. "మరొక ప్రశ్నఉన్నది. మీఆత్మశక్తి ప్రభావానికి వశీభూతులు కానటువంటి వారికి మీరు మీకాల్పనిక నిర్మితమైన ఈశ్వరరూపాన్ని చూపలేకపోవడంగూడా వాస్తవమేగదూ?" అని తిరిగి ప్రశ్నించింది చిత్రలేఖ.

సభలో కోలాహలం లేచింది. కుమారగిరి పాండిత్యం అభాసు పాలైంది. అతడు ఆలోచించి శాంతముగానే జవాబిచ్చాడు. "భగవంతుని నమ్మినవారిలోనే ఆత్మశక్తి ఉంటుంది నాస్తికులలో ఆత్మశక్తికి తావులేదు. అసలు కల్పనఅనేది మనుష్యునిలోఉంటే, అది తప్పకుండా ఎప్పుడో ఒకప్పుడు ప్రభావాన్ని పొందుతుంది. కల్పన చచ్చినచోట నాస్తికత్వం యొక్క అంధకారం ఆవరించినప్పుడు ఈశ్వరుని గుర్తించడం అసాధ్యం. ఇప్పుడు ఈశ్వరుని, సత్యాన్ని చూడలేనటువంటి

వారికల్పన చచ్చిపోయిందని చెప్పొచ్చు. వారునాస్తికులు. వారిలో ఆత్మశక్తిలేదు."

చాణక్యుడు మహారాజు వంకచూచాడు. మహారాజు చాణక్యునకు ఏదో సంకేతం ఇచ్చాడు. తరువాత చాణక్యుడు లేచి విజయకిరీటం చిత్రలేఖ సిరమందుంచి–"నర్తకీ! నేటి విజయం నీది. ఆత్మశక్తిని దుర్వినియోగపర్చి భ్రమయనే ఆవరణలో సత్యాన్ని మరుగుపర్చ ప్రయత్నించిన కుమారగిరిని బట్టబైలుచేసి యథార్థాన్ని బైట పెట్టావు—యోగి నీవు అనుచితంగా వ్యవహరించావు. ఇందుకు నిన్ను శిక్షించాల్సిఉంది. ఆఅధికారం చిత్రలేఖకు ఈయబడింది." అన్నాడు.

కుమారగిరి నేత్రాలు క్రోధంతో ఎరుపెక్కాయి. "ఈసభలోని వారెవ్వరూ నన్ను పరాజితుణ్ణి చేయజాలరు. నన్ను శిక్షించుటకుకూడా సాహసం ఎవ్వరికీలేదు." అని యోగి సగర్వంగా నిలబడి పోయినాడు.

యోగి రౌద్రవేషానికి సభంతా గడగడ లాడింది. కాని చిత్రలేఖ చిరునవ్వు నవ్వుతూ యోగి వైపుకుసాగింది. వెళుతూ వాయిద్యాలు వారికి ఏదో సైగనుచేసి మరీవెళ్ళింది. యోగి కుమారగిరి చెంతకుపోయి ఆగింది. "యోగీ! మిమ్ము శిక్షించే అధికారం నాకీయబడింది. నేనుమిమ్ము శిక్షించ సిద్ధమైనాను. నా ఈసాహసోపేతమైన శిక్షను చూడండి!" అని చిత్రలేఖ బంగారపు విజయకిరీటమును యోగి కుమారగిరి సిరమందుంచింది.

వెంటనే వాయిద్యాల మోత మారుమోగింది. చిత్రలేఖ వేదికపై మెరపుతీగవలె మెరచింది. నాట్యమారంభమైనది. సభికుల హర్షధ్వని ప్రతిధ్వనించింది.

కుమారగిరి మూగవానిలాగా నిలబడి యున్నాడు. చిత్రలేఖ దూరంగా వెళ్ళినతరువాత కొంచెము స్పృహవచ్చింది. అదేసమయంలో సభంతా హర్షధ్వనితో నిండిపోయింది. "పరాజయం! శిక్ష! వీటిని గురించి ఆలోచించవలసి ఉంటుంది" అని యోగి శరవేగంగా వెళ్ళిపోయినాడు.

## 6.

పరాజయంపొంది అవమానితుడైన యోగికి క్రొత్త అనుభవము కలిగింది. ఆ తీవ్ర అనుభవమువల్ల యోగినిస్తేజుడైనాడు. ఎప్పుడైనా పరాజయం ప్రాప్తించుతుందని కలనైనా గాంచి ఎరుగడు. అందులోనూ, ఒకస్త్రీతో! అయితే ఆస్త్రీ ఎవరు? ఒక సాధారణ నాట్యకత్తె! కుమారగిరి హృదయంలో ఒక రకమైన కల్లోలం జనించినది. పరిస్థితులను గురించిబాగా ఆలోచించాడు. అతనిని విజయలక్ష్మి వరించినప్పటికి పరాజితుడైనాడు. మహారాజా చంద్రగుప్తుని విశాల సామ్రాజ్యములోని ఎన్నదగిన పండితులను, విద్వాంసులను ఓడించాడు. కాని ఒక అంధకారయుతమైన స్త్రీతో పరాజయం పొందాడు. అంధకారం ఎదుట పరాజితులగుట స్వాభావికమే స్త్రీ ఎదుట పెద్ద పెద్ద సాధకులే పరాజయం పొందారు. కాని

అట్టివారు నైతికక్షేత్రంలో పరాజితులైనారు. జ్ఞానంలో మాత్రంగాదు! కుమారగిరి పరిస్థితి అంతా విచిత్రముగానే యున్నది——

విజయం! పరాజయం! ఈరెండూగూడా సహజమే. కాని ఈపరాజయం విలక్షణమైనది. బహుశా ఈమె జ్ఞానం వల్ల కుమారగిరి పరాజితుడు కాలేదేమో? ఆమె ఉదారతే ఈయన పరాజయానికి కారణం కావచ్చు. కనకపు విజయకిరీటం ఇప్పుడుగూడా ఆయన శిరముమీద సుశోభితంగా వెలయుచున్నది. కుమారగిరికి దానిజ్ఞాపక మొచ్చింది. వెంటనే కుపితుడైనాడు. కిరీటమునుతీసి నేలకేసరి కొట్టాడు. తరువాత తిరిగి ఆలోచించసాగాడు. ,,పరాజయం! ఈశబ్దానికి అతని క్షేత్రంలో స్థానంలేదు. విజయంకోసమే సంసారికసర్వ సుఖములను త్యజించాడు. ఘోరతపస్సుగూడా చేశాడు. ఇంత జేసినా పరాజయమేనా? కుమారగిరి లేచినిలబడినాడు? పరాజయం అసంభవము. నేనుపరాజితుణ్ని కాజాలను. కాను. నా సాధనంయొక్క అంతం పరాజయమేనా? ఎన్నడు - కాదు. కాజాలదు.

కుమారగిరి నైనాలు ధూళిలోపడియున్న కనకపు కిరీటం మీదపడినాయి. అవిచలితభావంతో యోగి కొంత సేపు కిరీటంవైపుకు చూచాడు. అతనికి కిరీటం ఇలాఅంటున్నదా అనిపించింది. ,,యోగి! నీవు పరాజితుడవు కాలేదు. నీవు విజయుడవే" యోగి శరీరంలో ఒక విధమైన ఉత్సాహం కనుపించింది. కిరీటం దగ్గరకు,చేరి ఆగిపోయినాడు. విజయుత

మైన పరాజయం! ఎంతవిచిత్రమైన విషయం! నాకు ఈవిజయ కానుకమీద అధికారమున్నదా? సభాదృష్టిలో మాత్రం నేను ఆస్త్రీతో పరాజితుడనైనాను. ఈకిరీటం ఆస్త్రీకి ధరింపచేయ బడినది. ఇది కక్కనకూడదు. కుమారగిరి ముఖాన్ని వెనుకకు త్రిప్పాడు. అతను అచ్చటనుండి వెళ్ళప్రయత్నించాడు. కాని కాళ్ళు ముందుకు సాగలేదు. కిరీటం అచ్చటనే పడియున్నది. దానిప్రకాశం ఎంతో ఉజ్వలంగా నున్నది. కుమారగిరి కిరీ టంవైపుకు తిరిగి చూచాడు. "నాకీ కిరీటం ఏలాలభించినది? సభికులందరూ విజయంనీదేయని ఘోషించినా, ఆస్త్రీ నన్ను విజయునిగా అంగీకరించింది. అయినప్పుడు విజయం నాదే. నర్తకీ! నీవు పరాజయం పొందినట్లు ఎందు కంగీకరించావు?"

"పరాజితు రాలను గాబట్టే అంగీకరించాను"

యోగి తుళ్ళిపడినాడు. ఎదుట చిత్రలేఖ నిలబడియు న్నది. ఆముఖంలో చిరునవ్వు చిందు లాడుతుంది. నైనాలు గూడా నవ్వుతున్నాయి. "యోగి! విచిత్ర విషయమేమంటే. పరాజయం ఆనంద రేఖలతో వికసించింది. విజయం వ్యగ్ర రూపాన్ని దాల్చింది."

కుమారగిరి మాటాడలేదు. ఆయన కిరీటం వైపుకు ధ్యానంగా చూస్తున్నాడు.

"ఇదేమి? విజయకిరీటం ధూళిలో పడిపోయిందే? యోగి! మీకు విజయం అంగీకారంగాలేదా?" చిత్రలేఖచిరు నవ్వు ఆగిపోయింది.

కఠినాతి కఠినమైన ప్రశ్న. ఆత్మాభిమానం కలిగిన యోగికి పరాజయాన్ని అంగీకరించడమంటే అసాధ్యం. కుమారగిరి మౌనాన్ని విడువలేదు.

చిత్రలేఖ కిరీటం పైకితీసింది. ‹‹యోగి! మిమ్మల పరాజితులనుచేయుట నాశక్తికి మించినదని మాత్రం విశ్వసించండి" ఆమెకిరీటాన్ని యోగితలకు తగిలించింది. కక్కనకూడదు అని దుమ్ములో పారవేసిన కనకపు కిరీటమును తిరిగి తన శిరస్సుకు ధరింపజేస్తూ ఉంటే యోగి చూస్తూ ఊరుకున్నాడు. తిరస్కరించలేకపోయినాడు. కుమారగిరి కండ్లుమూసుకొని ఏదో ఆలోచిస్తూమాత్రం ఉన్నాడు.

‹‹యోగి! ఏమాలోచించుచున్నారు?"

యోగి నేత్రాలు తెరచాడు నర్తకీ చిత్రలేఖా! నీవు నన్ను పరాజితుణ్ణి చేశాననుకొంటున్నావు. అందుకనే మాటి మాటికి నన్నవమానింప జూస్తున్నావు. ఈ యోగి ప్రపంచాన్ని త్యజించాడు. మానపమానములతో నాకేమీ సంబంధములేదు. కనుక నీవుచేసే ప్రయత్నమంతా వ్యర్థమే"

‹‹యోగి! మీ ఈ భావం అనుచితంగానున్నది. నాలో మిమ్మల పరాజితులచేసే శక్తి, సామర్థ్యములు లేవని మరొక్కసారి చెప్పుచున్నాను" అని చిత్రలేఖ శాంతముగా జవాబిచ్చింది.

కుమారగిరి తన నైనాలను చిత్రలేఖమీద నిలపాడు. కొన్ని క్షణాలపాటు ఆమెను క్రీగంట చూచాడు ఆయనముఖం అకస్మాత్తుగా ఎర్రబారింది. యోగి నిశ్చలమైన శరీరంకూడా

పులకరించింది. వెంటనే యోగి చిత్రలేఖ కోమలమైన కర మును గట్టిగా పట్టుకొని ఇలా అన్నాడు. ,,నర్తకీ! నిజంచెప్పు! ఛాయలాగా నీవుమళ్ళీ ఇచ్చట కెందుకొచ్చావు? ఊరకంగా ఇచ్చటగూడా నన్ను వంచితుణ్ణి చేయడంలో నీధేయమేమి?"

ఆవేశంతో కుమారగిరి శరీరంఅంతాకంపించిపోతుంది. చిత్రలేఖ సాంతముగా సగసన కలసి నిలబడింది. ఆమెనైనాలు కుమారగిరి నైనాలలో కలసిపోయినాయి. చిత్రలేఖ నైనా లలోని ఆ మాదకత్వం ఏలాంటిదో ఎవరికి తెలుసు? ఆమెచిరు నవ్వుతో జవాబు చెప్పింది. "నన్ను ఓడించి విజయం పొం దిన వారివద్ద గురుదీక్ష పొందాలని వచ్చాను."

అది మాఘమాసం. సుగంధ భరితమైన చల్లనిగాలి వీచుచున్నది. వెన్నెల కిలకిల లాడుతున్నది. నక్షత్రాలు పక పకలాడుతున్నాయి. నిర్జన ప్రదేశంలో. అందులోనూ రాత్రి సమయంలో యోగి కుమారగిరి సమక్షమున నర్తకి చిత్రలేఖ నిలబడిఉంది.

కుమారగిరి ఆవేశం మెల్లగా లోపించింది. వెంటనే వెను కనుగ్గాను. ,,సుందరీ! నావద్ద దీక్ష పొందటమంటే, ఏమిటో ఎప్పు డైనా ఆలోచించావా? అని వచ్చీరాని స్వరంతో అన్నాడు యోగి.

చిత్రలేఖ ఒక్కసారిగా నవ్వింది. ఆమెనవ్వులోని మాధుర్యం విచిత్రమైనది ఆనవ్వులో సజీవమైన సంగీతంఇమి డియున్నది. ,,అవును ఒక్కసారుగాదు. అనేకమార్లు లోలో చించాను."

కుమారగిరి బంతులలాంటి తన నైనాలను చిత్రలేఖ మీాదనుండి తొలగించాడు. ,,నీవు దీని ప్రయోజనమును

తెసులుకోలేవు. నావద్ద గురుదీక్ష పొందడమంటే తాత్పర్యం-ఉపభోంచిక భోగవిలాసాలకు. వాసనావృత్తికి తిలాంజలి నివ్వాలి. ఏఅకర్మణీయుతను, నీవు వ్యతిరేకించుచున్నావో, ఏసాధనావృత్తిని నీవు వ్యంగ్య పరుస్తున్నావో, వాటినే తిరిగి స్వీకరించడమంటే మరియు దానిలో నీకోమల శరీరాన్ని తపింప చేయడమంటే సాధారణ విషయంకాదు."

చిత్రలేఖ మౌనమువహించినది. ఏమి జవాబివ్వాలా? యని ఆలోచిస్తున్నది. నర్తకియై యుండిగూడా తార్కికమైన వికృత సిద్ధాంతమునకు దాసియైయుండిగూడా చిత్రలేఖకు అబద్దమాడే ఆచారంలేదు. ఆమె ఆత్మ అందుకు వ్యతిరేకించు చున్నది. హృదయం సమర్థించుచున్నది. ఆఖరుకు హృదయమే విజయాన్ని పొందినది. అదే ఆమెకు మొట్ట మొదట సారిగా అబద్ధ మాడడానికి అవకాశం కల్పించినది. "యోగి! అన్నింటికి తయారై వచ్చాను."

"అన్నింటికీ తయారై వచ్చావా? సుందరీ! నీవు పొర బడుతున్నావు. నీవుచేయ సిద్ధపడినపనిచాల కఠినమైనది. ప్రతి వారు దానిని ఆచరించలేరు. మమత్వాన్ని విస్మరించడం అసాధ్య విషయమనేది నీకు తెలుసు. దీనిని నివాచరించలేవు"

చిత్రలేఖ గంభీరంగా — "నిజం చెప్పుచున్నారు యోగి! కఠినమైతే, కావచ్చు. కాని అసాధ్యంమాత్రంగాదు" అన్నది.

యోగి కుమారగిరి చిత్రలేఖను చిరుపాదాల దగ్గర నుంచి శిరస్సుదాకా చూచాడు. నృత్యం చేసినప్పుడు ధరిం

చిన వస్త్రాలే ఇప్పుడూ ఆమె శరీరంమీద నున్నవి. ఆమె నేత్రాలలో ఉల్లాసం ఉట్టిపడుతుంది కుమారగిరి తనలో తానే ఇలాఅనుకున్నాడు. "ఈమె అద్వితీయమైన అందకత్తె" ఇప్పటివరకు సౌందర్యము, ప్రేమ, వికారము, అంటే ఏమిటో ఎరుగడు. ఆసౌందర్యానుభూతితో యోగి హృదయంలో ఒక రకమైన ఆరాటం ఉద్భవించింది. యోగి ప్రధమసారిగా, వాసనా మిశ్రితమైన సౌంధర్యానుభూతిని పొందాడు. ఈసుఖం ఎంత విచిత్రమైనది! "సుందరీ! చిత్రలేఖా! నీకు గురుదీక్ష నివ్వడం ఎంతవరకు సమంజసముగా ఉంటుందో ఆలోచించాలి. ఇప్పుడేమీ చెప్పజాలను" అన్నాడు యోగి.

"ఇప్పుడేమీ చెప్పజాలరా? యోగి?" అనియోగి వాక్యానే పునరుచ్ఛరించింది చిత్రలేఖ. "ఏం? యెందుకని? మీకు నామీద విశ్వాసంలేదా? లేక మిమ్ములను మీరే విశ్వసించుటలేదా? యోగి! నాకు దీక్షనివ్వడము నేచి, మీకు పెద్దసమస్యగా కనుపించక పోవచ్చు. కాని నాకుమాత్రం జీవితసమస్య సుమా? ఈవిషయంలో మీకు చాలాముఖ్య బాధ్యత ఉన్నదనేది గుర్తించాలి. ఒకవ్యక్తి వద్ద సమృద్ధిగా జలమున్నదనుకోండి. దప్పిగొనివచ్చిన ఒక అధితికి ఆవ్యక్తి దాహాము తీర్చక పీక యెండుకపోయి చస్తున్న అధితిని అట్లే చూస్తూవుంటే, ఆవ్యక్తి మహాపాపి అనేదిగూడా తెలుసుకోవాలి. అలాంటివాని ఆత్మకు సుఖం లభించడంగూడా దుర్లభమే."

ఈజవాబుతో కుమారగిరి కొంచెము క్రుద్ధుడైనాడు. "సుందరీ! నీతో ఉన్న విషయాన్ని స్పష్టంగా చెప్పుచున్నాను

దార్శికవికృత సిద్ధాంతమునీలో బాగాజీర్ణించియున్నది.దానితో పాటు చాలినంత తార్కిక బలంగూడా ఉన్నది. అలాంటివ్యక్తిలో ఈపరిభావం ఎలాసంభవము? అనే సందేహం నాకు కలుగుతుంది. అంతేకాకుండా ఆసిద్ధాంతములో నుంచి నిన్ను బైలుపర్చేదానికిబదులు, నేనే అందులో చిక్కుక పోతాననే భయంగూడా నాకు కలుగుచున్నది —ఊ... హూ... కాదు.. కాదు" కుమారిగిరి ఆగిపోయినాడు. తనమానసిక దుర్బలతను మొదటిసారిగా చవిచూచాడు. తెలియకుండానే బైటకు కూడా వెళ్ళబెట్టాడు. అందులోనూ ఒక నర్తకి సముఖమున తన దుర్బలత్వాన్ని ప్రదర్శించాడు. అదియోగి దుర్భాగ్యమే కావచ్చు. తనమీద తనకే కోపంవచ్చింది. అతని శాంతియుతమైన ముఖం ఉద్వేగంతో ఉద్ధాంత లూగుచున్నది. ,,సుందరీ! నేను చెప్పిన వాటిలో ప్రయోజనమేమీలేదు. ప్రస్తుతము నీవు నావద్దనుండి వెళ్ళవలసినదిగా మాత్రం ప్రార్థించుచున్నాను. నాకు పరిస్థితులను గురించి ఆలోచించే అవకాశం ఇవ్వు."

,,మంచిది! యోగి! నేను ఇచ్చట ఉండుట మీకు కష్టమైతే వెళ్ళడమే ఉచితము. మీఎదుటనున్న ఈస్త్రీ అంధకారమని. మాయయని తలుస్తున్నారు. మీరు నా వికృతి సిద్ధాంతములనుచూచి భయపడుతున్నారు. మీ ఈ సందేహం ఆధారరహితమైనది. గురుదీక్ష పొందుదామని బైలుదేరినప్పుడే, నేను నాసంస్కారములను. సిద్ధాంతములను. భావాలను. తిలోదకాలిచ్చాను. ఇకమిగిలింది స్త్రీ, అంధకారం, మాయ, అనే విషయం. యోగి! ఈ విషయంలో మీరు

పారబడుతున్నారు. స్త్రీ ఒక అతీతమైన శక్తి. ఆమె సృష్టి. ఆశక్తిని, సృష్టిని, నడిపించేవ్యక్తి అయోగ్యుడైతే, వినాశకారిగా కనబడుతుంది. కనుక స్త్రీనిచూచి భయపడేవ్యక్తి అయోగ్యుడైనా కావాలి. లేక పిరికి పంద యైనాకావాలి. అయోగ్యత, పిరికితనం ఉన్నటువంటి వ్యక్తులు అపూర్ణులు, పూర్ణులు కాజాలరు."

చిత్రలేఖ కదలి కొంచెము దూరమువెళ్లి ఆగింది. కుమారగిరి దృష్టి శూన్యం వైపుకు వెళ్లింది. "ఒక విషయం చెప్పడం మరచాను. రేపుమళ్లీనేను మీావద్ద కొస్తాను. మీారు ఆలోచించ డానికి యదేష్ట సమయాన్నిస్తున్నాను. నాకు గురుదీక్షనిచ్చుట ఉచితమనుకుంటే రేపుగట్టిగా చెప్పాలి. మంచిది శ్రీవారలకు ఈదాసీ నమస్కారములు" అన్నది చిత్రలేఖ.

కుమారగిరి చిత్రలేఖ వెళ్ళడంచూచాడు. అగస్మాత్తుగా తుళ్ళిపడ్డాడు. చిత్రలేఖస్వరంలోని సంగీతం అతనిచెవులలో మారుమోగుచున్నది. ఆమెసొగసు అతనిఎదుటనాట్యమాడుతున్నది. మంచి నిఖార్సైన మధుపానం మట్టిలో కలసిపోతుంటే, తృప్తిపడనటువంటి తాగుబోతు దానివంక చూస్తునట్లుగా కుమారగిరి చిత్రలేఖవంక చూస్తున్నాడు. తనను తానాపుకోవడం అసాధ్యమై పోయింది యోగి చిత్రలేఖను పిలచాడు. "సుందరీ! ఆగు!"

కుమారగిరి కండ్లు క్రిందికి దించాడు. "నీవా స్త్రీమాటలకు జవాబిచ్చి. యదార్థాన్ని ఆమె ఎదుట ఉంచు" అని

హృదయం పలికింది. ఆత్మవ్యతిరేకించింది. ఆత్మవ్యతిరేకాన్ని తోసి పుచ్చాడు యోగి. చిత్రలేఖ తిరిగివచ్చింది, ఆమె ముఖంలో చిరునవ్వు చిందులాడుతున్నది. ,,యోగి! బహుశా మీపొరబాటును మీరు తెలుసుకొని ఉంటారు. ఊ...ఏం చెప్పదలచారు?"

కుమారగిరి జవాబివ్వలేదు. ఆపండు వెన్నెలలో ఆమె స్వత్యంతమైన అందాన్ని ఆస్వాదిస్తున్నాడు యోగి. ఆయన చిత్రలేఖలో శృంగారాన్ని, శృంగార మిశ్రితమైన పులకిత సౌందర్యాన్ని, మధుపానమును మాదకత్వాన్ని చూచాడు. ,కోర్కె' కోర్కెలోని మాధుర్యాన్ని చవిచూచాడు. స్త్రీ అంటే ఏమిటి? సౌందర్యమననేమి? భగవంతుడు ఈరెండువస్తువులను ఎందుకు సృష్టించాడు? అని ఆయనకొన్ని సంవత్సరాల స్వానుభంవల్ల ప్రశ్నించుకున్నాడు. ఆఖరుకు బాగా ప్రయత్నించి ఈఆలోచన లన్నింటిని అణగ దొక్కాడు.

,,సుందరీ! నేను పొరబాటుచేశానా? నాజీవితంలో నేను ఎన్నడూ పొరబాటుచేసి ఎరుగను".

,,తర్కించడం ఉచితంగాదు. దేవా!క్షమించండి. నాకు గురువులు కాబోయ్యేవారు పొరబాటు చెయ్యజాలరు. నా మాటలకు నేను క్షమాపణ కోరుచున్నాను".

,,ఏమి చెప్పదల్చారు? అని ఇప్పుడే అడిగావు. బహుశా ఎందుకు పిలచారనికూడా అడుగుతావు. వాస్తవంగా ఇదంతా నేను ఎందుకు చేశానో నాకే తెలియదు. ఈసారి నేను ఏదో పెద్ద పొరబాటు తప్పక చేసియుంటాను. అయినపటికీ నేను

పిలచానుగాబట్టి ఇదుగో ఒక విషయం చెప్పుతున్నా—నీకు గురుదీక్షనివ్వడంలో నేను పూర్తిగా అసమర్ధుడను. నావల్ల ఈపని జరగడంగూడా అసంభవమే. నీకు గురుదీక్ష నివ్వడమంటే, నేనే స్వయంగా దీక్షితుడనగుటయని నాభావము. అందుకు నేను సిద్ధంగాలేను» కుమారగిరి నేత్రాలు ఆకాశం వైపుకు పరుగెత్తి చంద్రునివద్ద ఆగిపోయినాయి.

చిత్రలేఖ గంభీరవదన యైనది. ఆమె ముఖంలో నిరాశమేఘాలు అలముకున్నాయి. ఆమెనేత్రాలలో కరుణా ఛాయ వ్యాపించింది. మెల్లగా యిలా అన్నది. ,,దేవా! మీం పొరపాటుకు మీకంటే అధికదుఃఖము నాకు కలుగుచున్నది. ఏంచెయ్యను? మీ అసమర్ధత ప్రభావం నా జీవితంమీద ఎలాపడుతుందో మాత్రం సరిగా చెప్పజాలను. కాని మీరు నాజీవితాన్ని ఎక్కువగా ఆకర్షించాలనేది వాస్తవము. ఇప్ప టివరకు మీరు నాకు గురుదీక్షనిస్తారనే ఆశతో వున్నాను. ఆశనిరాశయై పోయింది. భవిష్యత్ మీద ఆధారపడి వెళ్ళిపో వుచున్నాను. మీ వుద్దేశ్య ప్రకారము నాజీవితం అంధకా రమే. కాని మీ ప్రకాశాన్ని చూడ గోరుచున్నాను. ఆ... కో...రి... కపూర్తి కాజాలదు. ఇందుకుమిమ్ములను దూషిం చను. నేను నాభాగ్యదేవతనే దూషించుతాను. ఇంతవరకూ చెప్పి చిత్రలేఖ యోగి కుమారగిరివద్దకు చేరింది.

యోగి నిశ్చేష్టుడై నిలబడినాడు. చిత్రలేఖ యోగి చేతిని పట్టుకున్నది, యోగిలో ఒక విచిత్రమైన ఉబలాటం ఉద్భవించింది. ఆఉబలాటంలోఉల్లాసం—సుఖ— ఉన్నాయి. ,,అవును. నాకు-మీకు సంబధం ఏర్పడదు బహుశా అసం

భవమే. నేను స్త్రీని. మీరు పురుషులు. నేను నరకిని-మీరు యోగులు. వాసనాయుతమైనది నాక్షేత్రం-మీక్షేత్రం సాధనాయుతమైనది. ఈ రెండింటికి ప్రతి ద్వందత ఉన్నది. మీరు నాజీవితం లోనికి ఒకబవండరు లాగా వచ్చి పోతున్నారు. నిజమేభవిష్యత్ లో మీతోఎన్నడూ కలుసుకోకుండా ఉండేందుకు ప్రయత్నిస్తాను. ఇంతను ముందుగూడా మనమిద్దరము వేరు. యోగి. మీపాదధూళి నా శిరముమీద చల్లుకో గోరుచున్నాను» అని చిత్రలేఖ కుమారగిరి పాదములమీద వ్రాలింది.

కుమారగిరి హృదయం కొట్టుకో నారంభించింది. చిత్రలేఖ కాళ్ళమీద పడటంచూచి యోగి తృళ్ళిపడినాడు. చిత్రలేఖను లేవనెత్తాడు. ఆమెను లేవతీసేటప్పుడు చిత్రలేఖ ఉరోజములకు యోగి కరస్పర్శ జరిగింది. చిత్రలేఖ ఆనందముతో పులకితురాలైంది. యోగి దృష్టిలో మాత్రం ఈస్పర్శకు విశేషమహత్తులేదు. సాధారణంగా అలాజరిగింది. అతనిఆలోచన మరియొకవైపుకు కేంద్రీకరించబడిఉంది. కాని చిత్రలేఖ దీనికీవెరుగా తలంచినది.

‹‹నీవు నాపాదములకు ఎందుకు మ్రొక్కుచున్నావు సుందరీ?»

చిత్రలేఖ కుమారగిరితో కలసిపోయి నిలబడింది. తన ముఖాన్ని యోగి ముఖంలోచేర్చి చెప్పింది. ‹‹మీరు నాఆరాధ్య దేవతలు»

కుమారగిరి నేత్రాలు చిత్రలేఖ నేత్రాలల్లో కలసిపోయినాయి. ఆమెనేత్రాలలోని మాదకత్వ ప్రభావము యోగి నేత్రాలలోనికి సోకసాగింది. ఆమె తనముఖాన్ని మరి కొంచెము ముందుకు సాచింది. కుమారగిరి తనముఖాన్ని వెనుకకు త్రిప్పలేదు. అతని శ్వాసలో గూడా తాపమున్నది. యోగి శరీరం యావత్తు వణక సాగింది.

ఇంతలో కుమారగిరికి వినిపించింది. ,,గురుదేవ్!" కుమారగిరి తొట్రుపాటు చెందాడు. తనకు తెలియకుండా తనవద్దఒక కోడెత్రాచు సర్పమిడిచి కరవస్తున్నప్పుడు ఇంకో ఇతరవ్యక్తి ఆసూచనను ఇవ్వగా ఎంతవేగంగా తప్పుకుంటాడో, అంతవేగంగా చిత్రలేఖ నుండి కుమారగిరి తప్పుకున్నాడు. ఎదుట విశాలదేవ్ నిలబడియున్నాడు. విశాలదేవ్‌ను చూచి కుమారగిరి లజ్జితుడైనాడు. శిష్యునియెదుట ఒక నర్తకితో పరాజితుడైనాడు.

చిత్రలేఖకు విశాలదేవ్‌మీద పట్టరానికోపంవచ్చింది. ఈసమయంలో వచ్చుటకు విశాలదేవ్‌కు ఏ అధికారంలేదు. తోకత్రొక్కిన త్రాచువలే బుస్సలు కొడుతూ లేచింది చిత్రలేఖ. ,,యువా! నీవెవరవు? ఇప్పుడు నీవెందుకొచ్చావు?" అని గర్జించి అడిగింది చిత్రలేఖ.

,,నేను గురుదేవుని శిష్యుడను. ఇంతరాత్రి గడచినాగాని,గురుదేవురానందున నేనువార్ని వెతుకుతూఇలావచ్చాను"

,,ఆహా! భా—గ్య—మా!" అని నిట్టూర్పు విడచింది చిత్రలేఖ. తరువాత కుమారగిరితో ఇలా అన్నది. ,,మం

చిది! ఇంకా వెళ్ళివస్తాను. గురుదేవు! నేను మీావద్ద గురు దీక్ష పొందగోరు చున్నాను. మీారు తప్పక నాకు దీక్షని వ్వాలి. అనేదిమాత్రం గుర్తుంచుకోండి. చిత్రలేఖ స్మృభుత్వ భరితమైన ఆగంభీర స్వరంలో ఆజ్ఞాపించె దొరసాని కుండవల సిన గురుత్వం ఉన్నది. ‘‘నేను జనరల్ ప్రపంచాన్ని విడచి ఏకాంతముగా నుండగోరుచున్నాను. మాయను త్యజించి బ్రహ్మను చేరగోరుచున్నాను. మీాకు నమయాన్నిస్తున్నాను గురుదేవు! బాగా ఆలోచించండి. మీారు సాదారణ మాన వులుకారు. నన్ను సూచి మీారు భయపడవలస్ని అగత్యం లేదు. మీారు ఇంద్రియ నిగ్రహులు. ఇందువల్లే మిమ్ముల్లను పార్థించుచున్నాను. మంచిది! శ్రీవారి పద్మాలకు ఈదాసి నమస్కారాలు’’ అని చిత్రలేఖ అచ్చటనుండి వెళ్లిపోయింది.

కుమారగిరి విశాలదేవ్ చేతిని గట్టిగా పట్టుకొని ఇలా అన్నాడు. ‘‘నీవు-మూ——ర్ఖు——డవు’’ అప్పటికి చంద్రుడు హాస్తగిరి కరుగుచున్నాడు.

## 7.

శ్వేతాంక్!

‘‘అయ్యా!’’

‘‘నేడు నీవేమిచేచావో చెప్పగలవా?’’

‘‘అవును! నేను అమ్మగారు యోగి కుమారగిరిని ఓడించారు. ఎంత ఆనందము!’’

బీజగుప్తుడు నవ్వాడు ఆనవ్వులో కళలేదు. ‘‘చిత్రలేఖ కుమారగిరిని ఓడించిందా? అందుకు నీకానందముగా నున్నదా? శ్వేతాంక్! నాకువిచారముగా నున్నది. ఈమాట నీకాశ్చర్యమును కలిగింప వచ్చు. కాని నామాటలో యదార్థమున్నది: నీవు నవ్వగలవు—నేనూ నవ్వగలను—నాఆత్మ మాత్రం దుఃఖించుచున్నది”

‘‘నేను అయ్యగారి మాటలలోని అంతరార్థాన్ని గ్రహించలేకున్నాను” అని శ్వేతాంకుడు ఆశ్చర్యముగాఅన్నాడు

‘గ్రహించ లేకున్నావా? ఎలాగ్రహించ గలుగుతావు.! ఇప్పటికీ నీవు ప్రపంచమును సరిగ్గా పరికించి ఎరుగవు అనుభవరహితుడవు. నీవనుకొన్నట్లు చిత్రలేఖను అదివిజయం గాదు—ఒక పెద్దపరాజయం. చిత్రలేఖ......కుమారగిరి! ఇద్దరిలో ఎవరిదీ విజయంకాదు. ఇద్దరూ పరాజయులే. పరిస్థితులచక్రం అతివేగంగా తిరుగుచున్నది. ఈరెండు ప్రాణులు ఆవేగంలో పడి నలిగిపోతున్నవి.”

శ్వేతాంకుడు బీజగుప్తుని మాటలలోని అర్థమునింకనూ గ్రహించలేదు. ఇంతలోరథం బీజగుప్తుని ద్వారం చేరింది. ఇంకా నీతోకొన్ని విషయాలను చెప్పాలనే కోర్కెఉన్నది. నావెంటరా” అని శ్వేతాంకుని చేయిపట్టుకొని అన్నాడు బీజగుప్తుడు.

యజమాని—సేవకుడు! ఇద్దరూ అధ్యయన గృహములోని కరిగారు. శ్వేతాంకుని కూర్చోమని, బీజగుప్తుడు కూర్చుంటూ. ఇలా అన్నాడు. “శ్వేతాంక్! కుమారగిరికి

పరాజయం ఎందుకు కలిగిందో నీకు తెలుసా?"

"తెలియదు"

"అయితే దీని రహస్యం చెప్పుతున్నాను విను. చిత్రలేఖ నుగురించి నాకు తెలిసినంతగా నీకు తెలియదు. చిత్రలేఖవ్యక్తిత్వం చాలా ఉచ్ఛకోటికి చెందినది ప్రతిభావంతమైంది. ప్రతిభగలది. కుమారగిరి విద్వాంసుడు. యోగి. వాసనావృత్తికి పక్కా విరోధి చిత్రలేఖ విదుషియైయుండికూడా సాధనావృత్తికి విరోధి. ఇద్దరూకూడా అహంభావానికి దాసులే. ఇద్దరు మమత్వ తృప్తినే విశ్వాసిస్తారు. కాని ఇద్దరి మార్గంలోనూ బిన్నత యున్నది. ఒక సాధనను ఆధారంగా తీసుకొంటే ఇంకొకరు ఆత్మ విశ్వాసాన్ని. కాని నేడు జరిగిన సంఘటన వల్ల ఇద్దరూ తమకున్న శక్తిని కోల్పోతారు."

బీజగుప్తుని మాటలు శ్వేతాంకునకు అగమ్య గోచరముగా నున్నవి. "స్వామీ! మీఉద్దేశమును గ్రహించలేదు.

బీజగుప్తుని స్వరం క్షీణించింది. వీటిని ఇంకా స్పష్టీకరించే క్షమతశక్తి నాలోలేదు అలాచేయడం ఉచితంగాదనికూడా నాఅభిప్రాయము. దీనిని నీవు తెలుసు కోవాలంటే నేను చూపిన మార్గా ననుసరించు."

"అయ్యగారి ఆజ్ఞను శిరసావహిస్తాను."

"ఇప్పుడు నీవు చిత్రలేఖను విజయానందమును అందజేయడానికి వెళ్ళు. ఆమె ముఖాకృతిలోని బావములనుబట్టి తెలుసుకో."

వెంటనే శ్వేతాంకుడు చిత్రలేఖ భవనాన్ని చేరుకు న్నాడు. భవనంలో ప్రకాశం దేదీప్యమానంగా వెలుగొం దుతూంది. ఆమెకు అభివందన మాచరించ వచ్చిన సామం తులగుంపుద్వారాన్ని చుట్టు ముట్టియున్నది. దాసీలువారిఆదర సత్కారములు చేయుచున్నారు. చిత్రలేఖ మాత్రంలేదు. అదిగమనించి శ్వేతాంకుడు ,,అమ్మగారు ఎక్కడకు వెళ్లారు.? అని ఒక దాసీని అడిగాడు. దాసీ అతనిని ఒక అలంకృతమైన గదిలోనికి తీసుకువెళ్లి కూర్చుండ బెట్టినది. ,,అమ్మగారూ ఇంకా తిరిగిరాలేదు—బహుశా వస్తూఉండొచ్చు నని దాసి చెప్పింది. శ్వేతాంకుడు ఎదురుచూడ నారంభించాడు.

సామంత యువకు లందరూ చిత్రలేఖ రాకకై ఎదురు చూచి చూచి, ఆఖరుకు నిరాశతో ఒకొక్కరుగా వెళ్ళిపో యినారు. గంటలు గడచాయి. కాని చిత్రలేఖ రాలేదు. ఇప్పుడు చిత్రలేఖ ఎచ్చటి కేగియుండును? ఆశ్చర్యం! అను కొని దాసీతో ,,అమ్మగారు ఎప్పుడు తిరిగొస్తారో? నీకుతె లుసా?" అని శ్వేతాంకుడు ఒక దాసీని అడిగాడు. నాకు తెలియదని దాసీ జవాబు చెప్పింది.

శ్వేతాంకుడు కూడా ఎదురుచూచి చూచి విసుగు చెందాడు. దాదాపు అర్ధరాత్రి కావచ్చింది. చిత్రలేఖ జాడా మాత్రంలేదు. శ్వేతాంకుడు అనేకసార్లు తిరిగివెళ్ళి పోవాలనుకున్నాడు. కాని విషయం తెలుసుకుందామనే ఆసక్తి ఆపింది. ఇంతలో అర్ధరాత్రి గంట మ్రోగింది.

,,అమ్మగారు వచ్చిన తరువాత నేను అభివందనమాచ రించవచ్చి వెళ్ళానని చెప్పు" అన్నాడు శ్వేతాంకుడు దాసీతో

వెంటనే భవనం బైటకొచ్చాడు. ఇంతలో చిత్రలేఖ రథం వస్తూవుండడం కనుపించింది. శ్వేతాంకుడు ఆగిపోయినాడు.

శ్వేతాంకుడు, చిత్రలేఖను రథంనుండి క్రిందికి దింపాడు. ‹‹శ్వేతాంక్! అర్ధరాత్రివరకు నిద్రమేల్కొని ఉన్నావెందుకు? అని చిరునవ్వుతో చిత్రలేఖ ప్రశ్నించింది.

‹‹అమ్మగారికి అభివందన మాచరించ వచ్చాను›› అన్నాడు శ్వేతాంకుడు.

చిత్రలేఖను మెల్లగా శృంగారగృహానికి చేర్చాడు శ్వేతాంకుడు. ‹‹శ్వేతాంక్! నీవు హాలులో కూర్చొనిఉండు. నేనిప్పుడే దుస్తులను మార్చుకొని వస్తాను››

చిత్రలేఖ దుస్తులను మార్చుకొని హాలులోనికొచ్చింది. ఈసారి శ్వేతవర్ణ దుస్తులను ధరించింది. ‹‹శ్వేతాంక్! నీవు, నాకు అభివందనము లందజేయ వచ్చితివా? ఎందుకు?››

‹‹మీకు విజయం కలిగిందిగదా?››

‹‹నాకా విజయమా?›› క్షణంక్రిందట ఉల్లాసంతో మెరుస్తున్న ఆమెముఖం కొద్దిగా క్షీణించింది. యవనోత్సాహంలో దాగియున్న విషాదమును ప్రథమసారిగా శ్వేతాంకుడు చూచాడు——కాని, అందుగల భావమును గ్రహించలేదు, సుందరమైన ముఖంలోని పరివర్తనముగూడా అందముగానే ఉంటుంది. బహుశా ఆమె ముఖంమీద సహస్ర దివిటీలు వెలుతురుపడుటవల్ల గాబోలు విషాదం వ్యాపించిన చిత్రలేఖ ముఖం శ్వేతాంకునకు మనోహరం గానే యున్నది.

"నావిజయానికా? శ్వేతాంక్! ఇదినావిజయంకాదు వాస్తవం గా నాకిదొక పరాజయం"

బీజగుప్తుడన్న మాటలనే చిత్రలేఖగూడా అన్నది. అందులోనూ గంభీరంగా చెప్పబడినాయి. అందుకే శ్వేతాం కునకు ఆశ్చర్యం కలిగింది.

శ్వేతాంకుడు ఆశ్చర్య చకితుడైనాడని అతని ముఖా న్నిబట్టే గ్రహించింది. చిత్రలేఖ. "శ్వేతాంక్! నీకాశ్చర్యం కలుగ నవుసరములేదు. ఇప్పుడు నేనెక్కడకు వెళ్లానో నీకు తెలుసా?"

"ఈప్రశ్నను నేను వేయాలనుకున్నాను, కాని సాహ సం చాలలేదు.

"అయితే విను! ఇప్పుడు నేను కుమారగిరి కుటీరము నుండి వస్తున్నాను. ఆయనను వంచితుణ్ణి చేయడానికి గాని, లేక అవమానించడానికి గాని నాకెట్టి అధికారములేదు. నా అభిలాషగూడా అదిగాదు. నా క్షేత్రం వేరు విద్వాంసుల క్షేత్రంలో ప్రవేశించడంఅనుచితము నేనుచేసింది చాలాతప్పు అనుకొంటున్నాను. అందుకే క్షమాపణకోరడానికి వెళ్లాను"

శ్వేతాంకుడు ఉదాసీనుడైనాడు. చిత్రలేఖ ఈభావ పరివర్తనాన్ని గ్రహించలేదు శ్వేతాంకుడు. "ఉచితం అను కున్నదానిని చెప్పడంమనుష్యుని ధర్మం. ఇతరులను మోసగిం చి భ్రమలో ముంచేవాని వాస్తవికతనుగూర్చి గూడా ఆలో నించడంమానవునివిధి. కనీసకర్తవ్యం. అమ్మా! మీరుచేసింది. చాలా బాగుంది"

,,ఇందుకే నాకు విచారంగా ఉంది. నేను చేసింది ప్రపంచమంతా ఉచితమేనను కొంటున్నది. నేను మాత్రం అనుచితమను కొంటున్నాను. కుమారగిరి యోగి. ఆయనలో శక్తివున్నది. సత్యము—ఈశ్వరుడు—ఈ రెండూ ఆయన కాల్పనిక వస్తువులు మానవులలో ఇంత ఉత్కృష్ట కల్పన వుండుటగూడా అసంభవమే. ఆయనలో ఈ కల్పనాధార ఎక్కడిదా? అనేదే ప్రశ్న. కుమారగిరిలో సృజనాశక్తి ఉన్నది. నేను చేసింది వినాశనమునకు దారితీస్తుంది. దేనినైనా ఒకదానిని కత్తిరించడముకంటే అతుకు పెట్టుటలోనే గొప్పతన మున్నది. చెడగొట్టడంలో మహత్తు లేదు. తయారు చేయడంలోనే మహత్తు ఉన్నది.”

,,కాపుర ముండేవారికి హాని కలుగజేసే ఇంటిని ఎవరైనా కడుతుంటే, దానిని నాశనం చేయడం ధర్మం కాదా?”

చిత్రలేఖ నవ్వింది. ,,తర్కంతో ప్రయోజనం లేదు. నేను చేసింది పొరబాటని అనుభవం ద్వారా గ్రహించాను. చేసిందేదో చేశాను. దాని ప్రతిఫలాన్ని అనుభవించాల్సి వుంటుంది!”

,,ప్రతి ఫలమా?” శ్వేతాంకునకు ఇదొక క్రొత్తవిషయంగా కనుపించింది. ,,ఆ ప్రతిఫల మేమిటమ్మా?”

,,నీవు అతిత్వరలోనే తెలుసు కుంటావు” చిత్రలేఖ దాసీని పిలచింది.

,,ఇప్పటివరకు నేను భోజనం చెయ్యలేదు. శ్వేతాంక్ బహుశా నీవుకూడా చేసియుండవు.”

ఇద్దరికి భోజనమును తెమ్మని దాసీకి ఆజ్ఞాపించినది చిత్రలేఖ. దాసీ వెళ్ళింది. చిత్రలేఖ మధుపానపు కూజాను తెరచింది. ఆమె స్వయంగా త్రాగి, శ్వేతాంకునకుగూడా ఇచ్చింది. అప్పటికే మధుపానమును సేవించడం పూర్తిగా అభ్యసించాడు శ్వేతాంకుడు. పాత్రను గుటకలో ఖాళీ చేశాడు. "శ్వేతాంక్" నీవు నాకు స్నేహితుడవు. స్నేహితుని ఎదుట ఏరహస్యాన్నీ దాచగూడదు"

చిత్రలేఖయొక్క ఈ మాటకు శ్వేతాంకుడు నీరైపోయినాడు. వాస్తవంగా ఆమెను యజమానురాలుగానే భావించు తున్నాడు. కాని ఇతనియెడ చిత్రలేఖ ప్రవర్తన మమతా పూర్ణముగానున్నది. "అమ్మా! నేను ఏఅంశము లోనూ సహానుభూతి రహితుణ్ణిగానని బాసచేస్తున్నాను.

"శ్వేతాంక్! నారహస్యాన్ని ఏరకంగానూ బైలు పర్చవుగదా? అని చేయిపట్టుకొని అడిగింది చిత్రలేఖ.

"నేను ఒట్టుపెట్టుకొని ప్రతిజ్ఞ చేస్తున్నాను"

"నాకు సహాయం చేస్తావా?"

"గట్టిగా ప్రతిజ్ఞ చేస్తున్నాను"

చిత్రలేఖ శ్వేతాంకునిచేయి విడిచింది "విను! నేటి విజయం వాస్తవంగా నావిజయంగాదు. నాకిదొక పెద్ద పరాజయం. కుమారగిరి నాజీవితాన్ని కొంచెము చెడుగా ప్రేరేపించాడు."

శ్వేతాంకునకు బీజగుప్తుడు చెప్పిన అంశములోని భయంకర సత్యం కొంతెను స్ఫురించింది. తన సందేహ నివృత్తికోసం "ఏరకంగా?" అని ప్రశ్నించాడు.

"ఏరకంగానా? ఈ మాత్రంగూడా తెలుసుకోలేదా? విను నేను కుమారగిరిని ప్రేమిస్తున్నాను. నాకు — కుమార గిరికి యుగయుగాంతరంల సంబంధమున్నదా అనిపించుచున్నది. అఖండ భారత వర్షంలోని సమస్త విద్వత్ జనములను పరా జితుల గావించినాడు యోగి. నేటి సభలోని ప్రతి వ్యక్తి అతని ప్రభావానికి ముగ్ధులైనారు— కాని నేను కాలేదు. కారణ మేమంటావు? కుమారగిరిని నేను బాగా ఎరుగుదును. నేను కుమారగిరికి పరిచితురాలను. మేమిద్దరము జన్మ—జన్మాంతము వరకు కలసిమెలసి వుంటాము."

శ్వేతాంకునకు పునఃజన్మముమీద మిక్కిలి నమ్మక ముండుటచే, చిత్రలేఖ మాటలకు మారుపలుక లేక పోయి నాడు. నిజమే ననుకున్నాడు.

"కుమారగిరిని నేను చూచిన రోజుననే అతని వైపుకు ఆకర్షింప బడ్డాను. అతని ఆత్మను బాగా గుర్తించిన వ్యక్తే అతనిని చేరగలదు. అతని ఆత్మను నేను బాగా గుర్తించాను. 'శ్వేతాంక్! కుమారగిరి నాజీవిత రంగములో ప్రధాన అభి నేతుడు"

"తెలుసుకొన్నాను దేవీ! కాని నేనెలా సహాయపడ గలను?"

దాసీ రెండు పళ్ళెరములలో భోజనం ఒడ్డించుకొని తెచ్చింది. చిత్రలేఖ శ్వేతాంకుని భోజనం చెయ్యమని తానూ భోజనం చేయసాగింది.

భోజనానంతరము చిత్రలేఖ అన్నది— "నేనెలా సహాయ పడగలనని అడిగావు— నీవు చెయ్యాదగింది ఒక్కటే. చెప్పుతున్నాను విను. ఈ రహస్యాన్ని బీజగుప్తుని కప్పుడే తెలియ పర్చవద్దు. ఆయనకు నా మీద అవిశ్వాసం కలుగు తుంది— సాధ్యమైనంతవరకు బీజగుప్తుని అవిశ్వాసాన్ని దూరం చేయి"

శ్వేతాంకుడు ఆలోచనలో పడ్డాడు. చిత్రలేఖ చెప్పింది ఆచరించడం చాలా కష్టం. బీజగుప్తుడు యజమాని. యజ మానియెడ విశ్వాసఘాతకం జరుపుట... మోసగించుట—?... చిత్రలేఖగూడా యజమానురాలే— పైగా...

శ్వేతాంకుడు సందిగ్ధావస్థలో మునిగాడని చిత్రలేఖ గ్రహించింది. ఆమె మధుపాన పాత్రను శ్వేతాంకుని నోటి కందించింది. ఒక చిరునవ్వు నవ్వింది. శ్వేతాంకుడు పాత్రను ఖాళీ చేశాడు. "చెప్పు నా ప్రార్థనను అంగీకరించుతావు గదూ?"

శ్వేతాంకుడు అవునని గానీ, కాదని గానీ చెప్పక మౌనం వహించాడు.

చిత్రలేఖ చిరునవ్వు అంతరించింది. క్రోధం అంకురించింది. ఆమె కోమలకరము సైయితం ఆవేశంతో వణకసాగింది. శ్వేతాంకుని చేయిగట్టిగా పట్టుకొంది. "శ్వేతాంక్! ఇది నా ఆజ్ఞ. చెప్పింది చేయువలసి యుంటుంది."

శ్వేతాంకుడు క్రోధానికి శిరమొంచాడు. మెల్లగా అన్నాడు "ఆజ్ఞ అంగీకారమే."

"నీవు ప్రతిజ్ఞ చేయాలి" చిత్రలేఖ కొంచెమాగింది.

"వలకు ప్రతిజ్ఞ చేయువలస్ని అవుసరము లేదు. నీవు ఇంతకుముందే మాట ఇచ్చావు. నీమాటను నీవు దక్కించుకో గలవని నాకు గట్టినమ్మకమున్నది" అంటూ చిత్రలేఖ మధుపానపు పాత్రను నోటికందించింది.

శ్వేతాంకుని నైనాలు మూసుకపోయినవి. అతనొక అపూర్వ సుఖాన్ననుభవించాడు. మధుపానం పూర్తిగా సేవించి శ్వేతాంక్ ఇలా అన్నాడు. "దేవీ! నేనెప్పుడూ మీ సేవయే చేశాను. నా జీవితానికి మీ జీవితానికి ఘనిష్ట సంబంధమున్నది. మీరు నాకు యజమానులు. నేను మీసేవకుడను. మీ ప్రతివాక్యం నాకు వేదవాక్యంతో సమానమని విశ్వసించండి. ఇంక మాట ఇచ్చానన్న విషయమును గురించి, నేను నీమడను గానని మాత్రం చెప్పగలను."

శ్వేతాంకుడు లేచి నిలబడినాడు. "నేను శ్వేతాంకుని పంపించవలస్ని అవుసరమున్నదేమో?"

"పలకు" శ్వేతాంకుడు స్ప్రుహాలోనే యున్నాడు. అతని విసాలో ఒకవిధమైన తేజస్సుంది. "నేను ఇప్పుడు ఆత్మ విస్మృతిలో లేను" అని శ్వేతాంకుడు అచ్చటనుండి వెళ్ళి పోయాడు.

శ్వేతాంకుడు బీజగుప్తుని భవనానికి మరలివచ్చాడు. అధ్యయనగృహములోని వెలుతురను చూచాడు. అయ్యగారు మీకోసం ఎదురు చూస్తున్నారు అన్నది శ్వేతాంకునితో దాసి.

శ్వేతాంకుడు అధ్యయన గృహంలోనికి ప్రవేశించాడు. బీజగుప్తుడు కూర్చొని ఏదో ఆలోచిస్తున్నాడు. శ్వేతాంకుడు ఇంతవరకూ బీజగుప్తునిలో విచారభావమును చూచి ఎరుగడు. బీజగుప్తుని ఎదుట ఖాళీ మధుపాన పాత్రయున్నది చింతా సాగరంలో అలలు లేస్తున్నాయి. సుఖదాయకమైన ఉద్యాన వనంలో భయంకర పెనుగాలి వీచుచున్నది సుఖసామ్రా జ్యంలో దుఃఖమనే విప్లవం చెలరేగింది. శ్వేతాంకుని చూచి బీజగుప్తుడు గాఢనిద్రనుండి మేల్కొన్నవానిలాగా త్రుళ్ళిపడి నాడు. "నీవొచ్చావా? కాని చాలా ఆలస్యం జరిగింది."

శ్వేతాంకుడు కూర్చున్నాడు. సీతలజలంతో నింపి యున్న గ్లాసును ఖాళీ చేసాడు.

బీజగుప్తుడు జవాబుకోసం కొంతసమయంచూచి తిరిగి ప్రశ్నించాడు. "శ్వేతాంక్! నా ప్రశ్నకు జవాబివ్వలేదే?"

"అవును! స్వామి! అమ్మగారికోసం ఎదురుచూడడం చేత ఆలస్యం జరిగింది."

"చిత్రలేఖకోసం ఎదురుచూడడమా? నీవు వెళ్లునప్పటికి చిత్రలేఖ అచ్చట లేదా?"

శ్వేతాంకుడు కొంచెము తటపటాయించాడు. చేసిన ప్రతిజ్ఞ స్మరణకు వచ్చింది. "అవును చిత్రలేఖ ఆమె భవనంలో లేదు."

బీజగుప్తుడు శ్వేతాంకుని సందేహభావమును గ్రహించాడు. "ఆమె ఎచ్చటకేగిందో బహుశా నీకు చెప్పిఉంటుంది!"

శ్వేతాంకుని హృదయంలో వాదవివాదం చెలరేగింది. కాని ఏదో ఒకనిర్ణయానికి రావడానికి తగిన వ్యవధిలేదు. వెంటనే ఆలోచించకుండా జవాబిచ్చాడు. "అమ్మగారు ఏమీ చెప్పలేదు. కాని మంత్రి చాణక్యుని ఆహ్వానంమీద వెళ్ళి ఉంటారు"

బీజగుప్తుని హృదయభారం కొంచెము తగ్గింది. అతని హృదయంలో కుమారగిరివద్దకు వెళ్ళిందనే భావం ఎలా ఉత్పన్నమైనదో ఎవరికి తెలుసు? శ్వేతాంకుని మాటలవలన ఆ భయం కొంచెం తగ్గింది. "ఆమెను అభివందనమందజేశావా?" అన్నాడు.

"ఆ! వారు నాతో తాను అభివందనమునకు పాత్రురాలను గానని చెప్పారు. వారికి విజయగర్వం లేనేలేదు. పైగా విజయంవల్ల వారు చాలా బాధపడుతున్నారు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది."

బీజగుప్తుడొక చిరునవ్వు నవ్వాడు. ఆనవ్వులో కరుణా సాగరం దాగియున్నది. "నేను నీతో ఏమిచెప్పాను. ఆమె తన విజయాన్ని అంగీకరించకపోవుటే నేను చెప్పిందానికి ప్రబల నిదర్శనం."

"అయ్యగారి మాటలలోని అర్థాన్ని ఇప్పుడిప్పుడే కొంచెము కొంచెముగా అర్థంచేసుకొంటున్నాను."

"కొంచెముగా తెలుసుకోబడమనడంలో అసలు అర్థం లేదు. తెలుసుకొంటే సాంతముగా తెలుసుకొని ఉండాలి. లేదా ఏమీ తెలియకపోవాలి." బీజగుప్తుడు లేచి నిలబడి "శ్వేతాంక్! ఎల్లప్పుడూ జ్ఞాపకముంచుకోదగ్గ విషయం చెప్తుతున్నా విను. మనుష్యుడు సర్వస్వాతంత్ర్యుడై యుండిగూడా పరిస్థితులకు దాసుడు. ఆ పరిస్థితుల చక్రమే, మనవాళ్ళు చెప్పే పూర్వజన్మ సుకృతఫలం. పరిస్థితుల చక్రంలో పడి నలిగిపోకుండా కర్తవ్యాకర్తవ్యమును దృష్టిలో ఉంచుకొని సంచరించినవాడే పరిస్థితులను జయించగలడు. అట్టి మనుష్యుడు విజయుడు. చిత్రలేఖ పరిస్థితుల చక్రంలో పడింది. కుమారగిరి ఆమెజీవితంలో ప్రవేశించడం, ఆమె వినాశమునకు కారణం. కుమారగిరి జీవితంలో చిత్రలేఖ ప్రవేశంగూడా అంతే. దుర్భాగ్యవశాత్తు ఇద్దరికీ తెలియకుండానే ఒకరి జీవితంలోనికి ఒకరి ప్రవేశం జరిగింది. సాధనాభ్రష్టతకు మూలం అయ్యింది. భగవంతుడే వారికి సహాయపడగలడు."—

# 8

శాంతియుతమైన మహాసాగరంలో భయంకరమైన తుఫాన్ లేచేముందు ఘోరమైన నిస్తబ్ధత వ్యాపిస్తుంది. ఆసమయంలో వాయుమండలము ఉత్తేజితమౌతుంది. వాతావరణమంతా భవిష్యత్‌లో మహావిప్లవం పుడుతుందనే సందేహంతో సూన్యమైపోతుంది—

ఆ తరువాత— ప్రచండమైన సుడిగాలులు— అలల యొక్క భయంకర ఝంకారము— విప్లవగానము—

నిర్మలమైన ఆకాశంలో అగ్నిజ్వాల లేచేముందు గొప్ప అశాంతి వ్యాపిస్తుంది. దానిస్వచ్ఛందమైన నీలిరంగుకాంతి విహీనత చెందుతుంది. వినాశనము కలుగుతుందనే భయంతో, ఆకాశమండలమంతా వాయురహితమైపోతుంది.

ఆ తరువాత— అగ్నిజ్వాల— వినాశనము—

అది సాయంసమయం. చిత్రలేఖ రథం బీజగుప్తుని ద్వారంవద్ద ఆగింది. మధ్యాహ్నపు సూర్యకిరణాల తీవ్రం తగ్గిన తరువాత, పాటలీపుత్రపు బజారులవెంట సామంతుల రథాలు వరుసగా బైలుదేరినవి. మాలినీయువతులు పూలహారములను సామంతులకు ధరింపజేస్తున్నారు. సుగంధ భరితమైన చల్లని షరబత్తుపాత్రలు, ధనవంతులైన యువతీయువకుల అధరములతో ముద్దాడుచున్నవి. నాల్గువైపుల ఉల్లాసం- విలాసం- తాండవ మాడుతున్నాయి.

రాజమార్గం ఆసమయమున ఒక పెద్ద ఉత్సవానికి కేంద్రమైయున్నట్లు కనుపించుచున్నది. రత్నాల దుకాణము లలో యువతులు, కావలసిన మణిహారములను తీసుకొని అలంకరించుకొనుచున్నారు, యువకులు కిళ్లీదుకాణములలో గుమిగూడుచున్నారు. ఆజనరవములో బీజగుప్తుడు గూడా ఒక భాగమే.

శ్వేతాంకుడు అప్పుడెచ్చటకో వెళ్ళే హడవిడిలో నున్నాడు. అతనిరథం బైట సిద్ధముకానున్నది. పరిచారకులు అతనికివస్త్రులు ధరింపజేస్తున్నారు. ఇంతలో కాపలావాడువచ్చి "బాబూ! అమ్మగారి రథం ద్వారంవద్దనున్నది అయ్యగారికై ఎదురుచూస్తున్నారు" అన్నాడు.

శ్వేతాంకుడు తుళ్లిపడినాడు. అప్పుడు బీజగుప్తుడు లేక పోవడం అతనికి చాలాబాధను కలిగించింది. ఎన్నడూ అను కోనటువంటి పాపాన్ని చేయవలసి వస్తుంది. అయినప్పటికి వెంటనే "ఇప్పుడేవస్తున్నా" అన్నాడు.

శ్వేతాంకు బైటకువచ్చాడు అప్పుడు ఆమె చాలా మనోహరంగా నున్నది. శ్వేతాంకుడు ఆమెరథం వద్దకేగి "ఏమి ఆజ్ఞ దేవీ?" అన్నాడు.

చిత్రలేఖ సహజంగానే నవ్వింది. "బీజగుప్తులను కలుసు కోవాలి. బహుశా వారిప్పుడు లేరనుకుంటాను?"

శ్వేతాంకుడు గూడా నవ్వుతూ జవాబిచ్చాడు. "అవును"

"నీతోగూడా కలుసుకుందామనుకుంటున్నాను"



"దేవిగారు ఈ దాసునియెడ చాలా అనుగ్రహం చూపుతున్నారు. దేవిగారిసేవకై నేనుఎల్లప్పుడూ సంసిద్ధమే"

"ఆ అవుసరమేమీలేదు. నేడు మనస్సు చికాకులో చిక్కుకొన్నది. జనరవంలోనే చిత్తశాంతి జరుపుకుందామనే ఉద్దేశ్యంతో షైరుకు బైలుదేరాను. బీజగుప్తుడు లేనందువల్ల నష్టమేమీలేదు నీవున్నావుగా?"

"మంచిది!" అని శ్వేతాంకుడు తన రథం వైపుకు పోసాగాడు. చిత్రలేఖ శ్వేతాంకుని చేయిపట్టుకొని ఆపింది. "వద్దు! నీవు గూడానారథంమీదనే రావాలి"

మంత్రముగ్ధునివలె శ్వేతాంకుడు ఆమె రథంమీద కూర్చున్నాడు. రథం రాజమార్గము ననుసరించినది. రాజమార్గము చేరుటతోనే కళ్లెం చిత్రలేఖ తీసుకొన్నది. పాటలీపుత్రములోని పెద్దపెద్ద సామంతులను సహితం నాట్యమాడించగల అందకత్తెచేతిలో కళ్లెముందని అశ్వాలుగూడా గ్రహించాయి గాబోలు. అవి సగర్వంగా తలలెత్తి, ఠీవిగా రాజమార్గంలో ప్రవేశించాయి. చిత్రలేఖ రథాన్ని చూచి పెద్దపెద్ద సామంతులరథాలు ఆగిపోతున్నాయి. ఆమెను అందరూ అభివందనములను అందించి, కీర్తించుచున్నారు. శ్వేతాంకుడు ఆమె సరసను కూర్చొనడంచూచి కొందరు ఏవగించుకొనుచున్నారు. అచ్చటచ్చట ఏహ్యపు మాటలు గూడా వినుపించుచున్నవి. కాని చిత్రలేఖ వాటిని లెఖచేయక నవ్వుతూనే ఉన్నది.

ఆసమయమునందు చిత్రలేఖమెడ పూలహారములతో బరువెక్కింది. సామంత యువకులు ఆమె మీద పూలహారముల వర్షం కురిపిస్తున్నారు. రథారూఢమైయున్న చిత్రలేఖ సాక్షాత్ పార్వతిలా కనుపించుచున్నది. ప్రజలంతా ఆమెను సన్మానిస్తున్నారు, పూజిస్తున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆ విశాలమైన రాజమార్గంలోని సమూహమంతా ఆమెను సుస్వాగత మిస్తున్నది.

రెండవ వైపునుండి ఒక రథం వచ్చి చిత్రలేఖ రథం వద్ద ఆగింది. చిత్రలేఖ ఒక నవయువకునితో సంభాషించుచున్నదే. రథం నిలబడేయున్నది. రెండవ రథం ఆగడంతోనే ఆమె ధ్యానమునకు భంగముకలిగింది. పార్శ్వమున బీజగుప్తుడు నవ్వుతున్నాడు.

"నేడు రాజమార్గంలో చిత్రలేఖనుచూస్తే ఆశ్చర్యం కలుగుతుంది"

"నేడు బీజగుప్తులు భవనంలో లేకపోవుడంగూడా ఆశ్చర్యమును కలుగజేస్తుంది."

ఉత్తర— ప్రత్యుత్తరము— ఇద్దరికి తెలిసిన ఒక గూఢరహస్యం అందులో ఇమిడి యున్నది. శ్వేతాంకుడు రథమునుండి క్రిందికి దిగాడు. చిత్రలేఖను బీజగుప్తుడు ఆహ్వానిస్తూ "ఈ ఆహ్వానం బహుశా స్వీకృతే కావచ్చు" అన్నాడు.

చిత్రలేఖను బీజగుప్తుని ఆహ్వానం ఆనందయుతమైన స్వీకారమే" అని జవాబిచ్చింది చిత్రలేఖ.

అప్పటికి సంధ్యా సమయమైనది. రాజ మార్గంలో దీపాలు వెలుగ నారంభించాయి బీజగుప్తుడు తన రథాన్నుండి దిగి, చిత్రలేఖ రథం మీదకొచ్చాడు. గుర్రాల కళ్లాన్ని సొంతముగా చేతపట్టాడు, బీజగుప్తుని రథాన్ని శ్వేతాంగుడు నడుపుతున్నాడు.

రెండురథాలు బీజగుప్తుని భవనం వైపుకు మరలించబడి నాయి. "నీవు నాభవనానికి వచ్చినప్పుడు నేను లేనందుకు చింతిస్తున్నాను" అన్నాడు బీజగుప్తుడు

"చింతించవలసిన పనిలేదు. మీరు లేనిసమయంలో వచ్చాను. తప్పునాది, ఈమధ్య నేను భవనానికి రావడంలేదు కనుక మీరుండకపోవుటగూడా సహజమే" అని చిరునవ్వు నవ్వింది చిత్రలేఖ.

కొంచెము దూరం వెళ్లిందాకా ఇద్దరూ మౌనంగానే యున్నారు. తిరిగి బీజగుప్తుడే సంభాషణను ప్రారంభించాడు. "చిత్రలేఖా!" కొన్ని రోజులనుండి నామనస్సు చికాకుగా ఉంటున్నది. ఎందుకో? నాకే తెలియదు. ఒక్క మాట అడుగు తున్నాను— కొన్నిరోజులనుండి నీవు నాభవనానికి రాని కారణమేమి?

చిత్రలేఖ ముఖాన్ని పైకెత్తింది. "కారణమడుగు తున్నావా? రావాలనే కోర్కెలేదు— అందువల్ల రాలేక పోయ్యాను."

ఇలాంటి జవాబిస్తుందనే నమ్మకంగాని, ఆశగాని బీజ గుప్తునకులేదు. చిత్రలేఖ ఏదోఒకకారణమును కల్పించు తుందను కొన్నాడు. ఇంత స్పష్టంగా చెప్పడంచూచి ఆశ్చర్య

చకితుడైనాడు కొంచెము క్రోధంగూడా కలిగింది. "రావాలనే కోర్కెలేదా! కారణం తెలుసుకొనే అధికారం నాకున్నదా?

చిత్రలేఖ బీజగుప్తుని ముఖంచూచింది. ఆ ముఖంలో

దృఢతగాంభీరం, క్రోధం, అధికారగురుత్వం ఇవ్వన్నీ ఆవరించాయి. చిత్రలేఖకుగూడా కొంచెము క్రోధంకలిగింది. కాని తన భావాలను అణచుకొని ఇలా అన్నది-" అధికారమున్నది! ఇంతమాత్రం తెలియదనుకున్నారా? మనుష్యుని మీద మనుష్యునకు ఎలాంటి అధికారంవుంటుందో ఇంతవరకూ నాకు తెలియదు. మీరు కారణం అడుగుతున్నారు కాబట్టి వినండి. ప్రస్తుతము ఒక అంశమును గురించి నామనస్సు ఉద్విగ్నత చెందుతుంది. అందువల్ల నేను నన్నూ నావాళ్ళను గూడా మరిచాను»

ఇంతలో రథం బీజగుప్తుని భవనంవద్ద ఆగింది శ్వేతాంకుడు ముందుగా తన రథంనుండి దిగివచ్చి ఇద్దర్నీ క్రిందికి దించాడు. ఇద్దరూ బీజగుప్తుని కేళీమందిరానికి వెళ్లారు. తరువాత శ్వేతాంకుడు అచ్చటినుండి వెళ్ళబోయినాడు. శ్వేతాంకుడు వెళ్ళబోవటం చూచి «శ్వేతాంక్! నీవు వెళ్ళవలసినపనిలేదు". అన్నాడు బీజగుప్తుడు.

«ఇప్పుడు శ్వేతాంకుని అవుసరంలేదు» అన్నది బీజగుప్తునితో చిత్రలేఖ.

«ఉండుటవలన అపకారమూలేదు. పైగా ఇందులో శ్వేతాంకునికి లాభంకూడా ఉన్నది. ఈ అనుభవ హీన వ్యక్తికి కొంచెము అనుభవము కలుగుతుంది అని బీజగుప్తుడు

నవ్వాడు. శ్వేతాంకుడు ఆగిపోయాడు మధుపానం తెమ్మని సంజ్ఞచేశాడు బీజగుప్తుడు.

ఆపనిలో శ్వేతాంకుడు నిపుణత సంపాదించాడు.మధు పానపాత్రను బీజగుప్తునకిచ్చాడు. చిత్రలేఖకుకూడా ఇచ్చాడు తానుగూడా కొంచెము సేవించాడు. కొంచెము దూరంలో శ్వేతాంకుడు కూర్చున్నాడు.

బీజగుప్తుడు సంభాషణను ప్రారంభించాడు ,,ఇప్పుడే ఏదో ఉద్విగ్నతలో మునిగి స్వయంగా మరచుటయే గాక నాశాళ్ళనుకూడా మరచానన్నావు ఇంత విస్మృతికలుగచేసిన ఆ ఉద్విగ్నతగూడా చాలా విచిత్రంగానే ఉండొచ్చు"!

,,చిత్రలేఖ మనః ప్రవృత్తిని విశేషంగా తెలుసుకోవ డానికి బీజగుప్తులు బలవంతపెట్టుచున్నారను కోవంసిందేనా?"

,,బలవంత పెట్టుటలేదు. నాకుగూడా తెలియచేయ మని ప్రార్థించుచున్నాను."

,,అయితే ఈఉద్విగ్నత అసాధరణమైనదని, కారణం గూడా పెద్దగా ఎన్నతగినదికాదని మీకు తెలుసు. ఇంతకంటే అధికంగా చెప్పసమర్థత నాలోలేదు"

బీజగుప్తుడు శ్వేతాంకునివంకచూచాడు. శ్వేతాంకుడు మౌనంగా సంభాషణను వింటున్నాడు.,,చిత్రలేఖలో అసమ ర్థత!" బీజగుప్తుడు మెల్లగా అన్నాడు. ,,ఇద్దరిపరిచయం కలి గినప్పటినుండి నేటికి చిత్రలేఖను బీజగుప్తునియెదుట తనమా టలను దాచె అవుసరం వచ్చింది. చిత్రలేఖహృదయం మారి పోయింది. యిందుకు బీజగుప్తుడు చాలా విచారిస్తున్నాడు"

మధుపాన మహిమ అందుగల ముప్పా ర ను చుట్టు ముట్టింది. ఇంకోలోటా నోటికందిస్తూ చిత్రలేఖ యిలాఅన్న ది. ‘‘ఈపరివర్తన మయప్రపంచములో ప్రతివస్తువు మారుతూ ఉంటుంది. అది అస్వాభావికం గాదు’’

బీజగుప్తుడు నిస్తేజుడైనాడు. ఈజవాబు వస్తుందని అతను ఆశించలేదు. ‘‘ఏమన్నావు? ఈపరివర్తనమయ ప్రపం చములో ప్రతివస్తువు మారుతూ ఉంటుంది! అది అస్వాభావికం గాదు? అయితే చిత్రలేఖ ప్రేమకూడా మార్పగలదను కోవా చ్చునా?’’

చిత్రలేఖ తానన్నమాటలకు తాను పశ్చాత్తాపము చెందినది. ఏదో ఆవేశంలో అనేచింది దూరం ఆలోచించ లేదు. ఈమాటలకు ఇంతగంభీరమైన ప్రశ్నవస్తుందనుకో లేదు. అయినా సాహసించింది. ‘‘కాదు. బీజగుప్తుని అను కోవడంలో అర్థంలేదు. అధ్గాంలేదు. చిత్రలేఖ ప్రేమ మహాసాగరంలాగా గంభీరమైనది. విశాలమైనది అది మార ట౦ అసాధ్యం అయినా ప్రేమకూడా పరివర్తనమైనదే అను కొంటున్నాను. ప్రకృతి నియమము పరివర్తనము. ప్రేమ కూడా ప్రకృతిలోని భాగమే కనుక ప్రకృతినియమము పరి వర్తనము. ప్రేమ కూడా ప్రకృతిలోని భాగమే. కనుక ప్ర కృతి నియమము ప్రేమకుగూడా చెందుతుంది’’

విషయం ఎంత కఠోరంగా నున్నప్పటికీ చిత్రలేఖ చెప్పిందాంట్లో యదార్థం లేకపోలేదు——దీనినిగురించి బీజ గుప్తునకు సంపూర్ణ సానుభవం కలిగించి. విషయం యదార్థ మే చెప్పకొందగింది. ప్రసంగముగూడా సమయోచితముగానే

యున్నది. ఒకరినుండి మరియొకరు వేరుపడుతున్నారని బీజ గుప్తుడు గ్రహించాడు. ఒక అజ్ఞాతశక్తి లేదా ఒక ప్రేరణ ఈ రెండు ప్రాణులమధ్యకు చేరింది!

చిత్రలేఖా! నీవు పొరబడుతున్నావు.ఆత్మకు సంబంధించినది ప్రేమ.ప్రకృతికి సంబంధించినదిగాదు. ప్రకృతిలో సంబంధమున్నటువంటిది. వాసన మోహము అది బ్యాహ్యానికి సంబంధించినది. ప్రకృతిదయవల్ల అతిసుందరముగా తయారైన శరీరాన్ని చేరడమే మోహముయొక్క-లక్ష్యం, ప్రేమశరీరానికి సంబంధించినదిగాదు. ఆత్మికమైనది. పరివర్తన చెందడం ప్రకృతినియమము. ఆత్మనియమము అలాంటిదికాదు. ఆత్మసంబంధం అమరత్వం కలిగియుంటుంది."

చిత్రలేఖ నవ్వింది. ఆత్మసంబంధము అమరత్వం కలిగి ఉంటుందా? విచిత్ర విషయం చెప్పుచున్నారు బీజగుప్తు! జన్మించడం చావడంతప్పదు అమరుడననే వారెవరైనాఉంటే వారికి జన్మలేదన్నమాటే. సృష్టిఉన్నచోట ప్రళయం తప్పక పుడుతుంది. ఆత్మకుజన్మలేదు. అందువల్ల అది అమరత్వం కలిగినటువంటిది. కానిప్రేమకు జన్మఉన్నది. ప్రేమపుట్టి నప్పుడే ఏదో ఒకవ్యక్తిని ప్రేమించడం జరుగుతుంది. సంబంధము కలుగుటయేపుట్టుట.ఆసంబంధము అనంతమైనది గాదు. ఎప్పుడో ఒకప్పుడు అది అంతమౌతుంది.మోహం క్షణభంగురమైన పిచ్చితనం, ఆపిచ్చిపోయినప్పుడు మోహం దూరమైపోతుంది. ప్రేమగంభీరమైనది. దాని అస్తిత్వం శీఘ్రంగా నాశనమయ్యేదిగాదు. ప్రేమ—మోహమునకు ఉన్న భేదం

కేవలంఇంతే. బీజగుప్తా! ఆత్మసంబంధము అనాదియుతమైన దిగాదు"

చిత్రలేఖతర్కం మితిమీరి పోతునట్టు భావించాడు బీజగుప్తుడు "నీవు చెప్పింది నిజంకావచ్చు నేను అందుకు వ్యతిరేకించడంలేదు అది నావిశ్వాసం మాత్రమే అయినా ఇంకా కొంచెము చెప్పడం అనుచితం కాదనుకొంటున్నాను. ఉన్మాదంలోనూ—జ్ఞానంలోనూ వున్న బేధమే ప్రేమ—మోహంలోనూ ఉన్నది. అది స్థిరమైనది జ్ఞానం. కొంతకాలంపాటు జ్ఞానం లోపించవచ్చు. కాని పూర్తిగా అంతరించదు. పిచ్చితనం అంకురించి నప్పుడు జ్ఞానం లోపించినట్లు కనుపించును. పిచ్చితనం దూరంకావడంతోనే జ్ఞానం స్పష్టపడుతుంది. జ్ఞానానికిఅమరత్వం లేకపోతే ప్రేమకుగూడాలేదు. నాఉద్దేశ్యములో జ్ఞానము అమరమైది. ఈశ్వరుని ఒక అంశము—ప్రేమ గూడాఅంతే"

చిత్రలేఖ అప్పుడు పడుకొని యున్నది. ఆమె అర్ధనిమీలితనేత్రాలలో, ఆ అందమైన ముఖంలోనూ, ఉన్మాదంపుంపారుగా కేరింతలు కొడుతుంది. ఆమెలేచి కూర్చొని ఇలాఅన్నది "బీజగుప్తా! నిజం చెప్పుచున్నారు. నేను భ్రమ చెందాను. భ్రమ అనేనరదా నన్నుచుట్టటంచేత నన్ను నేనుమరచాను-క్షమించండి" బీజగుప్తుని మెడమీద రెండుచేతులను వేసింది, చిత్రలేఖ,

ఈదృశ్యాన్నిగూడా చూచాడు శ్వేతాంకుడు. లేచి నిలబడ్డాడు. "శ్వేతాంక్! నీవువెళ్ళవచ్చు రథాన్నిప్పుడు సిద్ధం చేయవలదు. అన్నాడు బీజగుప్తుడు—

# 9

ఆర్య శ్రేష్ఠులైనా మృత్యుంజయుగారు క్షత్రియులై జన్మించినప్పటికీ ఆచరణలో బ్రాహ్మణులు. పాటలీపుత్రపు ఈవయోవృద్ధ సామంతుని భవనంలో, భోగ—విలాసములకు బదులు త్యాగము—వైరాగ్యములు విలసిల్లుతున్నాయి ప్రజలు ఈయనను జనక మహారాజుతో సరిపోల్చుతూ వుంటారు. ఈపోలిక ఈయనకు యోగ్యమైనదే పట్టణమంతా ఈయనపేరు ప్రతిష్టలు వ్యాపించి యున్నాయి. ఈయనతో సమానమైన సజ్జనులు బహుకొద్దిమంది మాత్రమే ఉండీ ఉంటారు. మృత్యుంజయుని క్షేత్రం భోగ విలాసములకు చాలా దూరము. ఈయనక్షేత్రం ఉపాసనా—ధ్యాన మగ్నత—నిరంతర ఏకాంతసేవ.

ఈ ఏకాంత వాసియైన క్షత్రియునివద్ద ధన ధాన్యాలు తుల తూగుతున్నాయి. ప్రముఖ సామంతులలో ఈయనొకరు. రాజసభలో ఈయన సింహాసనం ఉచ్చస్థానమునకు చెందినది. ఈయనయెడ ప్రజలు వినయ విధేయతలు చూపుతారు. మృత్యుంజయుని సాధన విశాలమైనది. ఆత్మికబల సంపన్నుడు. ఆయనలో ఆధ్యాత్మికజ్యోతి విరాజితమై వెలుగొందుతున్నది.

మృత్యుంజయునకు పుత్ర సంతానములేదు, కేవలం ఒక పుత్రికకలదు ఆమెపేరు యశోధర. ఏకైక పుత్రికకనుక ఆమెయెడ మృత్యుంజయునకు అతి వాత్సల్యమున్నది, యశోధర పదునెనిమిది వత్సరములకన్య. ఆమె యవ్వన కుసుమము

వికసించుతున్న రోజులు మృత్యుంజయుడు నిర్యాణ పథా ననుసరించ బోతున్న రోజులు. అధికధన సంపన్నురాలైన యశోధరను వివాహమాడుటకు ప్రతి నవ యువకుడు ఉబలాటపడుటలో అబ్బురమేమికలదు? పైగా ఆమె సౌందర్యం వర్ణనాతీతం ఆమె శాంతిముఖ మండలమున అమాయకత్వం తన ఆధిపత్యాన్ని చెలాయించు చున్నది. ఆమెనవ్వులో శ్రావ్యమైన ఝూంఖారమున్నది. బాల్యావస్థ యవ్వనంతో పరాజితమై శరణుజొచ్చినట్లు ఆమె ముఖమే చెప్పుచున్నది. ఆమె సుందరమైన ఆకాటుక కండ్లలోని సంకోచం, రసయుక్తమైన అరుణ కపోలములలోని లజ్జ, ఆమె శాంతియుతమైన ముఖార విందమునకు ద్యోతకమై ఒప్పారు చున్నవి. నూతన యవనోత్సాహం ఆమెముఖమున నాట్యమాడు తున్నది. ఆమెలో గర్వం మచ్చుకుకూడ కానరాదు. లజ్జతో గూడిన శాంతిమాత్రం ఉట్టిపడుతున్నది.

వృద్ధ మృత్యుంజయుడు యశోధరకు తగినవరుని అన్వేషించు చున్నాడు. అయన దృష్టి బీజగుప్తునిపై బడింది. బీజగుప్తుడు అవివాహితుడు. శ్రేష్ట కులానికి చెందిన నవయువకుడు శిక్షితుడు మృత్యుంజయుని ముఖ్య స్నేహితులలో కొందరు చిత్రలేఖ_ బీజగుప్తుల సంబంధాన్ని గురించిబాగావర్ణించి చెప్పారు వారిలో యశోధరను కోడలినిగా చేసుకొందామనే దురాశాపరులు గూడా కలరు. కాని అనుభవశాలియైన మృత్యుంజయుడు వారికిలా జవాబిస్తూ ఉండేవాడు. “ఇది బీజగుప్తుని యవనోన్మాద కాలము. అతను శిక్షితుడు భవిష్యత్ చాలా పొడుగైనది. ఇప్పుడాతడు అనుభవసాగరంలో మునకలు వేస్తున్నాడు.”

ఆ రోజు మృత్యుంజయుని గృహంలో యశోధరజన్మ దినోత్స సందర్భమున పెద్దసభ జరుగుచున్నది. అందుకు బీజ గుప్తుడుగూడా ఆహ్వానింపబడినాడు. బీజగుప్తుడు యశోధరను బాల్యావస్థలో గాబోలు ఒక పర్యాయం చూచాడు. మృ త్యుంజయునితో గూడా యెక్కువ పరిచయంలేదు. ఆహ్వా నాన్ని చూచుటతోడనే బీజగుప్తుని కాశ్చర్యము కలిగింది. అందులోనూ చిత్రలేఖ సమేతంగా ఆహ్వానింపబడుటచేత మరీ ఆశ్చర్య చకితుడైనాడు.

,,చిత్రలేఖా! ఒక విచిత్రవిషయం! నీవు మృత్యుంజ యుని ఎరుగుదువా!

,,ఆ...ఎరుగుదును."

,,అయితే ఆయనపుత్రిక యశోధరనో?"

కొంచనూలోచించి — ,,ఆ...ఒ క ప ర్యా య ం చూచాను."

,,యశోధర జన్మదినోత్సవ సందర్భమున జరిగే సభకు నాకు ఆహ్వానం వచ్చింది. ఆయనతో నాకధిక పరిచయం గూడా లేదు. అందువల్ల నాకాశ్చర్యముగా నున్నది. నా ద్వారా నీకుగూడా ఆహ్వానం వచ్చింది—ఇంకు మరీ ఆశ్చ ర్యం కలుగుచున్నది"

,,అయితే దీనిభావం నేనురావడం అనుచితమనా?"

,,కాదు! చిత్రలేఖా! నీసమేతంగా రమ్మని ఆహ్వానించ డం ఉచితం ఎందుచేతనంటే— అందరూ నీ సంబధాన్ని పవిత్రమైనదిగా భావిస్తున్నారు"

కొంచమాగి చిత్రలేఖ ఇలాఅన్నది— "బీజగుప్తా! నాకు ఎక్కువగా పైకులములవారి ఉత్సవములలోనికి నర్తకి రూపంలోవెళ్ళే అలవాటున్నది.ఒకవేళ ఉచ్చకులీన స్త్రీలు నన్ను అవమానించితే అప్పుడేమి చెయ్యాలో నాకు తెలియదు"

బీజగుప్తుడు నవ్వాడు. "నాతో ఉండగా నిన్నవమానించే సాహసం ఎవ్వరికీ ఉండదని విశ్వసించు" బీజగుప్తుడు వెంటనే శ్వేతాంకుని పిలచాడు.

శ్వేతాంకునివెంట ఇద్దరూ బైటకొచ్చారు. బీజగుప్తుని రథాన్ని యిరువురూ అధిష్టించారు. శ్వేతాంకుడు గుర్రాల కళ్ళాన్ని చేతపట్టాడు.

నియమిత సమయానికి ఆహ్వానితులైన అతిథులందరూ మృత్యుంజయుని భవనానికి చేరుకున్నారు. "మహాసామంతులుంగారి రథం ద్వారంవద్దనున్నది" అని గేటువద్దనున్న బంట్రోతు బిగ్గరగా అరచాడు. యశోధరసైతంగా మృత్యుంజయుడు ద్వారంవద్దకొచ్చాడు. మృత్యుంజయుడు బీజగుప్తునకు స్వాగతమిచ్చాడు. యశోధర చిత్రలేఖను స్వాగతమిచ్చింది. శ్వేతాంకుడు వారివెనువెంటనే వెళ్లాడు.

ద్వారాన్నిదాటి అందరూ నాట్యభవనానికి చేరుకొన్నారు. దాదాపు పాటలీపుత్రంలోని ప్రతిభాశాలురైన సామంతులందరూ హాజరైయున్నారు. బీజగుప్తుడు చిత్రలేఖ రాగానే అందరూహ్వానం చేశారు. చిత్రలేఖ యశోధర

వెంటవెళ్లి స్త్రీ సమూహంలో కలసింది. బీజగుప్తుడు మృత్యుంజయునివద్ద ఆగిపోయినాడు.

యశోధరను చూచి చిత్రలేఖ చకితురాలైనది. ఇప్పటి వరకు చిత్రలేఖ తనఅందానికి తానే మురిసిపోతుంది. కాని యశోధర క్షణంలో ఆమురిపాన్ని దూరంచేసింది. యశోధర చిత్రలేఖను ఆదరముగా ఆసనమిచ్చింది. తానుగూడా ఆమె ప్రక్కనే కూర్చున్నది. యశోధర చిత్రలేఖను విశేషసత్కారములునల్పుట ఆమెప్రక్కనే కూర్చొండ బెట్టుకొనుట అన్య స్త్రీలకు కొంచెము ఎగటుగా కనుపించింది.

తనబాల్యావస్థయందు యశోధర చిత్రలేఖ నృత్యాన్ని ఒకసారి చూచింది. అప్పుడు తన్మయురాలైంది. నేను ఆమె వెంట ఉండవలసినదిగా తండ్రిగారిఆదేశం యశోధరకుగూడా అదే యెక్కువ ఇష్టం.

చిత్రలేఖను నాల్గువైపులా యువతులు చుట్టుముట్టారు. కొందరు నవ్వుతున్నారు. మరికొందరు వ్యంగ్య వాచకములు పలుకుతున్నారు. కాని చిత్రలేఖ వాటిని లక్ష్యపెట్టలేదు. తనస్థితి తనకు బాగాతెలుసు. దగ్గరగా నిలబడియున్న ఒక పెద్ద సామంతునిభార్య ఇలా అన్నది. ‚‚నేడు నర్తకీ చిత్రలేఖను మాసమాజంలో కలసినందుకు సాధన్యవాదాలు.‟

విషయం యెంత కఠోరముగా నున్నదో అంతకెట్టింపు కఠోరముగా నున్నది జవాబు. ‚‚తన సౌందర్యానికి తానే ముగుసుకొని తనను అందరూ ప్రశంసించాలనే అభిలాష ఉన్నవారికి ధన్యవాదాల అవసరంలేదు.‟

ఒకరు రెండవవారివంక రెండవవారు మూడవవారి వంక ఇలా వరసగా ఒకరి ముఖంవంక వకరు అందరూ చూచుకొన్నారు. ఈవిషమపరిభావం పురుష సమూహంమీద గూడాసోకింది. బీజగుప్తు డటుపరికించాడు. ఆమెకు ఎక్కడ అవమానం జరుగుతుందోనని బీజగుప్తునకు భయంగానే యున్నది. ఈఉత్తర—ప్రత్యుత్తరములతో భయంమరీ అధిక మైంది ‘‘ఏమిటా విషయా?’’అన్నాడు బీజగుప్తుడు.

చిత్రలేఖ క్రోధితముఖంవెంటనే శాంతముగామారింది. ‘‘ఏమీలేదు. మాలోమాకు జరిగే సరసం’’ అంటూ చిరు నవ్వు నవ్వింది చిత్రలేఖ.

చిత్రలేఖయొక్క ఈభావ పరివర్తనమునకు యశోధర ముగ్ధురాలైంది. బీజగుప్తుడువెళ్ళిన తరువాత ‘‘సోదరీ! నీ౦వ్యవహార కుశలత చాలా సందోర్భోచితంగా నున్నది. ’’అన్నది యశోధర.

‘‘అంత ప్రభావశాలినా?’’ అన్నది చిత్రలేఖనవ్వుతూ. చిత్రలేఖ హాస్యధ్వని ఎంతో శ్రావ్యంగా ప్రతిధ్వనించింది. నవయువకుల నేత్రాలన్నీ సాంతముగా అటుతిరిగినవి. అదే సమయంలో బీజగుప్తుని ఒకపాట పాడవలసినదిగా కోరారు కొందరు నవయువకులు.

వీణతీసుకొని బాగేశ్వ గీ రాగాన్నాలాపించాడు బీజగుప్తుడు నాల్గువైపులా నిశ్శబ్దం వ్యాపించింది. స్త్రీ,పురుష

లందరూ ముగ్ధులై వింటున్నారు. బీజగుప్తుడు తన ఆలాపన ముగించిన తరువాత మృత్యుంజయుడు స్వయంగా వీణతీసుకొని యశోధరకు సంజ్ఞచేశాడు యశోధరగూడా భాగేశ్వరి రాగాన్నే ఆలపించింది. కాని అందరూ బీజగుప్తుడు ఆలాపనయే బాగుందంటున్నారు. చిత్రలేఖ ఈవిషయమునుగ్రహించింది. వెంటనే ఆమె ఇలా అన్నది. ‚‚ఇష్టం ఉంటే ఈసారి కళ్యాణ రాగము నాలాపించ వలసినదిగా యశోధరనుప్రార్థించుచున్నాను,„

అచ్చట ప్రజాదృష్టి చిత్రలేఖ వైపుకు మరలింది. మృత్యుంజయుడుకూడా చిత్రలేఖను చూచాడు. కాని ఆమె కథనంలోని ప్రాముఖ్యాన్ని గుర్తించలేదు. అయినప్పటికీ ఒక అథితిద్వారా ప్రార్థన జరిగింది గాబట్టి మృత్యుంజయుడు వీణను తీసుకొని కళ్యాణరాగాన్ని పూరించాడు. యశోధర ఆలాపించ సాగింది, ఈసారి యశోధర అందర్నీ ముగ్ధులను చేసింది. అంతా ముక్త కంఠముతో ఈమెను ప్రశంసించారు ఆలాపన ముగిసిన తరువాత చిత్రలేఖ యశోధరను ధన్యవాదాలర్పించింది.

మృత్యుంజయుడు చిత్రలేఖ కథనంలోని ప్రాముఖ్యాన్నిప్పుడు గ్రహించాడు. ‚‚చిత్రలేఖా! యశోధర తరఫ్గా నేను నీకు ధన్యవాదా లర్పించు చున్నాను.„

ఈవార్తాలాపమును బీజగుప్తుడు వింటూనేయున్నాడు. ‚‚ఇంక చిత్రలేఖ నృత్యాన్ని చూపించ వలసినదిగాప్రార్థించు చున్నాను„ అన్నాడు నవ్వుతూ బీజగుప్తుడు.

"బీజగుప్తుని ప్రార్థన చిత్రలేఖకు ఆజ్ఞతో సమానము" అన్నది చిత్రలేఖ. మృత్యుంజయుడు వీణను తీసుకొన్నాడు. బీజగుప్తుడు మృదంగము తీసుకొన్నాడు. చిత్రలేఖ నృత్యాన్ని ప్రారంభించినది. అంతా చిత్రలేఖను ప్రశంసిస్తున్నారు. చిత్రలేఖ తన నిపుణతను చూపించుచున్నది. ఇదేసమయమున గేటు బంట్రోతు బిగ్గరగా అరచాడు. "గేటువద్ద కుమారగిరివారు తమ శిష్యునితో సహా విచ్చేసి యున్నారు."

మృత్యుంజయుడు వీణను క్రిందికి దించాడు. కుమారగిరి స్వాగతార్థం బైటకువెళ్లాడు. చిత్రలేఖ నృత్యఆగిపోయింది.

మృత్యుంజయుడు కుమారగిరిని లోనికి తోడ్కొని వచ్చాడు. కుమారగిరివెంట విశాలదేవ్ కూడా ఉన్నాడు. కుమారగిరి రావడంతోడనే గౌరవముగా అందరూ లేచి నిలబడినారు. వెంటనే చిత్రలేఖ బీజగుప్తునితో ఇలా అన్నది. ఇక నేను వెళ్లిపోతున్నాను. నాకు తగిన అవమానం జరిగింది"

"నీకవమానం ఎలాజరిగింది?"

"నాదృష్టిలో కళకు సర్వోచ్చస్థానమున్నది. కళను అవహేళన చేసే మానవుడు మనుష్యుడు గాడు. పశువు. కుమారగిరి స్వాగతంకోసం మృత్యుంజయుడు నృత్యాన్ని ఆపడం అవమానంకాక మరేమిటి?"

బీజగుప్తుడు చిరునవ్వు నవ్వి "నీఇష్టం" అన్నాడు.

కుమారగిరి ఆసనమునధిష్ఠించాడు. చిత్రలేఖ కుమారగిరికభివందన మాచరించలేదు. ఇంక వెళ్లడానికి అనుమతి నివ్వవలసినదిగా మృత్యుంజయుని కోరింది చిత్రలేఖ.

యశోధర కృతజ్ఞతా పూర్వకంగా చిత్రలేఖవంక చూచింది. బీజగుప్తుడు కౌతూహలంగా చూచాడు. ఇక శ్వేతాంకుడు రెప్పవాల్చకుండా యశోధరను చూస్తున్నాడు. అకస్మాత్తుగా యశోధర నేత్రాలు శ్వేతాంకుని నేత్రాలను కలుసుకున్నాయి. ఇప్పటివరకూ యశోధర శ్వేతాంకుని చూడ లేదు. యశోధరకు అతిథులందరూ, కొద్దో గొప్పో పరిచితులె గాని శ్వేతాంకుడు బొత్తిగా అపరిచితుడే. "ఈ యువకు డెవరు?" అని బీజగుప్తుని అడిగింది యశోధర.

"నా సేవకరూపంలో నున్న సోదరతుల్యుడు" ఎంత విచిత్రమైన విషయం! తెలుసుకోవాలనే కుతూహలం యశో ధరకు కలిగింది. "ఇది ఎలా సంభవము?"

"ఇది సంభవమే! ఇతనిపేరు శ్వేతాంకుడు. క్షత్రియ నవయువకుడు. ఉచ్చకోటికి చెందిన బ్రహ్మచారి. ఒక గురువు గారివద్ద ఉంటున్నాడు. ఆ గురువుగారు ఈ వ్యక్తిని పాపానికి పరిచితుణ్ణి చేయడానికిగాను, నావద్ద విడచి వెళ్ళాడు— నా ద్వారా ఈ నవయువకుడు ఇప్పుడిప్పుడే సమాజంలోనికి పాదా ర్పణ చేయుచున్నాడు."

యశోధర చకితురాలైంది "పాపానికి పరిచితుణ్ణి చేయ డానికి గురువుగారు ఈయనను మీవద్దకు పంపించారా? ఐతే తమస్థానం— లేదా తమ వ్యక్తిత్వం పాపమంటే ఏమిటో తెలుసుకోవడానికి ఉపయుక్తమైనటువంటిదా?"

బీజగుప్తుడు మనస్సులో నవ్వుకున్నాడు. ఆహా! ఎంత అమాయకురాలు! ఎంత భ్రమలో నున్నది? "పాపాత్ముడైన మనుష్యుడు నేను పాపాత్ముడనని చెప్పుకోలేడు. ప్రతివ్యక్తి

తనను తాను మంచివాడనుకుంటాడు. ఎవరిని వారు అర్థంచేసుకొనడం అసాధ్యం. ఈ విషయం శ్వేతాంకుని నిర్ణయంపై ఆధారపడి యున్నది. శ్వేతాంకుని నిర్ణయం నేను పాపినని చెప్పితే వాస్తవంగా నేను పాపినే!"

యశోధర హృదయానికి ఏదో ఒక పెద్దదెబ్బ తగిలి నట్లనుపించింది. తాను పరిణయమాడాల్లనుకొనే వ్యక్తి ఒక ఆచార్యులచేత పాపమంటే ఏమిటో? తెలుసుకోవడానికి సాధనగా గుర్తించబడినాడా? ఆమె శ్వేతాంకునివంక చూచింది– ఎంత అమాయకుడు!– ఎంత అందమైన యువకుడు– మరి బీజగుప్తు!......

ఇంతలో భోజనం సమాప్తమైనది. అందరూ లేచి చేతులను శుభ్రపరచుకొని ఒక్కచోటికి చేరారు. బీజగుప్తుడు శ్వేతాంకుని చేయిపట్టుకొని మృత్యుంజయునకు అతని పరిచయం చేశాడు. ఆ తరువాత అందరూ తమతమ నిజగృహముల కేగినారు.

# 10

మృత్యుంజయుని ప్రకాశవంతమైన భవనంలో ప్రకాశం ఇకనూ అలాగే ఉండిపోయినది. అప్రధానమైన అథితులందరూ వెళ్లిపోయినారు. ఇక మన నాటక రంగానికి కావలసిన్ని ప్రధాన అభినేత్రులే మిగిలియున్నారు. యోగి కుమారగిరి, విశాలదేవ్, చిత్రలేఖ, బీజగుప్తుడు, శ్వేతాంకుడు. కేవలం ఈ వ్యక్తులను మాత్రమే మృత్యుంజయుడుఆపినాడు. కొంతసమయంమౌనంగా

ఉండిన తరువాత మృత్యుంజయుడు బీజగుప్తుని చేయిపట్టుకొని—
"సామంత్ బీజగుప్త! ఈ ఉత్సవములో ఒక పెద్ద రహస్య మిమిడియున్నది. ఆ రహస్యానికి నీకు ఘనిష్ఠ సంబంధమున్నది" అన్నాడు నిండు స్వరంతో. బీజగుప్తుని ముఖకాంతి తగ్గింది. చిత్రలేఖ చిరునవ్వు నవ్వుచున్నది.

"ఈ వృద్ధ మృత్యుంజయునిమాట తిరస్కరించబడదని నేను పూర్తిగా విశ్వసిస్తున్నాను."

దాదాపు అందరూ బీజగుప్తుని భావమును గ్రహించారు. బీజగుప్తుడిలా అన్నాడు "దేవా! స్వీకృతి— అస్వీకృతి— అనేది ప్రస్తావన అనుకూలతమీద ఆధారపడి ఉంటుంది. తమ ప్రస్తావన ననుసరించే నా జవాబు ఉంటుంది."

మృత్యుంజయుడు కొంచెమాలోచించి— "బీజగుప్త! ఇంకా మీ వివాహం జరుగలేదు." అన్నాడు.

బీజగుప్తుడు విన్నాడు— చిత్రలేక వైపుచూచాడు— —ఏం జవాబివ్వాలా? అనే సంశయం పొడసూపింది. ఏ నిశ్చ యానికి రాలేక పోయినాడు— యధార్థమే— కాని బీజ గుప్తుని మతానుసరించి మాత్రం అది పొరబాటు. "శాస్త్ర యుక్తంగా కాలేదు."

ఈసారి యోగి గంభీరంగా ఇలా అన్నాడు. "యువా శాస్త్రవిహితంగా కూడా వివాహం జరుగుతుందా?"

"స్త్రీ పురుష స్థాయీసంబంధాన్నే వివాహమంటారు అన్నాడు బీజగుప్తుడు.

కుమారగిరి నవ్వాడు– "వివాహం అనే శబ్దం సమాజం ద్వారా సృజించబడినది. శాస్త్రం స్త్రీ, పురుషులిమధ్య సంబంధాన్ని పవిత్రంచేసి సమాజంలో మాన్యతను సంపాదించుతుంది. బీజగుప్తు! నీవు అర్ధసత్యాన్ని అంగీకరించుచున్నావు!"

బీజగుప్తుడు గంభీరాన్ని విడువకుండా అన్నాడు — "యోగిరాజా! అర్ధసత్యం అంటూ ఉండనే ఉండదు. సత్యం సంపూర్ణమైనటువంటిది. కాని ఇది తర్క వితర్కానికి సమయం కాదు కనుక ఇప్పుడు జవాబివ్వకుండా అనుచితమే" బీజగుప్తుడు మృత్యుంజయునితో ఇలా చెప్పాడు.– "ఆర్యా! నేను నా వివాహం శాస్త్రయుక్తంగా కాలేదని చెప్పాను. ఈ విషయాన్ని ఇంకా విపులీకరించవలసిన అవసరమున్నది. లోకం దృష్టిలో నేను అవివాహితుణ్ణి. కాని వాస్తవంగా నేను వివాహితుడను. చిత్రలేఖ నా పత్ని. చిత్రలేఖతో నేను శాస్త్రయుక్తంగా పాణిగ్రహం చేసుకోనలేదు. సమాజ నియమముల ననుసరించి చేసుకోలేనుగూడా. అయినప్పటికి నాకు చిత్రలేఖకు ఉన్నసంబంధము పతిపత్నులకు ఉండే సంబంధము లాంటిది. నేను ప్రేమను విశ్వసిస్తున్నాను. ఈపరిస్థితిలో నా వివాహం జరుగుట అసంభవము. ఏ ఇతర స్త్రీ నాప్రేమను పాత్రురాలు కాజాలదు"

ఇదంతా బీజగుప్తుడు దృష్టిని క్రిందికి వంచుకొనిచెప్పాడు "మీరు చెప్పింది సమంజసమే. అనుచితం ఎన్నటికి కానేరదు. లోకమంతా అవివాహితుడవని ఘోషించేటప్పుడు మీరు అవివాహితులే. ఇక మిగిలింది వివాహం చేసుకోనేవిషయం–

వివాహం సంతానోత్పత్తికోసం జరుగుతుంది. చిత్రలేఖ సంతానాన్ని బీజగుప్తుని సంతానమనుటకు వీలులేదు. ఆసంతానము మీకు ఉత్తరాధికారి కాజాలదు. ఈవిషయాన్ని గురించి మీరెప్పుడైనా ఆలోచించారా? అన్నాడు మృత్యుంజయుడు.—

వాస్తవంగా బీజగుప్తుడు ఈ విషయములను గురించి ఎన్నడూ ఆలోచించలేదు. అతనికి బాత్తిగా క్రొత్త సమస్యగానున్నది. జవాబేమీ ఇవ్వలేదు. మృత్యుంజయుడు చిత్రలేఖతో ఇలా అన్నాడు. "దేవీ చిత్రలేఖా! నీవు విదుషీవి. అధికంగా చెప్పవలసిన అవసరములేదు. నీకు బీజగుప్తుని పరిస్థితి బాగా తెలుసు."

చిత్రలేఖ ఇప్పటివరకూ మౌనంగా నున్నది, ఈసారి జవాబిచ్చింది. ఆర్యశ్రేష్టా! మీరు చెప్పింది యదార్థమే. నేను సమాజంచే వంచితురాలైన నర్తకిని. నేను బీజగుప్తునకు పత్నినగుట అసంభవము. ఈ పరిస్థితులలో నేను బీజగుప్తుని కోసం అతని మేలుకోసం ఏదైనా చేయడానికి సంసిద్ధమే. కాని అలా చేయడమంటే, నాకు పెద్ద త్యాగం చేయవలసి ఉంటుందని మీకు తెలుసు"

"త్యాగం చేయవలసి ఉంటుందా నర్తకీ!" కుమారగిరి నవ్వాడు. "విచిత్రమైన విషయం చెప్తున్నావు. వైరాగ్య జీవితం గడపాలని ఉన్నదని నీవు నాతో ఒకసారి చెప్పావు. నీవు నీమనః ప్రవృత్తిని మరుస్తున్నావు. ఇది మంచిసమయం సుమా!

కుమారగిరి మాటలను విని బీజగుప్తుడు తుళ్ళిపడినాడు "యోగిరాజా! మీరు వైరాగ్యాన్ని విశ్వసిస్తూ మరియొకరికి

వైరాగ్య ఉపదేశం ఇవ్వగలిగియుండికూడా నన్ను వివాహబద్ధుడ కామని బలవంత పెట్టుచున్నారేల?"

చిత్రలేఖ కుమారగిరి చెప్పిందానిని గురించి ఆలోచించుచున్నది. ఈ అవసరాన్ని పురస్కరించుకొని ఆమె అన్నది. "యోగీ! మీరు నాకు గురుపదేశం ఇవ్వడానికి సిద్ధమేగదా? 'అవును' అంటే ఇప్పుడే నేను మీ శిష్యురాలనౌతాను."

కుమారగిరి నేత్రాలు వాటంతటవే విశాలదేవ్ వైపుకు మరలినాయి. విశాలదేవ్ తన గురువువంకే చూస్తున్నాడు. కొంత తడవాలోచించి— "నర్తకీ! నీకు గురుపదేశం ఇవ్వడం అసంభవము" అన్నారు కుమారగిరి.

చిత్రలేఖ ఒక వ్యంగ్యాత్మకమైన నవ్వు నవ్వింది. "నోటితో చెప్పడం చాలా తేలిక— కాని ఆచరించడం చాలా కఠినం. యోగీ! మీకు విరాగమనేది ఎంత సరళమో అది నాకంత కష్టం. ఒంటరిగా విరాగక్షేత్రంలో విహరించడం నా చేతగాదు. ఇప్పటివరకు నేను అనురాగక్షేత్రంలోనే వున్నాను అది సమాజమునకు ఎంత చెడుగా నున్నప్పటికి నాకూ, నా ఈశ్వరునకూ పవిత్రమైనదే. దాన్నుండి బైటకు రావడమంటే నా దృష్టిలో కలుషిత క్షేత్రంలో కాలుపెట్టుటమన్నమాటే. నేను అనవసరంగా అలాంటి పాపాన్ని చేయ సిద్ధంగాలేను."

విషయం ముడిపడింది — తెగిపోయిందికూడా — మృత్యుంజయునకు కొంత అనుభవం కలిగింది. బీజగుప్తునకు గూడా అనుభవం కలిగింది. కుమారగిరి— చిత్రలేఖా! ఒకరిని ఒకరు బాగా అర్థంచేసుకొన్నారు. శ్వేతాంక్ — విశాలదేవ్—

ఇద్దరూ ఈ సంభాషణలోనున్న చిదంబర రహస్యాన్ని గతిస్తు న్నారు. ఒక్క యశోధరయే ఈ విషయానికి అపరిచితురాలు. ఆమెను అయోమయంగా నున్నది. ఆమె మృత్యుంజయునితో అన్నది. "నాన్నగారు! రాత్రి చాల గడచిపోయింది."

మృత్యుంజయుడు తన పుత్రికవైపును చూచాడు. చిత్ర లేఖ వైపును చూచాడు. ఇద్దరిలోను ఎంతభేదం! — ఒకరు దేవసమానులు—రెండవవారు—దానవ సమానులు— ఒకరు శాంతిమయులు — రెండవవారు ఉన్మాదభరితులు — మరి బీజ గుప్తుడో? పరిస్థితుల చక్రానికి గురియైయున్నాడు. అయినప్ప టికి సంపూర్ణ మనుష్యత్వంగల వ్యక్తి.

మృత్యుంజయుడు చిత్రలేఖతో ఇట్లన్నాడు, "నీ నేత్రాన్ని అపవిత్రమని ఎవరనగలుగుతారు? నీవు నీమనః ప్రవృత్తి ననుసరించి చేస్తున్నావు. నీ ప్రవర్తనంతా ప్రేమ ప్రధానమనికూడా నే నొప్పుకుంటాను. నిజమైన ప్రేమలో అపవిత్రతకు స్థానంలేదు. కాని దేవీ! నీవు ప్రేమించే వ్యక్తి చెడుమార్గాన్ననుసరించినప్పుడు, అతనిని సరియైన మార్గానికి తీసుకవచ్చే బాధ్యత నీదికాదా? ప్రేమలో మహత్తరమైన త్యాగముంటుంది. బీజగుప్తునికోసం నీవు చేసే త్యాగం గొప్ప మహత్తరమైన దౌతుంది."

మృత్యుంజయుని మాటల ప్రభావం చిత్రలేఖమీద బాగాపడింది, మధ్యలో బీజగుప్తుడందుకొన్నాడు. "ఆర్య శ్రేష్ఠా! చిత్రలేఖతో ఈ విషయం చెప్పడం నిష్ప్రయోజనం. చెడడం, బాగుపడడం అనేది నామీద ఆధారపడియున్నది. చిత్ర

లేఖ నన్ను చెరపజాలదు. బాగుచేయలేదు. చిత్రలేఖకు నాకూఉన్న సంబంధము అమరమైనదని మాత్రం చెప్పగలను."

బీజగుప్తుడు లేచి నిలబడియున్నాడు. చిత్రలేఖ కూర్చొనియే యున్నది. "ఆర్యశ్రేష్టా! మీరు చెప్పింది ఉచితంగా నీయండి— అనుచితంగానీయండి! నా కర్తవ్యమును నేను పాలించుతాను. నాకోసం కాకపోయినా, బీజగుప్తునికోసం చేయవలసియున్నదని విశ్వసించండి." చిత్రలేఖ యశోధర వైపుచూచి— "ఆర్యా! మీ కన్యకు బీజగుప్తుడు తగిన వరుడు. ఈ వివాహంగూడా ఎంతో అందంగా ఉంటుంది" అన్నది చిత్రలేఖ. తిరిగి బీజగుప్తునితో— "బీజగుప్త! నీకు యశోధరలాంటి భార్యాలభించడం అసంభవము. నేటినుండి మీఇద్దరి సంబంధం కుదిరిపోయింది" అన్నది.

బీజగుప్తుడు అప్పుడు ద్వారంవద్ద నిలబడియున్నాడు "చిత్రలేఖా! నీవిట్లనుట సమంజసముగాదు. అట్లు జరుగుట గూడా అసంభవమే. ఇంక అధికంగా చెప్పజాలను" "మంచిది! ఆర్యా! శెలవు" అని బీజగుప్తుడు మృత్యుంజయుని భవనం బైటకు వెళ్ళాడు.

చిత్రలేఖగూడా లేచింది. "ఆర్యశ్రేష్టా! బీజగుప్తుని ఈమాటలను అపార్థం కల్పించవలదు. ఆవేశంలో మనుష్యుడు మంచి, చెడ్డలను మరుస్తాడు. అట్టిస్థితిలో ఇతరవ్యక్తికి ఏదైనా చెప్పితే అనుచితంగానే కనబడుతుంది. బీజగుప్తునకు మీ కన్య యశోధరలకు వివాహం జరుగడం చాలాఉత్తమము. అత్యావసరంగూడా అలా తప్పక జరుగగలదని నేను మీకు ధైర్యాన్నిస్తున్నాను."

శ్వేతాంకునితో సహా చిత్రలేఖ బీజగుప్తుని వెంట వెళ్లింది. మృత్యుంజయునకు పరిస్థితులు పూర్తిగా అవగాహనమైనాయి కొంతతడవు మౌనం వహించి మృత్యుంజయుడు కుమారగిరితో ఇలా అన్నాడు. "యోగిరాజా! నాకేమీ అర్థంకాలేదు. కాని ఈ సంభాషణవల్ల తేలిందేమంటే, నర్తకీ చిత్రలేఖ ప్రభావము బీజగుప్తునిమీద బాగా వ్యాపించియున్నది."

"నిస్సందేహంగా"

"నర్తకి చిత్రలేఖ హృదయం స్వచ్ఛమైందికూడా"

ఈసారి కుమారగిరి మౌనం వహించాడు. అతని నైనాలు ఎందుకోగాని వాటంతటవే పరుగెత్తి విశాలదేవ్‌ను చేరుకున్నాయి విశాలదేవ్ ముసిముసి నవ్వు నవ్వుచున్నాడు.

"యోగీ! బీజగుప్తుని అధిక బలవంతపెట్టుట ఉచితమా చిత్రలేఖ చెప్పింది ఆచరించుతుందని నాకు గట్టివిశ్వాసమున్నది. బీజగుప్తుని విడనాడడమంటే నిజంగా చిత్రలేఖకు పెద్ద ఆత్మ ఘాతం కలిగినట్లే."

ఈసారి కుమారగిరి ఇట్లన్నాడు. "చిత్రలేఖకు అఘాతం కలుగుతుందంటే నేను నమ్మను. స్వయంగానే చిత్రలేఖ బీజగుప్తుని విడనాడతలంచినది. అప్పుడు బీజగుప్తుని జీవితం బాగుపడుతుంది. బీజగుప్తునకు చిత్రలేఖకు ఉన్న సంబంధం తెగిపోవడం ఉచితమని చెప్పగలను."

కుమారగిరి లేచి నిలబడి మృత్యుంజయునితో ఇలా అన్నాడు— "మృత్యుంజయా! యశోధరకు బీజగుప్తునికంటే, మంచివరుడు దొరకడం అతికష్టం అనేదిమాత్రం గుర్తించు కొండి."

# 11

చిత్రలేఖ ప్రేమనుగురించి తనజీవితంలో ఎన్నిమార్లు వ్యాఖ్యానించుకున్నదో. ఎవరికి తెలుసు? ప్రతి పర్యాయం గూడా ఆమె భూతకాలనిర్ణయం తప్పేనని తేలింది.

చిత్రలేఖ ప్రధమప్రేమ ఈశ్వరీయమైనది. ఆమె తన పతిని ప్రేమించింది. ఆ ప్రేమలో పవిత్రతయున్నది. పతి యెడ అపారమైన భక్తియున్నది. పతి ప్రేమలో తన అస్తిత్వాన్ని లీనంచేసింది. అంతేకాదు తన అస్తిత్వాన్ని కోల్పోయింది. ఆమెనవ్వినా, మాట్లాడినా, ఏంచేసినా పతిఆనందము కోసమే చేసింది. ఆమె జీవితంయొక్క ప్రతిక్షణం పతి ఆనందంకోసం వినియోగించింది. ఆమెకు పతే ప్రపంచము. పతేదైవం. సర్వస్వం పతే. ఆహా! పతిప్రేమలో ఎంత సుఖమున్నది! పతిప్రేమకు ఆమె ఆత్మబలిదానంచేసింది. ఆత్మబలిదానంలో ఉండేఆనందం ఆత్మ బలిదానంచేయువారికే తెలియాలి!

పతి మృత్యుడైన తరువాత ఆమె ప్రపంచం అంధకారమైపోయింది. చేసిన సాధన సల్పిన తపస్సు అంతా వ్యర్ధమని ఆమెకు తోచింది. ఆమె అప్పుడప్పుడూ ఆత్మహత్యచేసుకుందామని కూడా ఆలోచించింది. కాని ఆత్మహత్య మహాపాపమని ఆమెకు తెలుసు తపస్సు జీవితానికి ప్రధాన అంగమని, సంయమని యమపాలన విధవరాలు కర్తవ్యమని. ఆమెకు బోధించబడింది. అదే అచరించిందిగూడా కాని అవి ఆమెకు చాలాకఠినంగా కనుపించింది. పతి జీవించియున్నంత

కాలం పూజచేయగలిగింది. ఘోర తపస్సు చేయగలిగింది. సాధనలో నిమగ్నురాలై యుండగలిగింది. అందుకు కారణం పతియనే కేంద్రబిందువొకటి దృష్టి గోచరమగుచున్నది. ఆ కేంద్రం చిన్నాభిన్నం అయిపోయిన తరువాత తన్మయం విచలిత మైంది. విశ్వాసం సన్నగిల్లింది.

తరువాత చిత్రలేఖ కృష్ణాదిత్యుని ప్రేమించింది. ఈ ప్రేమ ఈశ్వరీయమైనదికాదు. ప్రాకృతికమైనది. ఈ సారి ప్రేమలో భక్తిలేదు. ఆత్మవిస్మరణ మాత్రంఉన్నది. అస్థిత్వాన్ని కోల్పోవుటమంటూలేదు, తన అస్థిత్వాన్ని ప్రేమకుని అస్థిత్వంలో కలుపుటమాత్రంఉన్నది. ప్రథమంగా చిత్రలేఖకు పిపాసయొక్క అనుభవం కలిగింది. భయకంపితురాలైంది. ఇంతకుముందు పిపాసలోనిమహాత్తును తెలుసుకోలేకపోయింది. కోర్కెలయొక్క ఉగ్రరూపాన్ని చూచి ముందుగా భయపడింది. కాని తరువాత సుఖంలభించింది. ఈసారిఅమెకు జీవితఅనుభవం కలిగింది. ప్రేమభక్తిగాదు. కనుక ఒకవైపునుండి జరుగదు. ప్రేమసంబంధం ఇరుపక్కల నుండి జరుగుతుంది. ఆత్మయొక్క పవిత్రసంబంధాన్నే ప్రేమంటారు. ప్రేమలో కంపనము, పిపాస, ఆత్మవిస్మరణ ఉంటాయి. అచ్చట తృప్తికి ఏరకమైన స్థానమూలేదు. ప్రేమలో ఆత్మ బలిదాన మంటుంది. అది ఇరువైపులనుండి కలుగుతుంది. కృష్ణాదిత్యుడు కూడా ఈలోకాన్ని విడచివెళ్ళాడు. ప్రేమ అమరమైనదిగాదు. ఒక పవిత్రమైన స్మృతిజ్యోతి రోజు రోజుకూ క్షీణించుచుతూ కొంత కాలానికి సాంతముగా లుప్త

మైపోయింది. ఈ విషయం చిత్రలేఖకు సానుభవంద్వారా తెలిసింది.

బీజగుప్తుడు చిత్రలేఖజీవితంలోనికి వచ్చాడు. ఈసారి చిత్రలేఖ ప్రేమలో పిపాసనూ, అప్పుడప్పుడూ ఆత్మ విస్మరణను చూచింది. ఆత్మ బలిదానమును మాత్రంగాదు. ప్రేమలో నున్న మాదకత్వాన్ని చూచింది. దానితోపాటు ఐశ్వర్యాన్ని, భోగ విలాసములను మనోహర రూపాన్ని చూచింది. ఆమె ఇంకో క్రొత్త విషయాన్ని గూడా చూచింది. కేవలం జీవితానికి కావలసినది ప్రేమగాదు. ప్రేమ జీవితానికి ఆధార భూతంకాదు. ప్రేమతోపాటు అన్యకోర్కెలు గూడా అవుసరమే. ప్రేమ కొంతకాలం సుఖానికి ఆధారం కాగలుగుతుంది. ఆసుఖాన్ని చిరస్థాయిగా చేయడానికి. ఆత్మ విస్మరణ ఎంతో అవుసరం అత్మవిస్మరణను జనింపచేయడానికి మధుపానం అవుసర మాతుంది.

తరువాత ఆమె కుమారగిరి వైపుకు అకర్షింప బడింది. కుమారగిరి యువకుడు——అందమైనవాడు——ప్రతిభావంతుడు——మరియూ,————చిత్రలేఖ ఇంతకుమించి ముందుకు ఆలోచించ లేకపోయింది. తనకు తెలియకుండానే కుమారగిరివైపుకు అకర్షింప బడింది. ఇంతకుమించి తనకోర్కెల ప్రబలరూపాన్ని గ్రహించ గలిగిందా?

చిత్రలేఖ కుమారగిరిని ప్రేమించ సాగింది. కాని ఈసారి బీజగుప్తు డుండగానే! అందుకనే ఆమెకు కుమారగిరి వద్దకేగడానికీ తగిన సాహసం చిక్కలేదు.

మృత్యుంజయుని భవనంలో జరిగిన ఉత్సవము కొంత సాహసాన్ని చేకూర్చింది. మానవత్వాన్ని మభ్యపెట్టడానికి చక్కటి అవకాశం కూడా చిక్కింది. చిత్రలేఖ మనస్సులో ఇట్లనుకున్నది, ,,బీజగుప్తుని సుఖపెట్టుటయే నాకర్తవ్యము. ఆయనను విడనాడి. ఆయన జీవితాన్ని సార్థకం చేయ్యడమే నామహత్తర త్యాగం. బీజగుప్తుని సదా విడనాడ వలసియున్నది.»

చిత్రలేక ఆ రాత్రింతా నిద్రించలేదు. ఈ విషయాలను గురించె ఆలోచించుచున్నది. తెల్లవారు ఝామున కొంచెం నిద్రపట్టినది. అందువల్ల నిద్రనుండి ఆలస్యంగాలేచింది అప్పటికి దాదాపుమధ్యాన్నం కావచ్చింది. ఆమె నిద్రనుండి మేల్కొంచడంతోడనే దాసి నిట్లడిగెను ,,బీజగుప్తునివద్దనుండి ఏదైనా సమాచారం వచ్చిందా?»

,,రాలేదు»

చిత్రలేఖ స్నానంచేసింది. భోజనంచేయలేదు. రథం తెమ్మని రథికునకాజ్ఞాపించింది. వెంటనే వస్త్రాగారానికేగి, ఆభూషణములన్నింటినీ తీసి, కాషాయిరంగుగల సిల్కుచీరను ధరించింది. వెంట్రుకలను ముడియలేదు. ఇంతలో రథంద్వారం వద్దకొచ్చింది.

చిత్రలేఖ బీజగుప్తునిపేర ఒక ఉత్తరంవ్రాసి దాసీకిచ్చి ఇట్లనెను. ,,నేను సాయంసమయంవరకూ తిరిగి రానియెడల ఈఉత్తరాన్ని బీజగుప్తునకిమ్ము" తరువాత ఇంట బాధ్యతనంతా ఒక విశ్వాసపాత్రురాలైన దాసీకి వప్పగించింది. ఆదాసీ

ఆశ్చర్య చకితురాలైంది. చిత్రలేఖ అదిగ్రహించి దాసీతో నిట్లనెను—«సుభద్రా! ఆశ్చర్యపడకు! నేను కొంతకాలం పాటు ఈవైభవాన్ని విడుస్తున్నాను—నేను తిరిగివచ్చేపర్యం తరం ఈఇంటికి యజమానివి నీవె.»

చిత్రలేఖ రథమెక్కి కుమారగిరి కుటీరం వైపుకుపోనీ యమని చెప్పింది. రథం వేగంగా పోతుంది. రాజమార్గం లోనే రథాన్నాపింది రథికునతో నిట్లనెను-«ఓయీ! ఇచ్చటనే ఉండు. నేను సాయంకాలమునకు రానియెడల రథాన్ని త్రిప్పి తీసుకొనిపొమ్ము. నాకై ఎదురు చూడవలదు.»

చిత్రలేఖ కుమారగిరి కుటీరాన్ని చేరేటప్పటికి కుమారగిరి ధ్యానావస్థితుడై యున్నాడు. ఎదుటనే చిత్రలేఖకూర్చున్నది. షుమారు ఝామున గడచిన తరువాత కుమారగిరి సమాధిని విడచాడు. కండ్లు తెరచాడు. ఎదుటనే చిత్రలేఖ ప్రత్యక్షం. చిత్రలేఖ నేత్రాలను గట్టిగా మూసుకొని కూర్చున్నది. ఆమె ఏదియో ఆలోచించుచుండెను. ఆమె శరీరంమీద కేవలం ఒకే ఒక వస్త్రమున్నది. కుమారగిరి ఇప్పటివరకూ చిత్రలేఖ చంచిలత్వాన్ని, ఐశ్వర్యముతో గూడిన శృంగారాన్ని చూచాడు. ఇప్పుడో! తేజోపేతమైన శాంతిని ఆమెలో చూస్తున్నాడు. చిత్రలేఖయొక్క పచ్చని ముఖంమీద శాంతి యొక్క ఆభ, ఆమె లోలత్వాన్ని కప్పివేసింది. మంత్రముగ్ధునివలె కుమారగిరి చిత్రలేఖ అందాన్ని ఆత్మైమాస్తున్నాడు. కుమారగిరి మెల్లగా ఇట్లనెను. «నర్తకీ!»

చిత్రలేఖ కండ్లు తెరచింది. గురుదేవుల సమాధి సమాప్తమైనదా?»

‟అవును, నర్తకీ చిత్రలేఖా! నీవిచటకేల వచ్చితివి?”

‟గురుదేవులవద్ద దీక్షపొందడానికి!”

‟నీకు దీక్షనివ్వ నిరాకరించానని, జ్ఞాపకముందా?”

‟అవునునాకు జ్ఞాపకముంది! అయినా సరేవచ్చాను! గొప్పత్యాగం చేశాను. నేడేఅష్టఐశ్వర్యములకు తిలాంజలి లిచ్చాను. సర్వస్వాన్ని త్యజించాను. ఇక శేషం మమత్వమొకటే. దానితోనే తమసమక్షమునకు చేరాను. దాన్నుండి నన్ను విముక్తురాలను చేయడం తమధర్మం—కనీస కర్తవ్యం!”

‟కాదు! నర్తకీ! నావల్లకాదు...!” చిత్రలేఖ అందమైన ఆపెద్దనైనాలయెదుట యోగి గడగడవణకిపోతున్నాడు ఒక్కసారిగా అరచాడు. ‟కాదు — నర్తకీ! ఇది అసంభవము! నేనునీకు దీక్షనివ్వజాలను” అప్పుడు యోగి తనను తానే మరచాడు— నీకు దీక్షనివ్వడమంటే, పతనమవ్వడమే — అతఃపతన మవ్వడమే— ఎంతవరకు?—అంతూపంతూ లేని అఘాతంలో పడిపోవడమే! నేను నిన్ను ఎరుగుదును... నన్ను నేనుయెరుగుదును......నిన్నుపైకితీయడం అతిజటిలం —స్వయంగా పతనమగుట సరళమే!”

కుమారగిరిలేచి విక్షిప్తునిలాగా ఇటునటుపచారు చేయసాగెను. చిత్రలేఖ చేసిన మూర్తిలాగా కూర్చొని యున్నది. కొంచెమాగి కుమారగిరి ఇట్లనెను- ‟నర్తకీ! నిజం చెప్పు... నీవిచ్చటి కెందుకొచ్చావు? నిజంచెప్పు నిజంగా జ్ఞానాన్ని పొందడానికే వచ్చావా? వాస్తవంగా భోగవిలాసములకు

తిలాంజలి నివ్వతలంచావా? ఇదిసంభవమేనా? చెప్పు!... ... మౌనం వహించావెందుకు? ” కుమారగిరినవ్వి—“నీవు నిజం చెప్ప తలంచలేదు! అనృత మాడలేక పోతున్నావు! మౌనం అంగీకారమునకు ద్యోతకం” అన్నాడు.

చిత్రలేఖ నిద్రావస్థ భంగమైపోయింది. ఆమె కుమారగిరి వైపుకు చూచింది. ఆమె నైనాలు కుమారగిరి నైనాలతో కలుసుకొన్నాయి. ఆమె శాంతభావముతో జవాబిచ్చింది. “యోగి! మీరు మీ జయాపజయమును గురించి. అవహేళన చేసుకొని, నాతో ఒకసారి నిజం చెప్పారు. నేను మీవద్ద అబద్ధ మెందుకాడాలి? నిజమే చెప్పుతాను. నేను మిమ్ములను ప్రేమించివచ్చాను.”

“నాఅనుమానం అక్షరాల నిజం!... ధన్యవాదం! నీవునన్ను ప్రేమించి వచ్చావా? ఎన్నడూ, ఎప్పుడూ, ఎవర్నీ. ప్రేమించ ఎరుగని, అసలు ప్రేమంటే యెలా వుంటుందో చూచియైనా యెరుగని, నన్నా?.... ఎంత విలక్షణం! మరొక మాటడుగుతున్నాను. ఏవిధంగా ప్రేమించాలి? ప్రేమస్వయంగానే మనుష్యునిలో ఉత్పన్నం అవుతుందను కొంటున్నాను. మనుష్యుడు ప్రయత్నంచేసి మరీ ప్రేమించుతాడని నాకు తెలియదు.” అని కుమారగిరి నవ్వాడు. రసమిశ్రితమై, వ్యంగ్యాత్మకమైన ఆనవ్వుకు చిత్రలేఖ తుళ్ళిపడింది.

“యోగి! నేనన్నమాటలు సరిగావు—నేను నాభావాన్ని సరైన భాషలో వ్యక్తంచేయలేక పొయ్యాను. నేను మిమ్ము ప్రేమిస్తున్నానని మీకు తెలుసు—చాలరోజుల

నుండి మీాకీవిషయం తెలుసు—మీారుగూడా నన్ను ప్రేమిం చుతారని వచ్చాను.—మీాతో ఉన్న దున్నట్లు చెప్పాను» అన్నది చిత్రలేఖ.

‹‹నీవు నన్ను ప్రేమిస్తున్నావా?—అది సమంజసమే అందుకు నా అభ్యంతరములేదు_ఆటంకపర్చ జాలనుగూడా_ ప్రేమకుబదులు ప్రేమనే ఆశించడంగూడా సమంజసమే— కాని ఆ ఆశను సఫలీకృతం చేసుకోవాలనుకోవడం. అనధి కారమౌతుంది.»

చిత్రలేఖ తెల్లపోయింది. కాని వెంటనే సంభాళించు కొని గంభీరంగా ఇట్లన్నది—‹‹నిజం చెప్పుతున్నారు యోగి! ఈసారిగూడా నేను చెప్పింది పొరబాటే. ప్రేమయొక్క అసంతృప్తిని తృప్తిపర్చుకోవడానికొచ్చాను. నేనుప్రేమిం చేవ్యక్తిపాదధూళిని నిత్యం శిరమందుంచుకోవడానికొచ్చాను నేను మీాలో లీనమై పోదామని వచ్చాను. సేవా, భక్తి, 'నా' అనేదాని విస్మరణ అసంతృప్తియైన దాహం—ఇదేప్రేమ యొక్క ద్యోతకములు. నేనీసత్యాన్ని, విశ్వాసాన్ని, కర్తవ్య మనే ఆవరణలో నావివాహ సమయమున చూచాను. కాని ఆ ఆవరణ ఉండగానే వాస్తవిక తను గుర్తించలేకపొయ్యాను. ఆనాటి సత్యాన్ని ఈనాడుతిరిగి చూచాను. అందుకే మీావద్ద కొచ్చాను.»

ఈసారి కుమారగిరి గంభీర వదనుడైనాడు_‹‹వ్యస నాన్ని దూరంచేసి ప్రేమించడం సంభవమేనా?» యోగి మనస్సులో ఈప్రశ్న లేచింది. ఆయన సాధనా. విశ్వాసం. ఇట్లు జవాబిచ్చింది. ‹‹కాదు» మూర్ఖుడా! నిజమైన ప్రేమలో

వ్యసనానికి, తృష్ణతకు, తావులేదని హృదయం ప్రబోధిం చింది. ‟దేవీ! ఇది చాలా కష్టమైన సమస్య, కొంచెము వ్యవధి నివ్వాలి.” అన్నాడు యోగి.

చిత్రలేఖ కుమారగిరి పాదాలను పట్టుకొని ‟వ్యవధి నివ్వడానికి తగినసమయంలేదు. స్వామి! అవ్వదలచింది కాస్తా అయిపోయింది. నేను చాలా ముందుకు సాగివచ్చాను– ఇంక వెనుతిరగడం అసంభవము! నేను ఈకుటీరంలోఉండే నిశ్చయంతోనే వచ్చాను - వెను తిరగిపోవడానికి కాదు. అన్నది

ఈమాటలకు జవాబివ్వకుండానే ‟కాలినడకనే వచ్చావా?” అని ప్రశ్నించాడు కుమారగిరి.

‟లేదు. రథంమీద ఒచ్చాను.”

‟రథమెక్కడునున్నది?”

‘ రాజమార్గంలో విడచివచ్చాను. అది ఈపాటికి వెళ్ళే ఉంటుంది.

కుమారగిరి పైకిచూచి— ‟ఓభగవంతుడా! ఇందు ఏమి రహస్యాన్నిమిడ్చావో? నీ ఇచ్ఛ ఏమి? అందుకు అను కూలంగా జరుగుతుంది”. అని తన పాదాలమీద పడియున్న చిత్రలేఖను పైకిలేవతీసి— ‟దేవి! నీకు దీక్షనిస్తాను. నన్ను భగవంతుడు సంసారిక వ్యసనములతో యుదార్థం చేయుమంటు న్నాడు—” అంటూవుండగా కుమారగిరిని విశాలదేవు పిల చాడు.

విశాలదేవ్ దగ్గర కొచ్చిన తరువాత- ‘‘విశాలదేవ్! నీవు చిత్రలేఖకు ఒకకుటీరం తయారుచెయ్యాలి.’’ అన్నాడు కుమారగిరి.

విశాలదేవ్ ముఖమున ఆశ్చర్యం అంకితమైంది. ఈర హాస్యం అతనికి బాగా తెలుసు. అతను చిత్రలేఖకు అభివందన మాచరిస్తూ- ‘‘దేవీ! మీకుసుస్వాగతము’’ అనిఒక అర్ధనిమీలిత దృష్టిని కుమారగిరివైపుకు పోనిచ్చాడు.

కుమారగిరి ఈచూపులోని అర్థాన్ని గ్రహించాడు.- ‘‘వత్సా! నీకాశ్చర్యముగా నున్నదా? నీవు నానిర్బలత్వాన్ని ఒకసారి చూచావు. అందువల్ల ఆశ్చర్యం కలుగుట సహజమే కాని నిర్బలత్వంమీద పోట్లాడి, విజయాన్ని సాధించడమే, మనుష్యుని కర్తవ్యమనేది జ్ఞాపక ముంచుకో! నేను భగవంతుడొక సత్యాన్ని నాకు ప్రబోధించాడు. వ్యసనాలతో పోరాటం సల్పటమే జీవితంయొక్క ఉత్కృష్టత దానినే నేను ఆచరించబోతున్నాను కాబట్టిచిత్ర లేఖకు దీక్షనివ్వతలంచితిని.’’

విశాలదేవ్ చిరునవ్వు నవ్వి—‘‘గురువుగారి కథనం సర్వదా వుచితమైనది. కుటీరంనే టిరాత్రియంతా తయారు చేయవలసి ఉంటుంది’’ అన్నాడు.

విశాలదేవ్ ని ఆచిరునవ్వు, ఆమాటలోని ధ్వని కుమారగిరికి క్రోధాన్ని కలుగు చేసినాయి. ‘‘కుటీరం తయారుచేయవలపసిన పనిలేదు. చిత్రలేఖ నాకుటీరంలోనే ఉంటుంది. తెలుసా? నానిర్బలతను పురస్కరించుకొని అపహేళనచేసే ఓ, నవయువకా! నేను నీగురువునని, నీకంటే ఉన్నతమైనవాడ

సని. జ్ఞాపకముంచుకో. సాధనలోనూ, తపస్సులోనూ, తపిం చినవ్యక్తి ఎంతబలవంతుడో నీకు చూపుతాను.» అని గర్జిం చాడు యోగి.

యోగిరుద్రరూపానికి విశాలదేవ్ భయకంపితుడైనాడు వెంటనే యోగి పాదాలమీదపడి- ‹‹గురుదేవ్! నా ఈ దుష్కృత్యానికి క్షమించండి నేను కుటీరం తయారుచేయడానికి పోతున్నాను.» అన్నాడు విశాలదేవ్.

‹‹వలదు ఇప్పుడు కుటీరం అవసరంలేదు... విశాలదేవ్! నెవొకపర్యాయంభ్రాంతిలోపడినీగురువుగార్ని వ్యంగ్యపర్చావు అందుకు తగినశిక్ష లభించింది. నీగురువులు ఇచ్చటకు పాప మంటే ఏమిటో తెలుసుకోడానికి నిన్నిక్కడకు పంపించారు. ఇప్పుడు నీకు పాపాన్ని చూచే అవకాశం లభించింది. నీవు పాపాన్ని పరికించు-- దాన్ని జయించడం గూడాచూడు. ఇంకనీవెళ్లొచ్చు. సంధ్యావందనానికి సమయం అయింది

విశాలదేవ్ వెళ్లిపోయినాడు. ‹‹దేవి! ఇప్పటిక్కడ జరి గింది. స్వప్నసమానం నేను దానిని విశ్వసించజాలను. అయిం దేదోఅయిపోయింది.అప్పుడప్పుడూ నాకు భయంకలుగుతుంది. అగ్నితో చెలగాటమాడ బోతున్నానా? అనిపిస్తున్నది» అన్నాడు చిత్రలేఖతో కుమారగిరి.

చిత్రలేఖ ముఖమీద మనోహరమైన చిరునవ్వు ఇటునటు పరుగిడుచున్నది. దేవా! మీరు నన్నుగురించి భయపడకండి. మీసాధనకూ, తపస్సుకూ, భంగంకలుగ చేసేదానను గానని దిలాసా ఇస్తున్నాను. నేను మిమ్ములను ప్రేమిస్తున్నాను.

ప్రేమంటే తాత్పర్యం సేమారహితమైన త్యాగం.మీసుఖమే నాసుఖంగా భావించుకొంటాను.»

««తథాస్తు!......» కుమారగిరి తనసమాధిమీద కూర్చున్నాడు. ««దేవీ! నీకొక కుశాసనం తయారు చేసుకోవాలి. కుశలములను విశాలదేవి నడిగి పొందవచ్చును. నాకు సంధ్యా సమాధి సమయమైంది.» అని కుమారగిరి నేత్రాలను మూసుకొన్నాడు.

## 12

బీజగుప్తుడు అకారణంగా మృత్యుంజయుని అవమానించాననుకొన్నాడు. రెండవరోజు ప్రాతఃకాలమున శ్వేతాంకుడు వచ్చినతరువాత అతనితో బీజగుప్తుడిట్లనెను ««శ్వేతాంక! మృత్యుంజయుడు ఇచ్చినవిందులో నేనుకొంచెం కఠినంగా మాట్లాడానను కొంటున్నాను. నేనేమన్నానో నాకేజ్ఞాపకం లేదు. నీవచ్చటనే ఉన్నావుకదా బహుశా నీకు జ్ఞాపకముండొచ్చు»

కొంచమాలోచించి శ్వేతాంకుడిట్లనెను. ««అయ్యగారు చెప్పిందాట్లో మరేమంత కాఠిన్యం కనుపించదు. ఇక మిగిలింది అవమానించడమనే విషయమప్ప తీవ్రంగానే జరిగింది. అన్యశ్రేష్టులు బహుశా అలానే భావించొచ్చు. ఇందుకు విచారమెందుకు? సత్యాం. సత్యమే. ఒకరి సిద్ధాంతం మరొకరికి విరుద్ధంగానే కనుపించవచ్చును.»

"కాదు, శ్వేతాంక్! నీవు పొరబడుతున్నావు. సత్యం. సత్యమే యైనప్పటికీ, ఇతరులకు నొప్పిని కలుగచేసేదిగా ఉండకూడదు. ఆమాటలనే ఇంకోపద్ధతిలో ప్రియంగా ఉండే టట్లు చెప్పగలం."

బీజగుప్తుకు మృత్యుంజయుని అవమానించానన్న విచారం మరేమంతగా లేదుగాని యశోధరకు కష్టం కలుగచేశానే మోననే విచారం అధికంగా భాధించుచున్నది. బీజగుప్తునకు యశోధర ప్రతిమ కండ్లకు కట్టినట్లు కనుపించుచుండెను యశోధర ప్రేమించ తగినది—ఆమె అమాయకత్వం—ఆప్రశాంత—స్వచ్ఛందత—సుధా సంచితమైన నేత్రాలు—సహజలజ్జ, తేజోవిభూషితమైన ఆ ముఖమండలము—ఇవన్నీ ఆగి ఆగి బీజగుప్తుని ఎదుట ప్రత్యక్ష నాట్యాంతొ్రుక్కుచున్నాయా? అనిపించుచున్నది. కాని అతడు యశోధరను ప్రేమించలేదు. ఏలయన చిత్రలేఖను గాఢంగా ప్రేమిస్తున్నాడు. చిత్రలేఖలోని మాదకత్వం యశోధరలోలేదు, చిత్రలేఖ హృదయం యశోధలో ఉన్నదో లేదో గూడా నిర్ణయించగలడు. చిత్రలేఖ స్వయంగా పత్ని కాకపోయినప్పటికీ అతనికి పత్నిసమానురాలు నర్తకియైయుండిగూడా అమె ప్రేమించగలదు. ధనంకోసం మాత్రంగాదు ఆమె కు సిరిసంపదలకు లోటులేదు కేవలం ప్రేమకొరకేనని చెప్పగలం. చిత్రలేఖతో ప్రథమ పరిచయం గలిగిన పుణ్యదినం బీజగుప్తునకు జ్ఞాపక మొచ్చింది చిత్రలేఖ—యశోధరలోనూ ఏరకమైన సమన్వయంలేదు. చిత్రలేఖ చాలా ఉన్నత మైనది. కాని యశోధరను గురించి

ఎందుకాలోచించుచున్నానా? అనే ఆశ్చర్యం అతనికి కలిగింది. బీజగుప్తుడు శ్వేతాంకునితో ఇలా అన్నాడు.

“శ్వేతాంక్! నేనన్న కర్కశవాక్యాలకు మృత్యుంజయుని క్షమాపణ వేడుకొనుటయే ఉచితం_ కర్తవ్యంగూడా”

“తమఇష్టం”

“నేనచ్చటికి వెళ్ళాలను కోవడంలేదు.” బీజగుప్తుడు యశోధరను మరవాలను కొంటున్నాడు. “నేనొక ఉత్తరం ఇస్తాను. అది మృత్యుంజయునికిమ్ము”

“చిత్తం,,

బీజగుప్తుడు మృత్యుంజయుని పేర ఒకఉత్తరం వ్రాసి శ్వేతాంకుని కిచ్చెను. ఉత్తరాన్ని తీసుకొని శ్వేతాంకుడు మృత్యుంజయుని భవనం చేరుకొని పహారా బంట్రోతుతో___ “ఆర్యశ్రేష్ఠులు ఇంటివద్దలేరా?” యనియడిగెను”

“ఏదోపనిమీద ఎచ్చటికో వెళ్ళారు. ఏపనిమీదొచ్చారు?”

“ఆయనకొక ఉత్తరం తెచ్చాను”

“నాకివ్వండి. నేనువారికిచ్చెదను”

“వీలులేదు. కేవలంవారికేఇవ్వాలి......వారి పుత్రిక యశోధరో?” అని అడిగాడు.

వెంటనే బంట్రోతు యశోధరకు ఆసూచనను అందజేశాడు. ఆమె శ్వేతాంకుని అతిథి భవనంలో కూర్చుండబెట్టింది. తరువాత కొంతసమయానికి యశోధర తిరిగి శ్వేతాం

కుని యొద్దకొచ్చింది. శ్వేతాంకుడు గౌరవంగాలేచి నిలబడి నాడు. యశోధర కూర్చుంటూ- "ఏంపనిమీద దయచేశారు?" అన్నది.

"బీజగుప్తుడు సామంతులు తమతండ్రిగారికి ఒక ఉత్తరం ఇచ్చారు—వారి సారథిగా దేవిగారి సముఖమునకు వచ్చితిని" శ్వేతాంకు అప్పుడు బీజగుప్తుని స్వామీ అని సంబోధించడం అనుచిత మనుకొన్నాడు.

"నాన్నగారు వస్తూనే ఉండొచ్చు ఎదురుచూడడం బహుశా తమకు కష్టంగాఉంటుందేమో?" యశోధర నైనాలు శ్వేతాంకుని నైనాలను పరామర్శించాయి. ఆనైనాలలో సంకోచం ఏమాత్రంలేదు. "పాటలీ పుత్రంలోని సర్వాసౌందర్యవతియైన దేవిగారి సముఖమున కూర్చుండుటలో యెవరికైనా కష్టంగా ఉంటుందా?" అన్నాడు శ్వేతాంకుడు.

యశోధర ఇలాంటి భాషను ఇంతకు ముందెన్నడూ విని యెరుగదు. వినే అలవాటుగూడాలేదు అందులోనూ ఇంతకు ముందే పరిచయం కలిగిన వ్యక్తితో! అయినప్పటికి మాట మధురంగానే యున్నది. యశోధర నైనాలు హాస్య మిశ్రితమై లజ్జతో కొంచెం క్రింది బంగాయి. ఆమె కపోలములలోని లాలిమ రెట్టింపుయైనది. శ్వేతాంకుడు వారి అథితి అథిని సత్కరించడం ఆమె ధర్మం. ఆర్యబీజగుప్తులను మీరు సంపూర్ణంగా ఎరిగియుంటారు? అన్నది

"అవును ప్రపంచములోని సర్వశ్రేష్ఠులలో ఆయన గూడా ఒకరని చెప్పగలను. ఇందులో అతియశయోక్తి లేదు"

“మరి నర్తకి చిత్రలేఖను గురించి మీ అభిప్రాయం?”

“ఆమె ఉన్నత శ్రేణికి చెందిన స్త్రీ. దేవతాస్వరూపగాలని కూడా చెప్పగలను సంపూర్ణ సౌందర్యాన్ని తెలుసుకోగలిగిన వారే ఆమెను తెలుసుకోగలరు.”

యశోధర నవ్వుతూ— “నేననుకున్నది వాస్తవమే తమ పేరు శ్వేతాంక్ కదూ?”

“అవును”

“ఆర్య శ్వేతాంక్! మరొక విషయం అడుగుతాను నిజంగా తమ గురువుగారు పాపమంటే ఏమిటో తెలుసుకోవడానికి బీజగుప్తుని యొద్దకు పంపారా? అందుకు వీరివ్యక్తిత్వా ఉపయుక్తమైన క్షేత్రమా?”

శ్వేతాంకుడు చిరునవ్వు నవ్వుతూ—“దేవీ! నిజమే. పాపాన్ని తెలుసుకోవడానికే నన్ను బీజగుప్తుని యొద్దకు పంపించారు. ఇంక మిగిలింది అందుకు ‘వీరివ్యక్తిత్వ మందుకు ఉపయుక్తమైన క్షేత్రమా’ అన్న విషయం. ఆ విషయంలో నేనూ సందిగ్ధ అవస్థలోనే యున్నాను. ఇంకో విషయంగూడా ఉన్నది. నా ఒక సహపాఠకుని ఇందు నిమిత్తార్థమే మా గురువుగారు కుమారగిరి యొద్దకు పంపించారు. అతడు నిన్నటి దినంలో కుమారగిరి వెంటనున్నాడుకూడా. ఇప్పుడు మీకు సహజంగా ఆశ్చర్యం కలుగుతుంది.”

వాస్తవంగా యశోధర తుళ్ళిపడింది.

“కాని ఆశ్చర్య పడనవుసరంలేదు దేవీ! మేము ఎవ్వరి యొద్దకు పంపించబడినామో వారే పాపులనే నిర్ధారణలేదు.

వారి సంపర్కంలోనికివచ్చే వారిలోగూడా లోపం కనుపించ వచ్చును. మరొక విషయం—పాపమంటే ఎలాఉంటుంది? అదెవరికి తెలుసు? మనం పాపమంటున్న దానినే మరియొకరు పుణ్యమంటారు. అంతే కాకుండా మనకు తెలియనటువంటి అనేక విషయాలు, అనేకమందికి పాపంగా కనుపించవచ్చు గూడా.»

ఈజవాబు ఆమెకు సంతృప్తి నివ్వలేదు. «ఆర్య శ్వేతాంక్! మనుష్యునిగుణ- గణములను చూచుటయందు ప్రాధాన్యత చూపుతున్నందుకు తమర్ని ప్రశ్నించిస్తున్నాను.»

ఇంతలో ఆర్య శ్రేష్టులు మృత్యుంజయుడు భవనంలో ప్రవేశించాడు. శ్వేతాంకుడు లేచినిలబడి అభివందన మాచరించాడు యశోధర లోనికేగినది.

మృత్యుంజయుడు శ్వేతాంకుని కూర్చోమని చెప్పి ఇట్లడిగెను. «నిన్న బీజగుప్తునివెంట విందుకు వచ్చినవారి సేవకుడవేనా?»

«అవును అయ్యాగారు తమకు ఉత్తరమిచ్చిరి.»

మృత్యుంజయుడు ఉత్తరాన్ని తీసుకొన్నాడు. ఉత్తరం చదువుట తోడనే ఆయన ముఖమున సంతోషం అంకురించినది «క్షమాప్రార్థన అవుసరంలేదని బీజగుప్తునితో చెప్పు. ఆయన యెడ నాకున్న సద్భావన అలానే ఉన్నది. మరొక విషయం. ఆయనకు ఏపని లేనియెడల ఇచ్చుట కొకపర్యాం దయచేయ మన్నామని చెప్పు సాయంత్రం భోజనముగూడా ఇచ్చుటనే చేయవచ్చును.... శ్వేతాంక్! నిన్నుగూడా ఆహ్వానిస్తున్నాను

వారివెంట తప్పకుండా రావాలి" శ్వేతాంకుని ముఖం పద్మంగా లాపివ్పారింది. "ఆర్య శ్రేష్ఠుల ఆజ్ఞ అనుసరణీయమైనదే. వారువస్తే తప్పకుండా వస్తాను. కాని వారిఆజ్ఞ లేకుండా రావడం ఎంతవరకు సమంజసమో చెప్పజాలను."

మృత్యుంజయుడునవ్వి—"శాంతము—గంభీరము—కర్తవ్య నిష్టతా, కలిగిన యువకుడవు నీవు—నీవంశము?తండ్రి గారిపేరు? నివాస మెక్కడ? అని ప్రశ్నించాడు.

నేను సూర్యవంశజుడను. నాతండ్రి గారిపేరు విశ్వపతి నానివాసం కోసలప్రదేశం."

"విశ్వపతి మీతండ్రిగారా?నివాసంకోసలప్రదేశమా? ఆయన కాశీలో చదువుకున్నారుకదూ?"

"అవునువారు కాశీలోనే చదువుకున్నారు."

"ఎంత ఆశ్చర్యం! విశ్వపతి నా సహాధ్యాయుడు. నీకు సుస్వాగతం నీవుపుత్రసమానుడవు."

తండ్రిగారికీ మృత్యుంజయునకూ ఉన్న పరిచయం విన్నతరువాత శ్వేతాంకుని కలిగినఆనందాన్ని ఎవ్వరూవర్ణించజాలరేమో? శ్వేతాంకుని హృదయంలో ఒక రకమైన ఆశరేకెత్తింది. యశోధరకూ తనకూ వివాహం జరగడంసంభవమేనేమో! అన్నంతవరకూ ఆలోచించాడు.

"అసంభవము" శ్వేతాంకునకు తెలుసు. తండ్రిగారి వైభవమంతా శిథిలమైంది. కనుకనేవారు గ్రామజీవితమును గడుపుతున్నారు. ఆయన ఉచ్చకులీనుడే. అయితే మాత్రం?... మృత్యుంజయుడు తన తండ్రిగారికంటే ధనంలోపెద్ద— వైభ

వంలోపెద్ద—అధిక శక్తిశాలుడు వీటినిమిషాలలో యిస్తే వీయ్యా నికి తావేలేదు అయినప్పటికీ శ్వేతాంకుని ఆశ పూర్తిగా అంతరించలేదు.

శ్వేతాంకుని మౌనం చూచి మృత్యుంజయుడిట్లనెను. "శ్వేతాంక్! అనుమానిస్తున్నావా? ఈభవనాన్ని నీదిగా భావించు అయితే మీతండ్రి నీవిక్కడ నున్నట్లు తెలియపర్చ లేదేమో? యని ఆశ్చర్యపడుచున్నాను."

కారణంవారు ప్రస్తుతం వానప్రస్థావన జీవితం గడపు టయే. మంచిది! ఆర్యశ్రేష్టులు శెలవువివ్వండి."

"భోజనం వేళైంది. ఇక్కడే భోజనంచెయ్యి సందే హించకూ.

శ్వేతాంకుడు చిరునవ్వుతో ఇట్లనెను—"ఆర్యశ్రేష్టా సందేహ మేమీలేదు. కాని ఇప్పుడునేను ఆర్య బీజగుప్తుని సేవకుడను, వారి అనుమతిలేకుండా ఏపనీచేయజాలను శెలవు నివ్వండి—ఆలస్య మౌతుంది. ఆర్య బీజగుప్తులునాకై ఎదురు చూచెదరు."

"సజ్జనా! నీకర్తవ్యం నీకు బాగాతెలుసు. ఇందుకు సంతోషించు చున్నాను. కాని బీజగుప్తునితో ఈవిషయం మరువక చెప్పవలయునుసుమా!"

శ్వేతాంకుడు తిరిగివచ్చి, మృత్యుంజయుని ఆహ్వానం సంగతి బీజగుప్తునితో చెప్పెను, బీజగుప్తుడువిని—"నాకు ఆహ్వానమా? నేను వెళ్ళడం బాగుంటుందా అని అన్నాడు.

ఈవిషయమునుగురించి బీజగుప్తుడుదాదాపు మధ్యాహ్నం వరకూ ఆలోచిస్తూనేయున్నాడు. ఏం అచ్చటి కెందుకువెళ్ళకూడదు? బీజగుప్తుని మనంబున ఈప్రశ్న ఉత్పన్నంబయ్యెను వెళ్ళడం అనుచితమేనేమో నన్న సందేహంగూడా కలిగింది. అందుకు సకారణంమాత్రం చూపలేకున్నాడు. చాలా తర్జన భర్జన చేసుకొన్నమీదట మృత్యుంజయుని గృహమున కేగుటయే మంచిదని నిశ్చయించుకొన్నాడు. సాయం సమయమున శ్వేతాంకునితో నిట్లనెను ,,నేను ఏ పెద్దల ఆహ్వానాన్ని తిరస్కరించ తలంచలేను" అతను మనస్సులో యశోధరను మరొకసారి చూచి, ఆమెతో సంభాషించాలనే అస్పష్టభావన లేచింది.

రాత్రి సమయమునకు బీజగుప్తుడు శ్వేతాంకుని సహితంగా మృత్యుంజయుని గృహమునకు చేరుకొనెను. నేడు మృత్యుంజయుని భవనంలో ఆనాటి ప్రకాశంలేదు అచ్చటి వాయుమండలమంతా ప్రశాంతముగా నుండెను. మృత్యుంజయుడు బీజగుప్తునకు స్వాగతమిచ్చి, విశ్రాంతి భవనంలోనికి తోడ్కొని పోయెను. యశోధర ముందుగానే అచ్చటకు వచ్చి వీరిరాకకై నిరీక్షించుచుండెను.' అందరూ తమ తమ ఉచితాసనము లధిష్టించిరి.

,,ఆర్యా బీజగుప్త! అనవసరంగా క్షమాపణపత్రాన్ని పంపినారు" అని ముందుగా మృత్యుంజయుడే వార్తాలాపము ప్రారంభించెను.

,,ఆర్యశ్రేష్టా! తనతప్పును తానొప్పుకోవడం మనుష్యునికనీస కర్తవ్యం"

మృత్యుంజయుడు నవ్వుతూ– “మీ సేవక శ్వేతాంకుడు, నాసహాధ్యాయుడైన విశ్వపతి పుత్రుడు నాకీరోజునే తెలిసింది” అంటూ శ్వేతాంకునివైపుకు చూచెను.

“ఆర్యశ్రేష్టా! శ్వేతాంకుడు కేవలం నా సేవకుడు కాదు. సహాధ్యాయుడు. సోదరతుల్యుడు”

“చాలా ఆలస్యం చేశారు?”

“అవును. కాశీనుండికొందరతిథులు వచ్చారు”

“కాశీ చాలాఅందమైన ప్రాచీన నగరమంటారు. తమరు కాశీ దర్శించారా?” అని అందుకున్నది యశోధర.

బీజగుప్తుడు నవ్వుతూ– “నాజీవిత ఆనంద కాలం కాశీలోనే గడచింది. నాగురువుగారైన మహాప్రభూ రత్నాంభరుని నివాసస్థానం మొదట కాశీయే! దేవీ యశోధరా! కాశీ ఇచ్చటకు చాలాదగ్గర నేను సంపూర్ణ ఉత్తర భారతయాత్ర చేశాను” అన్నాడు.

“అయితే తమరు హిమాలయ పర్వతాన్ని గూడా దర్శించారా?”

“అవును, హిమాలయపర్వతాన్ని హిందూకుశ పర్వతాలను గూడా దర్శించాను. ప్రాకృతిక దృశ్యాల గొప్పతనం పూర్తిరూపంలో పర్వతాలప్రదేశంలోనే కనబడుతుంది” తరువాత బీజగుప్తుడు మృత్యుంజయునితో ఇట్లనెను– ఆర్యశ్రేష్టా ఎన్నంటికీ మరపురాని అద్భుత ఘటనలను చూచాను వాస్తవంగా అబ్బురపడని వారెవరూ ఉండరు.

యశోధర కుతూహలంగా—,,ఆఘటన లేమిటో మాకుగూడా వినిపించండి!" అన్నది.

,,తప్పకుండా వినిపిస్తాను" బీజగుప్తుడు చెప్పనారంభించాడు. ,,పదిసంవత్సరాల నాటిమాట అప్పుడు నేను విద్యార్థిని మహాప్రభూ రత్నాంభరుని వెంట దేశయాత్రకు బైలుదేరాను పెద్ద పెద్ద నగరములను, ఉపవనములను, దాటుతూ, గంగానది ఒడ్డున నడుస్తూ నడుస్తూ మేమిద్దరము హరిద్వారం చేరుకొన్నాము. అచ్చట సమతలభూమి కనుపించలేదు. ఆకాశం వైపుకుఅరుగిలుసాచుకొనియున్న పర్వతశిఖరములు మాయెదుట నిలబడియున్నవి. ఇంక ముందేమున్నది. అని నేను మహాప్రభు రత్నాంభరుని అడిగాను. ,,అజ్ఞాత ప్రదేశం, అని వారు జవాబు చెప్పిరి. గంగానది యొడ్డున ఒక వ్యక్తి కూర్చునియున్నాడు. వాడు మాగురువుగారి మాటలను వినెను కాబోలు ,,ఏమన్నావు? అజ్ఞాత ప్రదేశమున్నదా? నిజమే ఆ అజ్ఞాతప్రదేశమే దేవతల నివాసస్థానం. ఆపర్వత ప్రదేశంలోనే కైలాసమున్నది. అచ్చటే అప్సరసలు, గంధర్వులు. నాట్యాలు జలక్రీడలు సలుపుతూ ఉంటారు. ఇంతవరకూ చెప్పడం నాకర్తవ్యం గనుక చెప్పాను" అన్నాడు ఆకూర్చున్నవ్యక్తి. ఆమాటలను విన్నతరువాత మాగురువుగారి ముఖంవంక చూచాను. వారిముఖమున అవిశ్వాస సూచకమైన చిన్నని నవ్వొదయించింది. కాని అనుభవ రహితుడనైన నాకు ఆకల్పన అంతా యదార్థముని తోచింది. ,,అంతా నిజమై యుంటుంది ప్రభూ! అచ్చటకుపొతే ఏమైనా ఆపద కలుగుతుందా? అని అడిగాను కుతూహలంగా ,,లేదు. నీవు వెళ్ళతలంచినచో నేను సిద్ధంగానే యున్నాను" అన్నారు మాగురువుగారు.

మేమిద్దరం ఇంకా కొంతముందుకు సాగి పొయ్యాము. ఆ ప్రకృతి సౌందర్యాన్ని తిలకించడానికి నాకీకండ్లుచాలలేదు. వనములో రంగు రంగుల పుష్పాలు వికసించి ఉన్నాయి. ప్రాతీయ పవనం ఆఘ్రాపొదలలో అలలు కొడుతుంది. పక్షులు కుహు...కుహు...అని గొంతెత్తి పాడుచున్నది. అన్నివైపుల శాంతి సామ్రాజ్యం వ్యాపించియున్నది. అచ్చట కోలాహలంలేదు. కేవలం అచ్చట ఒకదానిని మించి ఒకటిపైకి పెరిగియున్న పర్వత శిఖరములున్నవి. అచ్చటచ్చటా చిన్న చిన్న గ్రామాలుగూడా కనుపించాయి. అచ్చట నివసించేవారు ఎర్రని రంగు గలిగి యున్నారు. వారు పకపకా నవ్వుతారు! అచ్చటి స్త్రీలు అందమైనవారు. వారు రంగు రంగు వస్త్రాలను ధరించి ఉంటారు, చక్కని పాటలుగూడా పాడతారు. వారిలో లజ్జగాని సంకోచంగాని లేదు. నేను యువకుడను కాబట్టి సహజంగానే సమ్మోహితుడనయ్యాను. ఆస్త్రీలు గుంపులుగుంపులుగా మధురాతిమధురమైన గీతాలు పాడుకొంటూ వుంటారు వారిభాష నాకు తెలియలేదుగాని, వారు పాడేది కవిత్వ మయమైందని, విషయం ప్రేమను గురించని తెలుసుకొన్నాను. ఇదే అప్సరసల ప్రదేశమనుకున్నాను. మేము మరికొంత ముందుకు సాగిపొయ్యాం. ఈసారి గ్రామాలు దగ్గర దగ్గరగా కనుపించడంలేదు. చల్లదనం అధికమైంది. పండ్లు చాలా తక్కువగా లభించు చున్నాయి. ప్రాతఃకాల సమయమున మేము ఒక బంగారు పర్వతాన్ని చూచాము. నేను పిచ్చివానివలె ,,గురుదేవ్! అదుగో! సమేరు పర్వతం" అని అరచాను. మహాప్రభువులు నా తెలివి తక్కువ తనానికి నవ్వి ,,అదే హిమాలయ పర్వ

తను. హిమం మీద సూర్యకిరణాలు పడడంవల్ల అలా మెరుస్తున్నది. దానిని చూచి బంగారమని భ్రమించావు" అని చెప్పారు. నా తెలివి తక్కువ తనానికి సిగ్గుపడ్డాను. మరికొంత ముందుకు పొయ్యాము. అచ్చటి భూమంతా మంచుమయంగా నున్నది. మా శరీరాలుగూడా చలికి ముడుచుకపోసాగినాయి. మాగురువుగారు తిరిగి పోదామన్నారు. కాని నేను సాహసించాను. "మహాప్రభూ! ఆమంచుతో కూడినపర్వత క్రిందిభాగము వరకైనా వెళ్లి చూద్దాం" అన్నాను. కొంచెం ముందుకుపోగానే మాకొక కుటీరం కనుపించింది. అందులో ఒక స్త్రీ కూర్చుని ఏదియో ఆలోచించుచుండెను. నన్నుమ్మల చూచిలేచి నిలబడి, స్వాగతమిచ్చింది. మాగురువుగారు ఆస్త్రీని ధ్యానంగా చూచి, నా చెవిలో ఇట్లు మెల్లగా చెప్పిరి. "ఇది అపదలకు నిలయం. మనం మరలిపోవాలి" అస్త్రీ నవ్వి— "వృద్ధ అధితుల అనుమానం అక్షరాలనిజం కాని ఇంతవరకూ వచ్చారు. ఇచ్చటి విషయాలు తెలుసుకోవడం గూడా మంచిదే. ఇచ్చటవింతవిశేషము లనేకము లున్నవి" అన్నది. మహా ప్రభువులు ఆమె మాటకు కాదనలేక పొయ్యారు. కొంచెం ముందుకు వెళ్లి ఒక మంచుబండమీద కూర్చునియున్న ఒకయోగిని చూచాము. వాని జటలు చిరు పాదములనంటి యున్నవి. గోళ్లు సింహగోళ్లును బోలియున్నవి. మావంక యోగి తదేక ధ్యానంగా చూచాడు. మేము వెళ్లి నమస్కరించాము. ఆయన మమ్ముల నాశీర్వదించి సమ్ముఖమున కూర్చుండబెట్టుకొని "ఎన్నిరోజులకు పురుషులను చూడగలిగాను.?—అని ఒకనిట్టూర్పును విడచినారు. యోగి

ముఖమున ఖషాదము కరుణ స్పష్టంగా కనుపించు చున్నది. "దేవా తమరు దుఃఖితులా?" అని మహాప్రభువులు అడిగారు. "అవును దుఃఖితుడను— సుఖవంతుడను గూడా!" అంటూ వారు వెనకవైపుకు సంకేతం చేశారు.

మేము వెనుతిరిగి చూచి భయకంపితులమయ్యాము. వెనుక మెట్లమర్చబడిన ఒక రక్తపు కుళ్లాయిఉన్నది. దానినుండి దుర్గంధంవస్తున్నది. "తమరు ఈ స్థానమును ఏల త్యజించురు?" అని మాగుకుపుగాగ ప్రశ్నించారు. "ఈ స్థలమును త్యజించాలనే ఉంటుంది. కాని త్యజించలేకుండా ఉన్నాను.— ఎన్నో సార్లుప్రయిత్నించాను— అంతావ్యర్థమేఅయింది... ఉస్సూ..." అని జవాబిచ్చాడు ఆ యోగి ఆ తరువాత జ్ఞానాన్ని గురించి, ఉపాసనను గురించి, సాధనలోని మహాత్మ్యాన్ని గురించి వారు మాకు సవిస్తారంగా వినిపించారు. వారు ఉన్నత కోటికి చెందిన విజ్ఞానవంతులు. దుర్గంధాన్ని భరించి గూడా మేము ఎన్నో గంటలు వారి మాటలను వింటూ ఉండిపోయాము. ఇంతలో సాయంసమయమైనది. "సమయమైనది" బిగ్గరగా అరచి, అతివేగంగా ఆరక్తపు కుళ్లాయివైపుకు అని యోగి పరుగెత్తాడు. మేము కుతూహలంగా ఆయనను అనుసరించాము. యోగిపిచ్చివానిలాగా ఆరక్తపు కుళ్లాయిలోదుమికాడు. ఆశ్చర్యం ! వెంటనే ఆరక్తం నిర్మల మైన, స్వచ్ఛమైన జలంగా మారిపోయింది. అందలి క్రూరజంతువులు సుందరమైన కమలములుగా మారిపోయినాయి. ముందుగా మేము కుటీరంలో చూచిన స్త్రీ యోగితో కలసి కుళ్లాయిలో కనుపించింది. ఆ స్త్రీ యోగితో జలక్రీడలు సలుపుచున్నది. ఆ స్త్రీ

ఎకటంగా నవ్వుతూ— "మూర్ఖుల్లార ! నిలబడి ఏం చూస్తున్నారు? రండి ఇచ్చట స్నానమాచరించి సుఖమనుభవించండి అన్నది. నాకు స్నానం చేయాలనే కుతూహలం కలిగింది. వస్త్రాలను గూడా విడవ నారంభించాను ఇంతలో మా గురువు గారు నా చేయిని పట్టుకొని గట్టిగా గుంజకొంటూ తీసుకపోసాగిరి. నేను విడుపించు కోవడానికి చాలా ప్రయత్నించాను. కాని విడిపించ లేక పోయ్యాను. మేము పరుగెత్తుకుంటూ వచ్చిన మార్గాననుసరించాము. "వత్సా! మనం రక్షింప బడ్డాము. అందుకు భగవంతునకు ధన్యవాదాలర్పించు! అన్నారు. తరువాత మా గురువుగారు అప్పటినుంచి ఆమె అందమైన చిత్రం నాకండ్ల ఎదుట నాట్యమాడుతూనే ఉండేది.

"దాని రహస్యం ఎప్పుడైనా మహాప్రభువులు చెప్పారా?" అని అడిగింది యశోధర.

"లేదు. వారు కేవలం" ప్రపంచములో మనం తెలుసుకోలేనటువంటి విషయాలనేకములున్నాయి" అని మాత్రం చెప్పారు.

తరువాత అందరూ భోజనాగారములోనికేగిరి. నేను యశోధరకు ఒకప్రక్క బీజగుప్తుడు, మరియొక ప్రక్క శ్వేతాంకుడు కూర్చున్నారు. భోజనం చేస్తూ యశోధర బీజగుప్తునితో— "ఆర్యా! తమ కథ అపూర్వమైనది. దానిని వినగానే, నాకు కూడా అలాంటి విలక్షణమైన వాటిని చూడాలనే కుతూహలం కలుగుతుంది" అన్నది.

బీజగుప్తుడు నవ్వుతూ— "దేవీ! మనుష్యుడు అనుభవాన్ని స్వయంగా పొందజాలడు. పరిస్థితులు మానవునకు అనుభవాన్ని కలుగచేస్తాయి" అన్నాడు.

శ్వేతాంకుడు యశోధరతో ముచ్చటించే సమయం కోసం ఎదురు చూస్తున్నాడు. "దేవీ! సమస్త జీవులు అనుభవం పొందడానికే పడిఉన్నాయి" అన్నాడు.

యశోధర ముఖంలో విచిత్రమైన భావం అంకితమైంది. "నిజమే! ప్రతి అల్పజీవుని, ప్రతిక్షణం ఎంత అమూల్యమైనది! ఈజీవితాల అమూల్యసమయాన్ని వృధాపుచ్చడం చెడుగదా?"

"మన ప్రతిఒక్క కర్మలోనూ ఒకఅజ్ఞాతశక్తి సహాయమున్నది. ఆ శక్తి ఇచ్ఛానుసారం అన్నీ జరుగుతుంటాయి. ప్రస్తుత ప్రపంచంలో రెండెరెండు మతాలున్నాయి. ఒకటి జీవితాన్ని కల్లోలమయం చేస్తుంది. రెండవది జీవితాన్ని శాంతికి ఒక పెద్ద కేంద్రంగా తయారు చేస్తుంది. రెండు వైపులనుండి వచ్చే తర్కం అందంగానూ, పటుతరంగాను ఉంటుంది. ఏది యథార్థమో? ఏది మిధ్యో? నిర్ణయించడం చాలా కఠినం" అన్నాడు మెల్లగా బీజగుప్తుడు.

యశోధరమీద బీజగుప్తుడు తన ప్రభావాన్ని ప్రసరింపచేసినంతగా, శ్వేతాంకుడు ప్రసరించలేక పోతున్నాడు. అతడు తిరిగి మరొకసారి సాహసించాడు. "దేవీ! యశోధర! మనుష్యునకు సుఖమయ జీవితం అవసరమైయుండికూడా, అతనిలో ఒక రకమైన కోలాహలం ఉండాలి— ప్రేమ మనుష్యునకు నిర్ధారితమైన లక్ష్యం— కంపనం— దానిలోని సుఖం—

తాపం... తృప్తి... ఇవే ప్రేమయొక్క లక్ష్యాలు. జీవితానికి ప్రేమ ప్రధానం. ఒకరి ఆత్మను ఒకరు అర్థం చేసుకోవడం, జీవితానికి ముఖ్యావసరం— ఒకరు మరియొకరియెడ గాఢమైన సహానుభూతి చూపడం. ఇరువురి అస్తిత్వాన్ని ఒకటిగా చేసుకొనుటయే. ప్రేమయొక్క సుందర లక్ష్యం."

యశోధర శ్వేతాంకుని తేరిపార జూచింది. ఇద్దరి నైనాలు కలసిమెలసి పరామర్శించుకున్నాయి. శ్వేతాంకుని శరీరం పులకరించింది. ఎప్పటివరకూ యశోధర శ్వేతాంకుని చూస్తూఉందో చెప్పజాలం. బీజగుప్తుడు నవ్వుతూ— "ఇదే జీవితం" అన్నాడు మెల్లగా.

యశోధర దృష్టి అగస్మాత్తుగా శ్వేతాంకునుండి తొలగింది. ఆమె ముఖం తెల్లపోలేదు సరిగదా, పైపెచ్చు కందగడ్డలాగా ఎఱ్ఱబారింది. శ్వేతాంకుడు భయభ్రాంతుడై ముఖాన్ని క్రిందికి దించాడు— .

# 13

యశోధరలో ఆకర్షణఉంది.— అది ఎంత అందమైనది.— ఎంత మనోహరమైనది.! యశోధర సమక్షమున కూర్చుని మనుష్యుడు పవిత్రంయొక్క ప్రతిమూర్తిని చూడగలడు. పవిత్రుడు కూడా కాగలడు— అయినప్పటికి బీజగుప్తునకు సుఖంలేదు— సంతోషంలేదు— యశోధర వ్యక్తిత్వంలోని వాతావరణం బీజగుప్తునకు అనుకూలమైనది గాదు. యశోధర అభేద్యమైన గంభీరంలో ఒకజీవిత సమస్య దాగియున్నది.

స్పష్టమైన, నిశ్చలమైన, పవిత్రమైన సాధన, ఆమె కవిత్వరహిత మైన వార్తాలాపంలో ద్యోతక మగుచున్నది. దానిని బీజ గుప్తుడు ఆదరించగలడుగాని, ఆచరించలేడు.— తనలో లీనం చేసుకోలేడు—

యవ్వనం కోలాహల జనితమైన జీవితాన్నే కోరుతుంది క్షణ క్షణానికి కష్టాలనే వెదుకుతుంది. వీటినే అనుభవించుతుంది యవ్వనం తన అస్థిత్వాన్ని స్పష్టరూపంలో ఉంచుకోచూస్తుంది తనవ్యక్తిత్వాన్ని నాశనం చేసుకోగోరదు. యవ్వనం ఎప్పుడూ ప్రభావి శాలియైన, ప్రభావంతుడై, పిస్పష్టంగా ఉండే వ్యక్తినే కోరుతుంది. వివిధ శక్తుల సంఘటిత రూపాన్నే విప్లవ మంటారు. ఆస్థితిననుసరించి ఆ శక్తులన్నీ ఏకమౌతాయి. ఆ శక్తులు విడివడి పోవడంగూడా జరుగుతుంది— వాటికి కూడా ఎప్పటికైనా వృద్ధాప్యం తప్పదు.—

కనుక బీజగుప్తుని హృదయంలో, యశోధర స్మృతి భయమిశ్రిత సుఖంగాను, భ్రమమిశ్రిత అనురాగంగాను,— జీవిత హీనమైన ప్రేమ రూపంలో ఉన్నది.

నిజంగా యశోధర, హృదయమందిరములో ప్రతిష్టించు కొని పూజింపతగిన ప్రతిమ ఆమెలో నారిత్వమున కుండ వలసిన, ఆదర్శయుక్తమైన పవిత్రత, స్వచ్ఛందం ఉన్నది. ధర్మ విశ్వాసానికి ఆమె ప్రతిమూర్తి యశోధరలోని శాంతియుత మైన, నిర్మలమైన సుఖలో సీతలత్వంవున్నది. బీజగుప్తుడు కోలాహలమైన జీవితాన్ని కోరుతున్నాడు. తన ప్రతినరం లోనూ ఉష్ణరక్త ప్రవాహాన్నే కోతురుతున్నాడు. ఇందువల్ల బీజగుప్తుడు యశోధరను తన జీవితంలో చేర్చుకోగోరుటలేదు.

ఒకపర్యాయం మధుపానమును సేవించి దానిలోని నిషాను చవిచూచిన వ్యక్తి దానిని విడువ జాలడు. బీజగుప్తుడు చిత్రలేఖను ప్రేమిస్తున్నాడు. ఆమెను విడువడం అసాధ్యమైన విషయం

బీజగుప్తుడు తన భవనానికి వచ్చేసరికి చిత్రలేఖ వ్రాసిన ఉత్తరం దొరికింది. ఉత్తరము సాదాగాను- సాఫీగాను చాల చిన్నదిగాను ఉన్నది. కాని ఆ చిన్న ఉత్తరంలో, జీవితానికి సంబంధించిన ఒక పెద్దగాథ ఇమిడియున్నది. ఆ చిన్న ఉత్తరమే మనోవిజ్ఞానంతో కూడిన ఒక పెద్ద గ్రంథం. ఉత్తరం ఈ ప్రకారం వ్రాసియున్నది

పూజ్య !,

ఎన్నడూ, ఎప్పుడూ, ఆసించియుండనటువంటికార్యాన్ని నేడు నేను చేయబోతున్నాను. నేను మిమ్ముల ప్రేమించాను- ఇప్పుడుకూడా ప్రేమిస్తున్నాను ప్రేమలో ఒక మహా గొప్ప త్యాగం ఉంటుంది. అత్యాగాన్నే నేను చేస్తున్నాను. నేను మీ జీవితాన్ని నిరర్థకం చేశాను— నా ప్రేమ ఒక యోగ్య పురుషుని కర్తవ్య విముఖునిగా చేసింది. అందుకు ప్రాయిశ్చిత్తం చేసుకొంటుంన్నాను. భోగవిలాసములకు తిలాంజలినిచ్చి, సంయమపాలనే ఉచితమను కొంటున్నాను— ఇందుకు యోగి కుమారగిరివద్ద దీక్షపొందుతున్నాను. మీరు వివాహం చేసుకొండి. మీకిష్టం లేకపోయినా, నా అనురోధాన్ని పాటించియైనా చేసుకోవాలి. నేను ఉండగా మీరు వివాహం చేసుకొనరని నాకు తెలుసు కనుకనే మీనుండి వేరుపడాల్సివచ్చింది. మిగిలింది నేను. నేను విధవను. ప్రేమచే కర్తవ్య భ్రష్టురాలై

నాను. మరొకసారి కర్తవ్యాన్ని పాలిస్తాను— వైధవ్య— సంయమపాలనను మరొకసారి పాటించ ప్రయత్నిస్తాను."

ఇట్లు,

మీ చిత్రలేఖ.

బీజగుప్తుడు ఉత్తరాన్ని చదివాడు. చేతులు వణక పోయినాయి ముఖముకాంతి విహీనతను చెందింది. హృదయం కొట్టుకోనారంభించింది. ఆ ఉత్తరాన్ని శ్వేతాంకునకిచ్చి, బీజగుప్తుడు ముఖమును కప్పుకొని శయనాగృహాని కరిగెను.

అతనికి ఏం జరుగుతుందని భయంగానున్నదో సరిగ్గా అదే జరిగింది. "చిత్రలేఖా—! కుమారగిరి—! ఎంత విచిత్రమైన సంయోగం! "అసంభవం!— వీరిద్దరూ దీర్ఘకాలం కలసి ఉండలేరు" అని బిగ్గరగా అరచాడు బీజగుప్తుడు.

అయితే దీనివల్ల జరిగే పరిణామమేమిటి? సంభవమో? లేక అసంభవమో?. బీజగుప్తునకు ప్రయోజనం ఏమిటి? చిత్రలేఖ కుమారగిరి వైపుకు ఎందుకు ఆకర్షించబడింది? ప్రేమంటే ఇదేనా? "ఆత్మిక సంబంధంగూడా అస్థిరమే. ఆత్మసంబంధం అనాదిగాదు బీజగుప్త!" అన్న చిత్రలేఖ వాక్యంలో యదార్థం ఉందా? ఈ ప్రశ్నవళియే బీజగుప్తుని ఎదుట నున్నది.

చిత్రలేఖ బీజగుప్తుని ప్రేమించుట లేదని విషయం ఎక్కడ ఉన్నది?— ఉత్తరం ఈ విషయాన్ని తెలుపుట లేదు. ఉత్తరంలోని విషయం వేరొకటి. స్వచ్ఛందమైన ప్రేమను చిత్రలేఖ త్యాగము – బలిదానము చేయుచున్నదనే విష

యాన్ని తెలుపుతుంది ఉత్తరం. బీజగుప్తుని సుఖం కోసమే ఆమె అట్లు చేస్తున్నది. ఆమె యెడ కలిగిన అవిశ్వాన్ని. బీజగుప్తుని హృదయం ఈ రకంగా దూరం చేసింది. చిత్రలేఖ దేవతా సమానురాలు. కాని ఆమె పొరబాటు చేసింది— భయంకరమైన పొరబాటు చేసింది. బీజగుప్తుడు వివాహం చేసుకోవడం అసంభవము— అతడు చిత్రలేఖనే ప్రేమిస్తున్నాడు. ప్రేమకు వివాహానికి ఘనిష్ఠసంబంధమున్నది.

బీజగుప్తునకు నిద్రపట్టలేదు. లేచి కూర్చున్నాడు. అప్పటికి అర్ధరాత్రి గడచింది. భవనం బైటకు వచ్చాడు. కుమారగిరి కుటీరంవైపుకు కాలినడకనే బైలుదేరాడు.

కుమారగిరి కుటీరంలో చిన్న దీపం మిణుకు మిణుకు మంటుంది. కుమారగిరి తన ఆసనము మీద ధ్యానావస్థితుడై కూర్చొని యున్నాడు. చిత్రలేఖ ఒకమూలన కుశాసనంమీద పడి నిద్రించుచున్నది. బీజగుప్తుడు చిత్రలేఖను ఇంతకు పూర్వం వైభవోపేతమైన ప్రకాశంలో మెరుస్తూ ఉండగా చూచాడు. ఇప్పుడో! శాంతి ఛాయలో నిర్మలంగా ఉండుట చూచెను. చిత్రలేఖ శరీరంమీద ఆభూషణాలు లేవు — వెంట్రుకలు చిక్కుపడి యున్నవి. చంచలత్వం లేదు— ఆమె తన స్వప్న లోకంలో శాంతియనే దేవి చరణములమీద పడియున్నదా యన్నట్లు ఆమె ముఖమున శాంతియుతమైన మధురచిరునవ్వు శుశోభితమై యుండెను. బీజగుప్తుడు చిత్రలేఖ శిరముపక్క కూర్చుని ఆమెను తదేకధ్యానంగా చూచుచుండెను.

వేకువ ఝామైంది. కుమారగిరి సమాధిని విడిచాడు. చిత్రలేఖ నేత్రాలను తెరచింది. ఇద్దరూ ఒక్కసారిగా బీజగుప్తుని చూచి ఆశ్చర్యంగా "అరే! బీజగుప్త! అని అన్నారు.

కుమారగిరి విస్మయుడైనాడు.

చిత్రలేఖ భయభ్రాంతురాలైంది.

బీజగుప్తుడు కుమారగిరికి నమస్కరించాడు — చిత్రలేఖగూడా నమస్కరించింది — కుమారగిరి ఆశీర్వదించాడు. చిత్రలేఖ నేత్రాలను గట్టిగామూసుకున్నది.

బీజగుప్తుడు మెల్లగా "చిత్రలేఖా!" అన్నాడు

"బీజగుప్త!"

బీజగుప్తుడేమేమో చాలా చెప్పాలని వచ్చాడు. కాని అంతా మరచాడు. తుదకు ఎంతో సాహసించి "చిత్రలేఖా! నీవు పూర్తిగా నిర్ణయించుకొన్నావా?" అన్నాడు.

చిత్రలేఖ ఏదో పెద్దనేరం చేసిందానివలె సిరవొంచింది ఆమె నైనాలువెంట రెండు అశ్రుభిందువులు రాలినాయి. "బీజగుప్త! ఇప్పుడు మీరుచూస్తున్నదేనా అంతిమనిర్ణయం" అన్నది మెల్లగా.

"తిరిగి ఆలోచించే అధికారం నీకున్నది — నిర్ణయించే ముందు నన్ను అడగవలసిన అవుసరంలేదా? నీ హృదంలోని మాటలను నాతోచెప్పలేనంత వేరుగా నన్ను అర్థం చేసుకొన్నావా? చిత్రలేఖా! ప్రేమ రెండవవానిలోని భేదభావాన్ని చూడదు. ప్రేమ ఇద్దరి వ్యక్తుల అభిన్నతకు ద్యోతకము. నీ ఈ నిర్ణయంవల్ల నేను వివాహం చేసుకొంటానను

కొంటున్నావు. అది చాలా పొరబాటు. నీవు ఈ నిర్ణయంవల్ల నన్ను సుఖపెట్టలేవు — నేను నిన్నే హృదయ పూర్వకంగా ప్రేమించాను. అన్య స్త్రీలను ప్రేమించజాలను. నా వివాహం అసంభవము ''

చిత్రలేఖ బీజగుప్తుని పాదాలమీద పడకుండా ఉండ లేక పోయింది. తిరిగి బీజగుప్తుని వెంట వెళ్లాలనుకుంది. కాని వెంటనే ఆగిపోయింది. ఆమె చాలా ముందుకు సాగి వచ్చింది. వెనుదిరగడం అసంభవం బీజగుప్తుని పాదాల మీదనే వెక్కి వెక్కి ఏడవ సాగింది— బీజగుప్తుడు ఆమెను పైకి లేవతీసి నాడు. చిత్రలేఖ కొంచెము తేరుకొని — '' బీజగుప్త! మీరు పూజ్యులు. మానవులు కారు — నిజంగా దేవతలు! మిమ్ము నేనెరుగుదును. నేను ప్రేమించి మీ జీవితాన్ని ఎందుకూ కాకుండా చేశానని గూడా నాకు తెలుసు. మీ వివాహం తప్పక జరగాలి — మీరు నన్ను ప్రేమిస్తున్నారు... నాకు సుఖాన్ని చేకూర్చడమే మీ కర్తవ్యం. మిమ్ములను వివాహి తుణ్ణిగా చూచినప్పుడే నాకుసుఖం. మీరు వివాహంచేసుకొండి ... నేను మిమ్ము ఎప్పుడూ ప్రేమిస్తూ ఉంటాననేది విస్మరించ వలదు. ప్రేమప్రధానం శరీరక భోగవిలాసాలేనా? నేను కేవలం శారీరక సంబంధాలనే త్యజిస్తున్నాను. ఇప్పుడు మన ఆత్మక సంబంధం మరీ గట్టిపడుతుంది ''

'' చిత్రలేఖా! బాగా ఆలోచుంచు. నీవాశించినట్లు జరగడం అసంభవము. బాగా ఆలోచించు '' అన్నాడు కుప్తగా బీజగుప్తుడు.

చిత్రలేఖ బీజగుప్తుని భుజంపై చేయివేసి — "బీజగుప్తు! కొన్నిరోజులు మనం వేరుగా ఉండిచూద్దాం. బహుశా తరువాత మీరు వివాహం చేసుకోవడానికి తత్పరులు కావచ్చు ప్రేమలో వియోగ ముండదా? ఆ వియోగాన్ని కూడా మనం కొంచెము చవిచూద్దా" అన్నది.

బీజగుప్తుడు లేచినిలబడి — "చెప్ప వలసిందేదో చెప్పాను. తరువాత నీ ఇష్టం కాని అతిత్వరలోనే 'పొరబాటు చేశానను! శోకపోవు" అని బీజగుప్తుడు అచ్చటినుండి పోసాగెను. రాజమార్గంవరకూ చిత్రలేఖ సాగనంప వెళ్లింది. రాజమార్గంవద్ద ఆగి చిత్రలేఖ బీజగుప్తుని ఆఖరిసారిగా తనివితీర గాఢాలింగనం చేసింది. కొన్ని సంవత్సరాలనుంచి చూడనటువంటి సుఖాన్ని, మాదకత్వాన్ని, ఘనమైన ప్రేమను, ఆ ఆలింగనములో చూచాడు. వీడ్కోలునిస్తూ చిత్రలేఖ బీజగుప్తుని పాదాలను పట్టి — "బీజగుప్తు! నేను చేసేది వాస్తవంగా అనుచితమే. అందుకు క్షమించు"! అని వేడుకొన్నది.

బీజప్తుగుని సాగనంపి చిత్రలేఖ కుటీరం లోనికి తిరిగి వచ్చింది. అప్పుడు కుమారగిరి ఏదియో ఆలోచనలో నిమగ్నుడైయున్నాడు, చిత్రఖలేను ఆసనం మీద కూర్చొమని — "నన్ను ప్రేమిస్తున్నావని చెప్పావు. నిజమేనా?" అని ప్రశ్నించాడు కుమారగిరి.

"అవును! ఇప్పుడేం?" అన్నది ఆశ్చర్యంగా చిత్రలేఖ.

"మిమ్ము ప్రేమిస్తున్నాను అని ఇప్పుడే బీజగుప్తునితో అన్నావు. ఇద్దరిని సమానంగా ప్రేమిస్తావా?"

" అవును "

" అయితే ఇద్దరి వ్యక్తులను ఒకేసారి ప్రేమించడం సంభవమేనా ? "

" తమరు అసంభవమనుకొంటున్నారా ? గురుదేవ్ ! పురుషుడు ఇద్దర్ని వివాహం చేసుకోవచ్చు, ఇద్దర్ని ప్రేమించవచ్చు. అదే స్త్రీ ఎందుకు చేయలేదు? స్త్రీ పుత్రుణ్ణి ఎంతగా ప్రేమిస్తుందో, భర్తను అంతగా ప్రేమించగలదు. ఆత్మయు, సంబంధం ఒకే పర్యాయం ఎంతోమంది వ్యక్తులతో నుండుట అసంభవం కాదు "

" చిత్రలేఖా! నీవు నన్ను మోసం చేస్తూన్నావా? బీజగుప్తునా? లేక నిన్ను నీవే మోసగించుకొనుచున్నావా ? "

" నేను తమర్ని మోసగించుటలేదు. బీజగుప్తుని — లేదానన్ను నేనే మోసగించుకొనుచున్నాను "

" కాదు – చిత్రలేఖా! మరొక్కసారి బాగాఆలోచించు. నావద్దఉంటూ బీజగుప్తుని ప్రేమించజాలవు. ఇచ్చట ఈ ప్రపంచంకంటే ఉన్నతపథాన్ని చేరవలసి యున్నది. తపస్సుకు, సాధనకు తగిన క్షేత్రంఇది. కాని హృదయ నిర్బలత్వానికిచ్చట తావులేదు. నేను నీకు సమయాన్నిస్తున్నాను. తిరిగి ఒక్కసారి దీర్ఘంగా ఆలోచించుకో ! "

" ఆలోచించాను, బాగా ఆలోచించాను. మీరు చెప్పినట్లు ఆచరిస్తాను. మీరు అనుజ్ఞ ఇస్తే మమత్వాన్ని సహితం విడనాడ సిద్ధంగా నున్నాను " ఇక ప్రపంచం చాల సరళం. "

కుమారగిరి చిత్రలేఖను అర్థంచేసుకోలేకపోయ్యాడు. చిత్రలేఖ వ్యక్తిత్వం అసాధారణమైనదిగాదు చాలా ప్రతిభావంతమైనది. చిత్రలేఖకు దీక్షనివ్వవద్దనేకోర్కె హృదయంలో మరొకసారి లేచింది. కుమారగిరి చిత్రలేఖతో ఇట్లు చెప్పనారంభించెను. ,,దేవీ చిత్రలేఖా! నేను నిన్ను తెలుసుకోలేను.నీవ్యక్తిత్వం నావ్యక్తిత్వంకన్నా నీచమైనదిగాదు.కాబట్టి నీకు దీక్షనివ్వడం ఎంతవరకూ సమంజసమో? నిర్ణయించుకోవాలి. నేనీ నిర్ణయంచేయనంతవరకూ.........” కుమారగిరి వాక్యం పూర్తికాకపూర్వమే విశాలదేవు కుటీరములోనికి ప్రవేశించాడు. విశాలదేవునుచూచి కుమారగిరి వాక్యం ఆగిపోయింది. విశాలదేవు గురుచరణ ధూళిని తీసుకొని, చిత్రలేఖకు నమస్కరించి అచ్చటనుండి వెళ్లిపోయాడు.

విశాలదేవు వెళ్లినతరువాత కుమారగిరి పకపకా నవ్వుతూ—,, నీకు దీక్షనివ్వమని నాకు భగవంతుడాదేశించున్నాడు. నిన్ను నావద్ద ఉంచుకొంటాను. నన్ను నేను పరీక్షించుకొంటాను. నర్తకీ! నేనింతకుముందు అన్నమాటలనుగురించి మరేమీ అనుకోవలదు!” అన్నాడు—

## 14

రాత్రిపోగా పగలు. పగలు పోగారాత్రి.

సుఖంవెంట దుఃఖం దుఃఖంవెంట సుఖం.

చీకటిలేనిదే వెలుతురు మహత్తులేదు. వెలుతురు లేనిదే చీకటి మహత్తులేదు.దుఃఖంలేని సుఖానికి మూల్యంలేదు.సుఖం లేని దుఃఖానికి విలలేదు.

ఇదే పరివర్తన నియమము. ప్రపంచం నిత్య పరివార్తానాయుతమైనది. మనుష్యుడు ఈవిశాల విశ్వంలోని ఒక భాగము. బీజగుప్తుడుగూడా మనుష్యుడు——— అతడు సుఖాన్ని చవిచూచాడు...ఇంక దుఃఖాన్నను భవించవలసి యున్నది. కాని బీజగుప్తుడు విచలతుడయ్యాడు. దుఃఖ భారంచే కృంగి పొయ్యాడు. స్వప్నంలోగూడ ఘటన జరిగింది. అయినా జీవితుడనై యున్నాననేదే అతని కాశ్చర్యం బీజగుప్తునకు జీవించడమే భారమైపోయింది.

అయినా మనుష్యుడు సుఖదుఃఖాలను సమానంగా సహించడానికే శృజించబడ్డాడు. ఇందులో ఏఒక్కదాని యెడ నైనా విముఖత్వం చూపడం పిరికితనం. ఈఅనుభూతినే పొందు తున్నాడు బీజగుప్తుడు చిత్రలేఖ వియోగదుఃఖాన్ని ధైర్యంగా సహించడానికే నిశ్చయించాడుకాని పాటలీపుత్రంలో ఉంటూ ఉండగా అలాజరగడం అసంభవము చిత్రలేఖ ఎప్పుడో ఒకప్పుడు కంటికి కనబడుతూనే ఉంటుంది. ఆస్థితిలో వియోగ తపస్సుకు విలువేముంటుంది?

చిత్రలేఖ బీజగుప్తుని విడచి, సాధనా తపస్సులో తల్లీ నమైనదన్న వార్త. తోటిసామంతులకు ఏదోవిధంగా తెలియక పోదు. బీజగుప్తుడు వారియెదుట శిరమెత్తుక తిరగగలడా? ఇదీ ఒకపెద్దసమస్యయే మూడవవిషయం కొంచెం అస్పష్టమై

నప్పటికీ గమనించ తగ్గదే, యశోధరప్రేమ ప్రభావం ఇతనిని రెకెత్తించ గలదా?

బీజగుప్తుడు ఈచిక్కు సమస్యను విడదీయ పూటల్లా ప్రయత్నించాడు. ప్రయిత్నించిన కొలదీ మరీ చిక్కుపడ సాగింది సమస్య ఆలోచించి ఆలోచించి ఆఖరుకు అలసి పొయ్యాడు. ఆసమస్య అతనికొక మానసిక వ్యథగా తయారైయింది. సంధ్యా సమయానికి బీజగుప్తుడు శ్వేతాంకునితో నాదొకమాట అన్నాడు.

"ఏమిటది?"

"మనం కాశీయాత్ర చేద్దాము— కొంతకాలం పాటు నాకు దేశాటన చేయాలనే కోర్కె కలిగింది"

ఇంతశీఘ్రంగానా? శ్వేతాంకుడు ఆశ్చర్య చకితుడైనాడు. యశోధరయెడ అతనికి గలుగుతున్న ప్రేమను దృఢతరం చేయాలను కొంటున్నాడు. పాటలీపుత్రంలో ఉంటేనే ఈపని సాధ్యపడుతుంది. "పదు నైదురోజుల తరువాత పోకూడదా స్వామీ? ఏర్పాట్లు చేయడానికి తగిన వ్యవది లేదు" అన్నాడు శ్వేతాంకుడు.

"వీల్లేదు. ఎల్లుండే బైలుదేరాలి. ఏర్పాట్లన్నీ ఒక్క క్షణంలో అయిపోతాయి. మన యిరువురకు తగిన ఏర్పాట్లు చేయవలయును" అని నీరసంగా అన్నాడు బీజగుప్తుడు.

"స్వామి ఆజ్ఞానుసారమే!"

శ్వేతాంకుడు రాత్రియంతా నిద్రించలేదు. బీజగుప్తుని ఈ నిర్ణయం అతనికి మనస్కరించలేదు. అయినా అతడేమి చేయగలడు? బీజగుప్తుని వెంట వెళ్ళ నిరాకరించమంటున్నది శ్వేతాంకుని మనస్సు. కాని ఇది నీ నీచభావమును ప్రదర్శించడమేనని హృదయం ప్రబోధించుచున్నది. శ్వేతాంకుడు ప్రాతఃకాలమే లేచి– ,,ఆర్యా! నేను మృత్యుంజయునితో కలసుకొని వస్తాను. తమరు అనుమతించితే" అన్నాడు బీజగుప్తునితో.

కారణం తెలిసియుండికూడా ,,ఎందుకు" అని ప్రశ్నించాడు బీజగుప్తుడు.

,, తిరిగి మన రాక ఎప్పటికో? వారి శెలవు తీసుక రాదలచాను"

,,అయితే వెళ్ళు బీజగుప్తుని మనమున పిన్నని నవ్వు ఉదయించింది. ఒకడు ప్రేమించి పశ్చాత్తాపమును చెందుతున్నాడు—మరియొకడు ప్రేమించ ఉత్కంఠగొనుచున్నాడు.

శ్వేతాంకుడు మృత్యుంజయుని ఇల్లు చేరుకున్నాడు. ఆ సమయమున మృత్యుంజయుడు ఇంటలేడు. శ్వేతాంకుడు యశోధరకు తన రాకను తెలియ పర్చాడు.

విశ్రామభవనంలో యశోధర శ్వేతాంకుని కలసుకొనెను. ఒండొరులలో అభివందనాలు అయ్యినిమాదట ఇరువురూ కూర్చుండిరి కొంత తడవు మౌనముద్రులైరి. ఎట్టకేలకు శ్వేతాంకుడే సంభాషణను ప్రారంభించాడు— ,,దేవీ! రేపు నేను బీజగుప్తునితోపాటు పాటలీపుత్రమును విడచుచున్నాను

తిరిగి మారాక ఎన్నటికో తెలియదు, కాన మీనుండి శెలవు కోరవచ్చితిని"

శ్వేతాంకుడు యశోధర ముఖమును పరికించసాగెను' ఆమె ముఖమండలమున భావపరివర్తనమేమియూ కానరాకుండెను. "బీజగుప్తులు పాటలీపుత్రమును విడచుచున్నారా? నిన్నవారి విషయం మాటవరసకన్నా అనియుండలేదు?.

శ్వేతాంకునకు యశోధరయొక్క ఈ నిర్లక్ష్యాభావం ఎగటుగా కనుపించింది—కొంచెం క్రోధంగూడా కలిగింది—"అవును దేవీ! చిత్రలేఖ బీజగుప్తుని విడచి యోగి కుమారగిరి వద్ద దీక్షను పొందవెళ్ళినది."

ఈమాటను వినుటతోడనే యశోధర తుళ్ళిపడినది— "ఏమన్నారు? చిత్రలేఖ వైరాగ్య మవలంభించెనా? ఆశ్చర్యం అవును! బీజగుప్తార్యునకు అవశ్యం దుఃఖము కలిగియుండును అని యశోధర కొంత తడవు మౌనంవహించి తిరిగి ఇట్లనెను —"నేను చిత్రలేఖను చూచిన తోడనే ఆమెదేవీ సంపన్నురాలను కున్నాను బీజగుప్తార్యుని కొరకు ఆమె సర్వత్యాగం చెయ్యగలదు"

శ్వేతాంకుడు తన ప్రహారమునకు తానే స్వయంగా గురియయ్యెను. అతనిలోని ప్రతి హింసాభావం ఒక్కసారి వెల్లువై లేచెను, "బీజగుప్తార్యులు చిత్రలేఖను తప్ప అన్య స్త్రీలను ప్రేమించలేరు. నాకు బాగా తెలుసు. అందుచే తనే హృదయాహ్లాదము కొరకు దేశాటన చేయుచున్నారు.

వారి దుఃఖం ప్రచండరూపాన్ని దాల్చింది. పాటలీపుత్రాన్ని విడవకున్న ఆత్మహత్యగూడ సంభవము కావచ్చు."

ఈసారి యశోధర ముఖము వివర్ణమైంది. "మీరు చెప్పింది నిజమే శ్వేతాంక్! వారిని నేను ఇప్పుడిప్పుడే అర్థం చేసుకొంటున్నాను. మీరు చెప్పిన మాటలు సారగర్భితమైనవి. సర్వశ్రేష్ఠులైన బీజగుప్తార్యుని చూస్తూ చూస్తూ ద్రోహిగా ఎంచలేను. వారియెడ నాకున్న శ్రద్ధాభావం తగ్గుట లేదు. సరిగదా పెచ్చుపెరిగి పోతున్నది."

శ్వేతాంకుడు నిజంగా క్రోధంతో పిచ్చివాడైనాడు. "యశోధరా! ఒక నర్తకీ ప్రేమకు వశీభూతుడై పిచ్చివాడై పోవుట బీజగుప్తునివంటి పురుషునకు ఉచితమని నాకు తోచకున్నది. మరొకవిషయం.....జీవితం దుఃఖ భూయిష్ఠమైనప్పుడు పిరికిబారిపోవుట మనుష్యునిలోని నిర్బల వ్యక్తిత్వానికి ద్యోతకం కాదా?"

శ్వేతాంకుని అకారణ కోపానికి కారణమేమో యశోధర తెలుసుకోలేక పోయింది. గంభీరంగా ఇట్లన్నది. "శ్వేతాంక్! మీరు చెప్పింది ఉచితమే కావచ్చు. మీవాదాన్ని ఖండించడం నాఉద్దేశ్యంకాదు. కాని ఈవిషయాన్ని గట్టిగా చెప్పగలను—ఇందులో బీజగుప్తార్యుని దోషమేమీలేదు. వారి దృష్టిలో చిత్రలేఖ నర్తకీకాదు. పత్నీ సమానురాలు. జీవిత సాంగత్యురాలు. ఈవిషయం నాకు తెలుసు...మీకు తెలుసు...యావత్తు ప్రపంచానికి తెలుసు...అయినప్పటికీ ప్రతి మనుష్యునిలోనూ బలహీనత వుంటుంది. మనుష్యుడు సంపూర్ణుడుకాడు. ఆబలహీనతలను పురస్కరించుకొని వ్యక్తినే

దూషించి, శత్రువుగాచేసుకోవడం ఉచితంగాదు. ఈరకంగా మనుష్యుడు ఏ వ్యక్తికి స్నేహితుడు కాజాలడు. అటువంటివాడు ప్రపంచములోని ప్రతివ్యక్తిని దూషించుతాడు. ప్రతివ్యక్తి అతనికి శత్రువౌవుతాడు. ప్రతిఫలం... అతనికి జీవితమే భారమౌతుంది. ఇతరుల బలహీనతలయెడ సహానుభూతి చూపడమే మనుష్యుని కర్తవ్యం."

శ్వేతాంకుని రోషావేశం పెచ్చుపెరిగి, పరదారిద్యై జ్ఞానాన్ని కప్పివేసింది. "కర్తవ్యములో సహానుభూతికి, దయకు స్థానం లేదు. వ్యక్తి బలహీనతను ఎత్తిచూపి. విమర్శించి సరియైన మార్గమున చేర్పుట ఉచితము."

యశోధరనవ్వి—"ఆర్యా! శ్వేతాంక్! మనుష్యుడు ముందు తనబలహీనతలను దూరంచేసికో ప్రయత్నించాలి. ఇతరుల తప్పులను యెంచుట చాలా సులభం, తానుచేసేది మంచి యనుకోవడం, ఈప్రపంచానికొక నియమమైపోయింది తన తప్పును తానుగుర్తించి, దానిని దిద్దుకొనుటకు ప్రయత్నించిన మనుష్యుడే సర్వశ్రేష్ఠుడు."

యశోధర అంతిమవాక్యం శ్వేతాంకుని హృదయానికి శూలంలాగా గుచ్చుకొన్నది. యశోధర తననే వ్యంగ్య పరచుచున్నదో? లేక బీజగుప్తుని పురస్కరించుకొని నుడివినదో? తెలియకున్నది. బీజగుప్తుడు తన తప్పును తాను తెలుసుకొని దిద్దుకొనుటకు ప్రయత్నించుచున్న వ్యక్తి శ్వేతాంకుడు ఇతరుల తప్పులను ఎత్తిచూపి విమర్శించుచున్న వ్యక్తి కనుకనే ఆవాక్యం ఇద్దరికి వర్తించుచున్నది. శ్వేతాంకుడు తనలోని ప్రాతిహాపాభావాన్ని తాను గుర్తించలేదు. హీనస్వరంలో

శ్వేతాంకు డిట్లనెను — బీజగుప్తార్యుని మీ యెదుట దూషించుట ప్రనుచితమే కనుక క్షమించవలసిందిగా ప్రార్థించుచున్నాను. ఇకమీద ఉన్న తప్పులను నేను దిద్దుకొనుటకు ప్రయత్నించెదను. »

'బీజగుప్తార్యుని మీయెదుట దూషించడంఅనుచితమే'

యశోధర క్రుద్ధురాలైంది. కాని వెంటనే ఆమెకు శ్వేతాంకునికోపానికికారణం తెలియుటవల్ల కాబోలు,ఆమెముఖంలో మరుక్షణములోనే పరివర్తనము కానుంచెను— ‹‹శ్వేతాంక్! మీరు భ్రమించారు... నేను బీజగుప్తార్యుని ప్రేమించుటలేదు———ఈవిషయాన్ని మీయెదుటస్పష్టం చేయడనే ఉచితమను కొంటున్నాను”—యశోధర కండ్లు అశ్రుపూరిత మైనాయి...ఆమె పమిటి కొంగుతో ముఖం కప్పుకొన్నది——

శ్వేతాంకుని నోటనుండి తీరా ఆవాక్యం వెలువడింది. అందుకాతడు చాలా బాధపడు చున్నాడు. కాని వెలువడిన మాటను మరల్చుకొనుట అసాధ్యం శ్వేతాంకుడు చేతులు జోడించి ఇట్లనెను— ‹‹దేవీ, యశోధరా! నన్ను క్షమించండి ——నేను పెద్ద అపరాధం చేశాను. కారణం?... అప్పుడు నాలో నేనులేను. నేనింత కఠినుడ నెందుకయ్యానో బహుశా మీకు తెలియక పోవచ్చు.»

కారణంకొంచెంగా తెలిసియుండికూడా స్పష్టరూపంలో వినాలనే లాలస కొలది ‹‹ఎందుకు?›› అని ప్రశ్నించింది. యశోధర.

‘‘నేను మిమ్మలను ప్రేమిస్తున్నాను.’’

యశోధర శ్వేతాంకుని తేరిచూచింది. ఆమె నిస్సంకోచమైన నేత్రాలు శ్వేతాంకుని నేత్రాలలో కలసాయి. ‘‘ఆర్యా! శ్వేతాంక్! చాలా ఆశ్చర్యం!’’

ఈవాక్యం శ్వేతాంకుని నిస్తేజుని చేసింది. గాఢంగాను గంభీరంగాను. భయంకరంగాను ఉన్నదీవాక్యం. ఈచిన్న వాక్యంలో సత్యంఎంతో దాగియున్నది—యశోధర శ్వేతాంకుని ప్రేమించుటలేదు—శ్వేతాంకుడు అకస్మాత్తుగా ఇలా అన్నాడు, ‘‘దేవీ! నాకు తెలుసు...మీరు నన్ను ప్రేమించుటలేదు. అయినప్పటికీ నేను మిమ్మల ప్రేమిస్తున్నాను. ‘ప్రేమ’ ప్రేమించేదేగాని, చెప్పేదిమాత్రం గాదని నాకు తెలుసు—కాని సందర్భవశాత్తు చెప్పకతప్పలేదు. చెప్పాను నాఈ కఠోర, దుస్సహ చేష్టకు క్షమాయాచన చేయుచున్నాను.’’

‘‘ఇందుకు క్షమాయాచన చేయవలసిన్ని అవుసరం లేదు. శ్వేతాంక్! మీరు నాదృష్టిలో దోషులుగారు. జీవితంలో ఇలాంటి ఘటనలు నిత్యం ఘటించుతూనే యుంటాయి. యెందాకా క్షమాయాచనలతో తిరుగుతూ వుంటారు.? మంచిది! నాన్నగారొచ్చారేమో చూస్తాను’’ అనిలేచింది. యశోధర.

యశోధర లోనికేగింది. శ్వేతాంకుడు ఇప్పుడిప్పుడే తన తప్పును తాను గుర్తించుచున్నాడు. అతను యశోధరతో కలుసుకోవడానికే వచ్చాడు. భాగ్యవశాత్తు అనుకున్న

దానికంటే యెక్కువగానే ఆమెతో సంభాషించాడు. తన మూర్ఖతతో యశోధరను కృద్ధురాలను చేయకున్న, ఇంకా యెక్కువగానే జరిగి యుండేదేమో? తన మూర్ఖతకు తానే క్రోధితుడైనాడు. ఇంక అచ్చట కూర్చుని యుండుటగూడా అనవసర మనుకొంటున్నాడు. తాననుకొన్నదొకటి, ఇచ్చట జరిగిం దింకొకటి. వెళ్ళసిద్ధమవగానే మృత్యుంజయుడు ప్రవేశించెను. మృత్యుంజయుని చూచి శ్వేతాంకు డాగిపోయినాడు. అభివందన మాచరించాడు.

మృత్యుంజయుడు శ్వేతాంకుని కూర్చుండమని—“వత్సా! బీజగుప్తార్యులు దేశయాత్ర సలుపు నున్నారని విన్నాను. నిజమేనా?” అన్నాడు—

“ఆర్యశ్రేష్ఠా! రేపే మేము బయలు దేరుతున్నాము” అని లేనినవ్వు తెచ్చుకొంటూ అన్నాడు శ్వేతాంకుడు.

“ఎచ్చటికి పోతలంచిరి”

“కాశీ”

“తిరిగి ఎప్పుడు రావలయునని”

“ఈ విషయం నిశ్చయంగా చెప్పజాలను—ఆ నిర్ణయం బీజగుప్తార్యునిపై ఆధార పడియున్నది”.

యశోధర తండ్రిగారితో ఇట్లనెను—నాన్నగారు! తమరెన్నడూ, దేశయాత్ర చేయరేల నేను కాశీ ఎన్నడూ చూడలేను, ఇదిమంచి సమయం మనంగూడా బీజగుప్తునితో పాటు కాశీ యాత్ర చేయుదమా ?

ఈ ప్రస్థాపన అగ్రహితమైనదిగాదు. కాశీ పాటలీ పుత్రమునకు చాలాదగ్గరగూడా—"అమ్మా! యింతత్వరలో ఎలాసాధ్యపడుతుంది?" అన్నాడు మృత్యుంజయుడు.

"ఎందుకు సాధ్యపడదు నాన్నగారు? తమరు అనుమతించాలిగాని సాయంసమయానికి ఏర్పాట్లన్నీ పూర్తి కాగలవు."

"యశోధరా! నీ ఈ మొదటి అనుకోధాన్ని తిరస్కరించడం నా చేతగాదు. కష్టం అనుకోకుండా ఏర్పాట్లు చేయించగలిగితే చేయించు" అన్నాడు మృత్యుంజయుడు.

శ్వేతాంకుని నిష్కేజమనస్సు భిన్నమైనది. యశోధర బీజగుప్తుని ప్రేమిస్తున్నది. లేకున్న ఇంత త్వరలో ప్రయాణ సన్నద్ధ మేలవేయును? అయినప్పటికీ బీజగుప్త డామెను ప్రేమించుటలేదు. కొంతకాలం కలసి మెలసి ఉండుటవలన ఆమెను ఏవ్యక్తి. ప్రేమిస్తున్నాడో! తెలుసుకో గలదను కొంటూ మనశ్శాంతిని పొందాడు శ్వేతాంకుడు.

"శ్వేతాంక్! మేముగూడా మీవెంట వచ్చెదమని బీజగుప్తునితో చెప్పండి" అన్నది యశోధర.

"యశోధరా! ముందు ఏర్పాట్లు చేయించు రేపటికి మన ఏర్పాట్లు పూర్తి కానిచో బీజగుప్తుని కొకరోజు వ్యర్థమగును" అని సంకోచిస్తూ అన్నాడు. మృత్యుంజయుడు.

"ఏర్పాట్లు పూర్తిగావూ? ఏమంటున్నారు? శ్వేతాంక్ మేము తప్పకవస్తాము"

శ్వేతాంకుడు లేచి నిలబడి ,,ఆర్య శ్రేష్టా! బీజగుప్తా ర్యునితో తప్పక చెప్పుతాను.'' తిరిగి యశోధరతో—,,దేవీ! ఏర్పాట్లు చేయడంలో ఎక్కువ కష్టంవుంటే నేను మీకు కొంత సహాయపడ సిద్ధముగానున్నాను. అనుమతిస్తే సాయం కాలం వస్తాను'' అన్నాడు, శ్వేతాంకుడు.

,,ఆర్యా! మీరువస్తే ఏదైనా మీకు తగినకార్యం ఉంటే చెప్పుతాను. అన్నది యశోధర నవ్వుతూ.

శ్వేతాంకుడు బీజగుప్తుని వద్దకేగి—,,స్వామీ! ఆర్య మృత్యుంజయులు తమకన్యా సహితంగా కాశీయాత్ర చేయ గోరుచుండిరి. మీతో నైతేనే బాగుంటుందని చెప్పను న్నారు'' అన్నాడు శ్వేతాంకుడు.

ఇలా జరుగుతుందని బీజగుప్తుడు ఏన్నడూ ఊహించ లేదు. ఏపకారణములకు దూరముగానుండనెంచి, యాత్ర సలుప నిశ్చయించెనో. అందొకటి వెనువెంట నుండు చుండె.. అయితే ఇప్పుడు చేసేదిమాత్రం ఏమున్నది?— ,,మంచిది!—అన్నాడు బీజగుప్తుడు అయిష్టంగా.



# 15

యశోధర తాను ఒప్పుకొన్న పనిని పూర్తిచేసింది. ఆమె యాత్రకు తగిన ఏర్పాట్లన్నీ చకచక చేసింది. రెండవ రోజునే అందరూ కాశీ ప్రస్తావనం చేసిరి.

అది సంధ్యాసమయం. గ్రీష్మఋతువు ఆరాత్రి ఎంతో అందంగానూ, హాయిగానూ, వున్నది. కాని బీజగుప్తునకు మాత్రం అలాలేదు. చతుర్థశీ చంద్రుడు తూర్పు కొండలలో ప్రకాశించుచున్నాడు. బీజగుప్తుని హృదయజ్వాల ప్రచండ రూపము దాల్చుచుండెను. దాసానదాసీలు గుంపులు గుంపులుగా కాగడాలనుబట్టి వెంటనంటుచుండిరి. ఆ భగభగమండే కాగడాలజ్వాలలో బీజగుప్తుడు తన హృదయంలో మండే జ్వాలా ప్రతిబింబాన్ని చూచుచుండెను. అతడు మౌన ముద్రతో——

బీజగుప్తుని రథంమీద శ్వేతాంకుడున్నాడు మృత్యుంజయుని రథంమీద యశోధర ఉన్నది.

అర్ధరాత్రి గడచింది. పండువెన్నెల ప్రకాశించుచుండెను. మార్గమున ఇరుప్రక్కల ఉన్న ఉద్యానవనములలోని మల్లె, సన్నజాజుల కమ్మని సుగంధం ఘుమఘుమలాడుతూ నాల్గువైపుల వ్యాపించుచుండెను. ‹‹రాత్రికి విశ్రమించడం మంచిదికదా?›› అన్నాడు శ్వేతాంకుడు. నిస్తబ్ధతను భంగ పరుస్తూ.

అప్పుడు బీజగుప్తుడు ఏదియో ఆలోచించు చుండెను. తానేమి ఆలోచించు చుండెనో? తనకే తెలియని ఆలోచనలు

ఆమస్థిష్కంలో సముద్రములో అలలులాగా,వరుసగా లేస్తూ లుప్తమై పోవుచున్నాయి. అట్టిమానసిక అవస్థలో అతనికి కాలజ్ఞానంశూన్యమైపోయింది. అప్పటికి మృత్యుంజయునిరథం బీజగుప్తుని రథాన్ని సమీపించెను. ,,ఆర్య బీజగుప్త! విశ్రమించడం మంచిదేమో?" అన్నది యశోధర.

బీజగుప్తుడు తుళ్ళిపడి లేచాడు. ఆకాశంవంక చూచాడు. చంద్రుడప్పటికి పూర్వభాగాన్నివిడచి పశ్చిమ భాగానికరిగెను. ,,శ్వేతాంక్! రథాన్నాపు ఈ సమీపంలో మన విశ్రమించుటకు తగిన ఏర్పాటు ఏమన్నా ఉన్న దేమో చూడు" అన్నాడు బీజగుప్తుడు.

బీజగుప్తుని రథమాగుటతోడనే అన్యరథములన్నియూ ఆగినాయి. శ్వేతాంకుడు విశ్రామ స్థలాన్వేషణార్థము వెళ్ళెను. బీజగుప్తుడు మృత్యుంజయునితో ఇట్లనెను—,,ఆర్య శ్రేష్ఠా! అర్థరాత్రి గడచింది. నాకు సమయజ్ఞానం లోపించింది, పరధ్యానంలో నున్నాను. ఆలస్యం జరిగింది. తమకు కష్టం కలుగజేశాను క్షమించండి. తమరుచితమని భావిస్తే ఇంకా మరికొంత దూరగుగుట మంచిది. ఇచ్చట మన విశ్రమించుటకు తగిన ఏర్పాట్లుండవను కొంటాను. అదీకాకుండా ఇచ్చటి తీవ్ర వేడిమిని మనం భరించలేము. ఇంకా కొంత ముందుకుపోయి రోజంతా విశ్రమిద్దాము"

,,బీజగుప్త! నిజమే అదే ఉచితమని తోస్తున్నది. అన్నాడు సంకోచంగా మృత్యుంజయుడు. ఇంతలో శ్వేతాంకుడు తిరిగివచ్చి—ఇచ్చట ఒక సుందరమైన ఉపవనం ఉన్నది దానిలో ఒక విశాల భవనంగూడా ఉన్నది... అది ఒక

సామంతునిది... సామంతుని ప్రాసాదమొకటి యున్నది." అని చెప్పినాడు.

"సామంతుని ఉపవనమా? అయితే అదిమన కనుకూలంగానే ఉంటుంది. ఆర్య బీజగుప్త! నేనిచ్చట ఒక పర్యాయం విశ్రమించితినిగూడా— అవును. సామంతుని అందమైన ఒక భవనంగూడా ఉన్నది."—అన్నాడు మృత్యుంజయుడు—

రథాలు ఆ ఉద్యానవనం వైపుకు మరలించబడినాయి. తోటమాలి సామంతులకు స్వాగతమిచ్చాడు. ఉద్యానవనంలో అధితుల సౌకర్యార్థం ఆసనాలు, పరుపులు, పాన్పులు అన్నీ అమర్చబడిఉన్నాయి. అందరూ ప్రయాణ బడలిక నీ పరుండుటతోడనే నిద్రించిరి కాని బీజగుప్తునకు మాత్రం నిద్రపట్టలేదు.

ఎచ్చటికెళ్ళుచున్నాడు? ఎందుకు వెళ్ళుచున్నా[illegible]? అన్నప్రశ్నలు బీజగుప్తుని బుర్రలో బొంగరంలాగా గి[illegible] తిరుగుతున్నాయి. శాంతినిపొందిన మానసిక పీడను దూరం చేసుకొనేందుకు కాశీ వెళ్లుచున్నాడు. యశోధరకు చిత్రలేఖను దూరంగా నుంచదలంచినదే పాటలీపుత్రమును [illegible]చాడు. కాని యశోధరను దూరంకాజాలక పోయ్యాడు. పైపెచ్చు యశోధర మరీ సమీపవర్తిని యగుచున్నది!— 'అసంభవము' అన్నాడు బిగ్గరగా బీజగుప్తుడు యశో[illegible]ను మనస్పూర్తిగా ప్రేమించలేకున్నాడు. మనస్సునుండి య[illegible]ధర చిత్రం తొలగింది. తిరిగి చిత్రలేఖ చిత్రం ప్రవేశం[illegible]. ఎవరు? చిత్రలేఖ? తన జీవితానికి — ఆమెకు [illegible]బంధమేమిటి?—ఆమె అతని ప్రేమిక ప్రియురాలు పత్ని స[illegible]రాదు

రాలు. చిత్రలేఖను గాఢంగా ప్రేమిస్తున్నాడు. ఆమెగూడా బీజగుప్తుని ప్రేమించింది. 'ఆమె ఇప్పుడుగూడా ప్రేమిస్తున్నదా?' అన్న ప్రశ్నకు 'అవును...కాదు' అని గూడా చెప్పవచ్చును. ఆమె బీజగుప్తుని హితంకోసం విడచివెళ్ళి కుమారగిరివద్ద దీక్షనుగొన్నది. ఇందువల్ల 'అవును'నే చెప్పగలం. బీజగుప్తుని ఇచ్ఛకు విరుద్ధంగా, అతని జీవితాన్ని అతి భారంచేసి, వెళ్ళినందువల్ల 'లేదు' అనిగూడా చెప్పగలం.

ఇలాంటి ఆలోచనలనే ఆలోచిస్తూండగానే బీజగుప్తునకు పక్షుల కలవరగానం వినిపించింది. తూర్పు దిక్కున సూర్యుని ప్రథమరశ్మి తనస్వర్ణ అంచలనుసాచి ప్రాతఃకాలీన పవనంతో ముద్దు ముచ్చట లాడుచుండెను. నక్షత్రాలు ఒక్కొక్కటిగా తమ అస్థిత్వాన్ని కోల్పోవుచూ విలీనమగుచున్నాయి. ప్రక్కనే అర్ధవికసిత పుష్పరేకులపై మిల మిల మెరుస్తున్న, మంచు బిందువులతో నాట్యమాడు కొనుచున్న యశోధరను బీజగుప్తుడు చూచాడు. బీజగుప్తుడు లేచి నిత్య కృత్య-నివృత్తుడై, సుగంధ భరితమై, అచల్లనిపిల్లవాయులతో అశాంతి నిండియున్న హృదయానికి శాంతిని గొల్పనెంచి ఆతోటలోనికే వచ్చెను. యశోధర చేతిలో ఒకపుష్పమున్నది. ఆమె బీజగుప్తుని దగ్గరకు పిలచి — 'ఆర్య బీజగుప్త! చూడండి! ఈప్రకృతి సౌందర్య రూపాన్ని చూడండి! ఎంత సంతోషం! ఎంత ఉల్లాసం! ఎంతహాయి! ఎంత శాంతి ఆహా-- ఏమీ సౌందర్యం---!యావత్తు ప్రపంచం యొక్క చింతను, పిపాసను లాలసను, తృష్ణను, అభిశాపభరితమైన కోలాహలమునకు దూరమై--- అతిదూరమై---పలురకముల పక్షుల

నిష్కల్మష జీవిత మిచ్చట హాయిగా, ఆనందంగా, స్వేచ్ఛగా యూహకు అందని ఉల్లాసంగా, అప్సరసలతో వినోదం జరుపుచున్నదా? యని తోచుచున్నది."

బీజగుప్తుడు యశోధర ప్రక్కకువచ్చి నిలబడి, నాల్గు వైపుల పరికించి చూచి—"దేవీయశోధరా! నాకీ ప్రకృతిలో సౌందర్యమేమీ కనుపించుటలేదు" అన్నాడు నీరసంగా.

"ప్రకృతిలో తమకేమీ సౌందర్యం కనుపించుట లేదా? యశోధర ఆశ్చర్య చకితవదనయై బీజగుప్తునివంక చూస్తూ, "ఆర్య బీజగుప్త! తమరు నిజం చెప్పుచున్నారా? లేక హేళన చేయుచున్నారా" అని ప్రశ్నించినది.

"హేళన చేయుటలేదు దేవీ! నేను నిజం చెప్పుచున్నాను. ప్రకృతి అందమైనదంటున్నావు. కాని నాకు కురూపినిగా కనుపించుచున్నది."

యశోధర బీజగుప్తుని మాటలను విశ్వసించలేకున్నది. "ఆర్యా! ఈ పొద యెంత మనోహరముగా నున్నదో చూడండి! దీని హృదయం ఎంత కోమలంగా నున్నది! ఈ పొదలో కూర్చొని విశ్రమించుదామనే కుతూహలం నాకు కలుగుతుంది.

బీజగుప్తుడు చిరునవ్వు నవ్వుతూ—"అట్లు పలుకు దేవీ! ఇచ్చట వుపచారం చేయడానికి తగిన వైద్యుడుగూడా లేడు. ఎప్పుడూ బాహ్యజీవితం గడపియుండక పోవుటచే నీవు దీనిని కోమలంగానూ, ఆనందంగానూ, ఉన్నదనుకొంటున్నావు. దీనిలో ఎన్ని విషపురుగులు దాగియున్నవో ఎవరికి తెలుసు?



ఆ సహజ సౌందర్యమును తిలకించి ఆనందించుచున్నది. ఆమె మెల్లగా ఇట్లన్నది—"ఈపావురములు ఎంత సుఖవంతమైన జీవితం గడుపుతున్నాయి! అవి ఎంత పరిశుద్ధంగా, ఆనందంగా, హాయిగా నీటిలో ఆడుకొనుచున్నాయి! మనుష్యునిలోనున్న ఈర్ష్యా, దుష్టత అపవిత్రతా మొదలుగాగల అవగుణములు వీటిలో కానరావు. నాకూ రెక్కలుండి పావురాయినైపోతే బాగుండుననుపించుచున్నది."

బాలిక సహజ అమాయకత్వానికి బీజగుప్తు నవ్వి—"దేవీ! నేను నీకు విశ్వాసనీయంగా చెప్పుచున్నాను విను నిజంగా నీవు పావురాయివై యుంటే మానవజన్మ ఎత్తితే బాగుండేదనుకొనెడి దానవు. నీవు ఇవి సుఖంగా స్వేచ్ఛగా నిశ్చింతగా, శత్రురహితంగా ఉన్నవని భావించుచున్నావు. ఇది తప్పక భ్రమయే కోర్కె తీడేరడాన్నే సుఖమంటాము. కోర్కె తీడేరక పోవడాన్నే దుఃఖమంటాము, ఈపక్షుల సర్వకోర్కెలు ఈడేరుచున్నవనే తలంచుచుంటివా? వీటికసలు కోర్కెలుండునా! అన్నదిగా మానప్రస్తుత ప్రశ్న. మనుష్యుడు సర్వశ్రేష్ఠుడు. అతనికి కోర్కెలుండును. మానవుడు ప్రయత్నించి, వాటిని సంపూర్ణం చేసుకొని సఫలుడై సుఖమనుభవించుతాడు. మనుష్యుడే సర్వానికి కర్త. మనుష్యుడు అకర్మణీయత జీవితాన్ని గడపి చచ్చుటకు పుట్టుటలేదు. కర్మణీయ జీవితాన్ని గడుపుటకే పుట్టుచున్నాడు. పశుపక్షులు ఆహారంకోసం ఘోరాతిఘోరంగా పోట్లాడుకొంటున్నాయి. మనుష్యునకు ఆహారంకోసం పరిశ్రమ చేయవలసియున్నదనే దాన్ని మనవరాదు.—హలాన్ని పడతాడు—పొలాన్ని దున్నుతాడు— అన్నాన్ని పుట్టించుతాడు. కాని

పశుపక్షులు ప్రకృతి పదార్థాలమీద ఆధారపడి యుంటవి. పక్షులు భూమిలోని చిన్న చిన్న పురుగులను భక్షించి జీవించ గలుగుచున్నాయి. పశువులు ఒకటి మరొకదానిని చంపి తింటున్నాయి. పావురాయి శత్రువు డేగ వాటిమీద దూకినప్పుడు వాటి దైన్యదశను చూడు! ఎంత నిస్సహాయమై వివశత చెందుతాయో చూడు !" అని గంభీరంగా చెప్పాడు.

యశోధర ఆశ్చర్యాన్వితయై బీజగుప్తుని చూచుచుండెను. బీజగుప్తుడు కొంత తడవాగి తిరిగి ఇట్లు చెప్ప నారంభించెను — " దేవీ యశోధరా! ప్రాకృతిక వాతావరణంలో నున్న మనుష్యుడు సుఖియని తలంచుచుంటివి. కాని మనుష్యుడు తన స్థితికి తాను సంతృప్తి పడడనేది మరువరాని విషయం. నీవు రాజమహలులో పెరిగావు కనుక అదినీకు రుచించదు. ఆసార్థకతా, సుందరతా యెడ నీకు అసంతృప్తి కలుగుతుంది. అంతే గాదు అప్పుడప్పుడూ, నీకు ఆ వాతావరణాన్ని త్యజించాలనే కోరికకలుగుతుంది. నీవు మామూలు గుడిశలలో సుఖాన్ని చూస్తున్నావు ఈ లాంటి గ్రామ వాతావరణంలో పశుపక్షులతో హాయిగా విహరించుదామనే సుఖదకల్పనకు వశీభూతురాలవగు చున్నావు అవును. ఇది సహజమే. కాని గ్రామ వాసులనడిగి చూస్తే నీకు తేట తెల్లముకాగలదు. సుఖమంటూ ఉంటే, దాసాన దాసీలతో, సిరిసంపదలతో తులతూగుతున్న రాజమహలులోనే ఉన్నదంటారు. ఈ విశాల భవనాలను నిర్మించిన మనపూర్వులు ఒకప్పుడు గ్రామవాసులై యుంటారు. వారు గ్రామాలను విడిచి, పట్టణాలలో పెద్దపెద్ద భవనాలను ఎందుకు నిర్మించి ఉంటారు! ఈ ప్రకృతి కూడా

పతను దానిచిక్కులను దూరముచేయనెంచియే, అట్లునరించిరి. ఇప్పుడు నీవు ముగ్ధురాలవై చూచుచున్నవాటి కకృత్రిమును. నీవు సహజ ప్రకృతిని చూడ దలంచిన. క్రూర మృగముల ఝాంకారవములతో, అనుచితంగా, అన్యాయంగా కాటు వేయ కాచుకొనియున్న విషసర్పముల బుస బుసలతో, ఇంకా అనేక మృగముల రుస రుసలతో. నిండియున్న దట్టమైన అడవి కేగవలయును. ఈ కృత్రిమ కొలను వగలి భయంకర ధ్వనితో, తీవ్రంగ ప్రవహించుచున్న నదులను చూడుము అందు పెద్దపెద్ద మసళ్లు మనుష్యులను మింగపొంచియుండును— సుఖం ప్రకృతిలో నున్నదో? లేక కృత్రిమములో నున్నదో? అప్పుడు నీవు చెప్పగలవు"

బీజగుప్తుడు విరామము లేకుండా మాట్లాడు చుండెను. యశోధర చకితురాలై బీజగుప్తుని ముఖమును చూచు చుండెను ఇప్పటివరకూ ఆమె బీజగుప్తుని ఒక చరిత్ర ప్రధానుడనియే భావించెను. కాని బీజగుప్తునిలో ఉచ్ఛ చరిత్రతతో పాటు. ఉచ్ఛశ్రేణికి చెందిన మస్తిష్కంగూడా నున్నట్లు ఆమె ఇప్పుడే గ్రహించెను. బీజగుప్తుని విద్వత్తతా, స్వయంశక్తి, తార్కిక శక్తిని చూచి అబ్బురపడెను. వారియెడ ఈమెనున్న శ్రద్ధా భావం. భక్తిగా పరిణామము పొందసాగెను. ఆమె కొంత తడవాగి ఇట్లు ప్రశ్నించెను— "ఆర్యా నా ఈ అనుచిత ప్రశ్నకు క్షమించండి. తమగు ఇవన్నీ ఎక్కడ— ఎప్పుడు చదువు కున్నారు?"

వాస్తవానికి ప్రశ్న అనుచితమైనప్పటికి బీజగుప్తుడు అటు ధ్యానముంచక ఇట్లు జవాబిచ్చెను — "దేవీ యశోధరా!

ప్రపంచమనే పాఠశాలలో, అనుభవమనే శిక్షాప్రణాళికతో, పరిస్థితులనే అధ్యాపకులు నాకివన్నీ బోధించారు — అల్పాహార సమయమైనది — ఇంక పోవుట మంచిది!" బీజగుప్తుడు విశ్రామ భవనంవైపుకు మరలినాడు. యశోధర అతనిని అనుసరించింది

బీజగుప్తుడు అప్రసన్నంగా నున్నట్లు అతని ముఖమే చెప్పుచున్నది. "ఆర్య బీజగుప్త! నేడు అన్యమనస్కులైనారేల? తమరు దుఃఖితులా కనుపించుతున్నారు. కారణం చెప్పగలరా?"

ఒక దీర్ఘ విశ్వాసమిడచి బీజగుప్తుడిట్లనెను — "అవును దేవీ! నేను దుఃఖితుడను. నా దుఃఖానికి కారణం తెలుసుకొని నీవేమి చేస్తావు? కారణం తెలుసుకోకపోవడమే నీ కుచితము."

"కారణం రహస్యమా?"

"కాదు. నాజీవితానికి రహస్యమంటూ లేదు. అనుచితమైన విషయం రహస్యంగా నుంచబడుతుంది. రహస్యంగా నుంచుట పిరికితనానికి ద్యోతకము. భయభీతుడగుట మనుష్యుని అపరాధమునకు ప్రతిరూపం. నేను చేసేది ఉచితమని తలంచియే చేయుచున్నాను. కనుక రహస్యానికి ఆస్కారంలేదు. తన దుఃఖాన్ని అభివర్ణించి ఇతరులకు దుఃఖం కలుగ చేయుట అనుచితమని కారణం తెలుప నిరాకరించాను."

ఈ సందర్భాన్ని రేపి బీజగుప్తునకధిక దుఃఖాన్ని కలుగ జేస్తున్నానని తలంచి యశోధర నిశ్శబ్దురాలైంది. ఇంతలో ఇరువురూ విశ్రామ భవనానికి చేరుకొన్నారు. మృత్యుంజయ

శ్వేతాంకులు వీరిరాకకై నిరీక్షించుచుండిరి. అల్పాహారము సిద్ధమైనది. యశోధర పరుగెత్తి తండ్రిగార్ని కౌగలించుని "నాన్నగారు! నేడు బీజగుప్తులు చెప్పిన మాటలవలన నా భ్రమ, నా నేత్రాలలోనున్న అజ్ఞానం దూరమైంది. నా వెను కటి భావాలన్నీ నిర్మూలమని రుజువుచేశాను. ఆర్యులు గొప్ప విద్వాంసులని నేను నేడే తెలుసుకొన్నాను" అంటూ యశోధర బీజగుప్తుని చూచుచుండెను.

యశోధర తనదృష్టిని శ్వేతాంకునివైపుకు త్రిప్పింది— శ్వేతాంకుని ముఖం వెల్లనై యున్నది— అతడు ఏదో కారణం వల్ల పీడితుడైనట్లు అతని ముఖమే చెప్పుచున్నది. యశోధర శ్వేతాంకుని చేయిపట్టుకొని— "శ్వేతాంక్! మీరు అస్వస్థతగా నున్నట్లున్నారు!" అని నాడిని పరీక్షించి "—ఊ... హు ...జ్వరంలేదు— అయినా ముఖం తెల్లబారినట్లుంది?" అన్నది.

"శ్వేతాంకుడు బహుశా విశ్రాంతి లేక అలసిపోయి ఉంటాడు. శ్వేతాంక్! నీవు రెండు ఝాములవరకు హాయిగా నిద్రించుము అన్నాడు బీజగుప్తుడు.

యశోధర ఇంకనూ శ్వేతాంకుని చేయిని పట్టుకొనియే యున్నది. శ్వేతాంకుని ముఖం కొంచెం పరివర్తనం చెంద సాగింది. "లేదు!... నేను స్వస్థతగానే యున్నాను. కొంచెం అలసటగానున్నది. విశ్రాంతిలో అలసట తీరిపోతుంది" అన్నాడు శ్వేతాంకుడు—

అల్పాహారవిందారగించిన తరువాత బీజగుప్తుడు శ్వేతాంకునితో ఇట్లనెను— "శ్వేతాంక్! నాకు చాలా అలసటగా

నున్నది. నిద్రించెదను భోజనం తయారుకాగానే మేల్కొలుపుము. నీవు మృత్యుంజయుని మంచి చెడ్డలను చూస్తూ ఉండు—"

మిగతా ముప్వురూ ఒక్కచోట కూర్చుండి సంభాషించు చుండిరి. యశోధర ప్రాతఃకాలమున ప్రకృతినిగురించి జరిగిన తర్కమును వినిపించెను. బీజగుప్తుని తర్కశక్తిని విని మృత్యుంజయుడు అబ్బురపడెను

"శ్వేతాంక్! బీజగుప్తుడు కొంచెం అస్వస్థతగా నున్నట్లున్నాడేమి?" అని ప్రశ్నించాడు మృత్యుంజయుడు.

శ్వేతాంకుడు జవాబివ్వక పూర్వమే యశోధర ఇట్లు చెప్పింది— "అవును! నేనూ అలానే భావించి అడిగాను. దుఃఖితుడ నేనని వారు అంగీకరించారు. కాని కారణం మాత్రం చెప్పననిరి" యశోధర దృష్టి శ్వేతాంకునివైపుకు తిరిగింది.

"ఎన్నో విషయాలు గుప్తరూపంలో ఉంటాయి" అన్నాడు మృత్యుంజయుడు.

"మనుష్యునిలో రహస్యమంటూ ఉండడం కలుషితమునకు ద్యోతకం. కాని మనుష్యుడు తన విషయములను. ఇతరు తెలుసుకొని సహానుభూతి చూపుటకు బదులు, విమర్శించి అవహేళన చెస్తాడనే భయంతో. కొన్ని విషయాలను రహస్యంగా నుంచుతాడు. కాని బీజగుప్తుని దుఃఖానికి కారణం రహస్యం మాత్రంకాదని చెప్పగలను. ఆ విషయం వారు నాతో స్వయంగాచెప్పినారు."

"బహుశా ఈపరిభాషగూడా బీజగుప్తాచార్యులదే నేమో?" అన్నాడు వ్యంగ్యంగా శ్వేతాంకుడు.

"అవును! యథార్థమే!– దీనిలో ఏమైనా తప్పున్నదా?" అని ఆశ్చర్యంగా అడిగింది యశోధర.

"లేదు! సమర్థనకు– దీనిలో తప్పేమీలేదు – సమాజాన్ని తిరస్కరించి, సర్వత్యాగినై, జీవితాన్ని గడిపేవ్యక్తికి ఈ సిద్ధాంతం సర్వదా ఉపయుక్తంగానే ఉంటుంది. కాని ప్రపంచం సమర్థనీయమైనదిగాదు, ఉదాహరణకు నేనుచాలు– నేను బీజగుప్తుని సేవకుడను. నాకి ఆజ్ఞపాలనే నా కర్తవ్యం– నాలోగూడా వ్యక్తిత్వం ఉంది. కాని దానిప్రయోజనమేది? నేను పరాధీనుడను... అప్పుడప్పుడు నా హృదయింలో విరోదాగ్ని ప్రజ్వలించుచుండును. అప్పుడు విరోదాగ్నిని పెంచి పెద్దదానినిచేసి, కలహాన్ని ఉత్పన్నం చేయడం ఉచితమా? లేక దానిని అణచి చల్లార్చి కర్తవ్యరతుడనగుట ఉచితమా? ఈ ప్రశ్నకు జవాబుగూడా స్పష్టమే."

"వత్సా శ్వేతాంక్! నీ విరోధము నణచుటయే ఉచితము. కనుక దానిని రహస్యంగా నుంచుటయే ధర్మం."

యశోధర మెల్లగా ఇట్లన్నది—"మీ ఈ విరోధం అనుచితంగాదు— కాని శ్వేతాంక్! నేను మీ ప్రస్తుతస్థితిని చూచి విచారిస్తున్నాను" శ్వేతాంకుడు యశోధర ముఖమండలమున సహానభూతి మిశ్రితమైన ఒక ప్రేమప్రకాశాన్ని చూచాడు–

# 16

ఇతరులను తనవైపుకు ఆకర్షింపజేసుకొని. ఇతర వ్యక్తిత్వాలను అణచి తమదాసులుగా చేసుకొనే వ్యక్తిత్వాలు కొన్నిఉంటాయి. చిత్రలేఖవ్యక్తిత్వం అందుబోలియేయుండును. చిత్రలేఖ తన ఆకర్షణ శక్తిని తాను గుర్తించకయే, తలవని తలంపుగా దాని ప్రయోగం చేయుచున్నది. కుమారగిరి తనను తానాపుకోలేకుండెను.

ఒకే కుటీరంలో కుమారగిరి చిత్రలేఖ నివసించుచుండిరి. కుమారగిరి చిత్రలేఖను దూరంగానుండ తలంచుచుండెను. కాని ఆరోజు కారోజు అతని మనస్సు ఆమెను సమీపించుచుండెను. యోగికుమారగిరి తనస్థితికితాను అబ్బురపడుచుండెను. కుమారగిరి ధ్యానావస్థితుడైనప్పుడు చిత్రలేఖ ఒక ఉత్తమ గృహిణిలాగా అంకు సామానుల నిటునటు సర్దుచుండెను. కుమారగిరిధ్యానావస్థితుడు కాజాలకుండెను. అతని నేత్రాలు వాటంతటవియే తెరచుకొని చిత్రలేఖను చూస్తూన్నాయి. మరుక్షణంలోనే కుమారగిరి కండ్లుగట్టిగా మూసుకొని ధ్యానావస్థితుడవ్వ ప్రయిత్నించుచుండెను. కాని అతనికాకార్యం. అతికఠినమై అసంభవమగుచుండెను.

మరి, చిత్రలేఖో!— — ఆమె కుమారగిరిని ప్రేమించ కుటీరమునకు వచ్చెను— కాని వచ్చిన తరువాత ఆమె అభిప్రాయం మారిపోయింది— ఆమె ఇప్పుడు సాధనా మార్గాన్ని అవలంభించ తలంచింది. తపస్సును చేయకోరుచున్నది— కుమారగిరి మార్గానికి అవరోధం కలుగచేయ కోరుటలేదు.

రెండు ఝాములు దాటిందా రాత్రి. దీపము వెలుగుచున్నది. కుమారగిరి ధ్యానావస్థితుడయ్యే సమయమైంది. ఆయన తన ఆసనాన్ని అధిష్టించారు. కుమారగిరి గట్టిగా కండ్లు మూసుకొన్నాడు— కాని ధ్యానమగ్నుడు కాజాలక పోయెను. యోగి ధ్యానావస్థితుడైయ్యెనని ఎంచి, చిత్రలేఖ కుటీరమున ప్రవేసించి తన ఆసనముమీద కూర్చుండెను. చిత్రలేఖ కాళ్ల చప్పుడు విని, కుమారగిరి నేత్రాలను తెరచి మెల్లగా— "దేవీ చిత్రలేఖా!" అన్నాడు.

చిత్రలేఖ త్రుళ్లిపడి— గురుదేవ! క్షమించండి! పొరబాటుజరిగింది. తమరుధ్యానావస్థితులు కాకపూర్వమేవచ్చాను. వెళ్లుచున్నాను—" అన్నది.

కుమారగిరి ఒక విచిత్రమైన చిరునవ్వు నవ్వి— "చిత్రలేఖా! వెళ్లనవుసరంలేదు. కూర్చుండుము. నేడు నేను తపస్సు చేయను. నీతో సంభాషించవలెను" అన్నాడు.

చిత్రలేఖ కూర్చుండెను. "చిత్రలేఖా! మనుష్యుడు కర్మమార్గాన్ని— ధర్మమార్గాన్ని సమన్వయించి జీవితాన్ని గలుప గలడా?" యని ఆలోచించుచున్నాను.

"నా కర్థంకాలేదు"

"నీవు నావద్దకు దీక్షగొనవచ్చిన రోజున మిమ్ముల ప్రేమిస్తున్నానంటివి!"

"అవును! యదార్థమే!"

"అయితే ప్రేమకు అర్థమేమిటి?"

"ప్రేమంటే రెండు ఆత్మలమధ్య సంబంధాన్ని స్థాపించడమే.

కుమారగిరి కొంచెంసేపు మౌనంవహించి—"అయితే ఈ పరిభాషననుసరించి ప్రేమ కేవలం రెండు ఆత్మలమధ్య జరుగగలదు—ఇద్దరు వ్యక్తులమధ్యకూడా ప్రేమ జరుగగలదు.— మనుష్యునకు బ్రహ్మకు మధ్య ప్రేమపుట్టగలదా ?" అని ప్రశ్నించాడు.

"తమ సిద్ధాంతము ననుసరించి ఆత్మ బ్రహ్మయొక్క భాగమే— కనుక బ్రహ్మతోకూడా ప్రేమ జరుగగలదు.

"నేడు నేను ఒక క్రొత్తవిషయమును ఆలోచించుచున్నాను చిత్రలేఖా ! విరాగం మనుష్యునకు అసంభవం. ఏలయందువా ? విరాగం నకారాత్మకమైనటువంటిది. దాని ఆధారం శూన్యం. వేరొకటిలేదు — ఇట్టిస్థితిలో ఫలానవ్యక్తి విరాగి అనుట పొరబాటు —వాడు ఈ ప్రపంచంఎడ విరాగియే కావచ్చు, కాని ఏదో ఒకదానియెడ అనురాగం కలిగియుంటాడు. ఆ అనురాగ కేంద్రం బ్రహ్మకావచ్చు లేదా ... జీవితలక్ష్యం రచనాత్మకము— వినాశాత్మకము మాత్రంకాదు. 'బ్రహ్మయెడ అనురాగము' అనిన దానియర్థము— బ్రహ్మేతర వస్తువులయెడ ఉపేక్షాభావము— లేదా విరాగమేగదా? వాస్తవంగా విరాగిననే చెప్పుకొనేవ్యక్తి విరాగికాడు — అతడు ఈశ్వరానురాగి. ఈ విషయం మరేమంత మహత్తరమైనది గాదు — రెండవ విషయము మహత్వపూర్ణమైనటువంటిది. ప్రపంచముయెడ విరాగము — బ్రహ్మఎడ అనురాగము — ఈరెండూ ఒకటేనా ?"

చిత్రలేఖ ఈ మాటలను విని భయపడింది. ఆమెకు కుమారగిరి మనఃప్రవృత్తి బాగా తెలుసు. బహుశా కుమార గిరి బలహీనతనుగూడా గుర్తించియే ఉండవచ్చును. "దేవా! నేను ఈప్రశ్నకు తగిన జవాబిచ్చేటంతటి సమర్థురాలనుగాను. నేను గురుదేవులవద్ద జ్ఞానాన్ని పొందడానికొచ్చాను. గురు దేవుని కృపబడసి జీవితలక్ష్యాన్ని గుర్తించడానికొచ్చాను — బ్రహ్మాన్ని తెలుసుకోడానికొచ్చాను –" అన్నది వినయంగా చిత్రలేఖ.

కుమారగిరి తల క్రిందికి వాలింది. సాధనాశక్తి ఆ అపరాధహృదయాన్ని అణగద్రొక్కింది. "దేవీ! నిజం పలుకు తున్నావు. జ్ఞానం తర్కించితే వచ్చేదిగాదు – అనుభవంతో చూడవలసిందే. ఈకుతర్కం నాలో ఎందుకు లేచిందో? నాకే తెలియదు. కాని ఈతర్కం ప్రబలరూపాన్ని ధరించింది. ప్రపంచాన్ని ఉపేక్షించి ఈశ్వరునియెడ అనురాగముంచ గలుగుతామా? ఈప్రశ్నకు అనివార్యంగా జవాబివ్వాలి. లేకున్న ఈమనస్సుకు శాంతిలేదు."

చిత్రలేఖ జవాబుకోసం తడుముకోసాగింది – ఆమె తనలో ఒక విచిత్రపరివర్తనమును చూచింది ముందు కుమార గిరిని ప్రేమించవచ్చింది – ఆచరణలో ప్రేమించలేకున్నది — ఆయనపూజ సలుపజాలకున్నది అచ్చటేమీ పొందజాలదు గూడా. పట్టణ అశాంతిమయ వాతావరణానికి ఆమె భయ పడింది. నిర్జనవాతావరణంలో సాత్విక ప్రకాశంలో, విశ్వాస మనే పరదాచాటున ఆమె సుఖాన్ని చవిచూచింది. ఆనందో ల్లాసమయ జీవితముచే విసుగుచెందింది. అధిక సుఖమామెను

ఉత్పీడనమైనది. కుమారగిరి కుటీర ప్రశాంతివాతావరణంలో ఆమె సుఖాన్ని తృప్తిపి చూచింది.

కుమారగిరి కొంతతడవల్లే ఆలోచించి ఇట్లనెను — "చిత్రలేఖా! ఇప్పటివరకూ నిన్ను నేను అర్థంచేసుకోలేకపోయ్యాను. ఈ మనఃసంబంధం ఈనాటిదికాదని నాహృదయం చెప్పుచున్నది.—"

కుమారగిరివద్దకు రాకపూర్వం చిత్రలేఖకూడా ఇలాగే భావించింది. "కావచ్చు! కాని నా గతజీవితం చాలా అస్పష్టమైనది. ఇప్పుడు దానిని గుర్తించలేను"

కుమారగిరి పక్కున నవ్వి—"నిజమే, నా అభిప్రాయం పొరబాటు. దేవీ చిత్రలేఖా!— నీలో ఒక గొప్ప ఆకర్షణాశక్తి యున్నది—ఆశక్తిని ఎచ్చట పొందావో? నిజంచెప్పు" అన్నాడు.

చిత్రలేఖ ముఖం ఎఱ్ఱబడింది. ఎన్నో సంవత్సరాల తరువాత ఇప్పుడామెను లజ్జ ఆవరించింది. సిరవంచి— "గురుదేవు! నాలో అట్టి శక్తివున్నదని నాకు తెలియదు" అన్నది.

కుమారగిరి లేచి ఇటునటు పచారుచేయసాగాడు. "నేడు సమాధిలో నామనస్సు లగ్నంకావడంలేదు— నిరాకారమైన ఆరాధనలో నేడు మనస్సు లగ్నపర్చుట చాలా కష్టంగా నున్నది! ఇదంతా ఎందుకు?" కుమారగిరి స్వరం తీవ్రరూపం దాల్చింది. నిరాకార ఆరాధన నేడేల కఠినమయ్యెను ? — హృదయం 'సాకారం... సాకారము...' అని బొబ్బలు పెట్టు చున్నది" కుమారగిరి అప్పటికే చిత్రలేఖను సమీపించాడు. కుమారగిరి నేత్రాలు చిత్రలేఖను కదలక చూచుచున్నవి.

"నర్తకీ! ఇప్పటివరకూ నేను నిరాకారాన్ని ఆరాధించాను. ఇప్పుడు సాకారాన్ని ఆరాధించ కోర్కె జనించుచున్నది. తెలుసుకొంటున్నావా? నేనొక ప్రయోగాన్ని ప్రయోగించ బూనుతున్నాను. అందుకు నీ సహాయం నాకవసరం— నీవు చేసితీరాలి!"

చిత్రలేఖ వణకిపోతున్నది. ఆమె యోగిముఖమును పరికించి చూచింది. యోగిముఖమున అస్పష్టమైన ఛాయ వ్యాపించింది. ఆ సుందర శాంతియుతమైన ముఖమండలమున దట్టమైన వికృతిమేఘాలు ఆవరించాయి తనద్వారా ప్రజ్వలింప చేయబడిన యోగిలోని భయంకర అగ్నిజ్వాలను చూచి చిత్రలేఖ భయభీతురాలైంది. ఆమె లేచి నిలబడింది. ఆమెను జూస్తే చలనశక్తులన్నీ నశించాయా? అనిపించుచున్నది.

కుమారగిరి చిత్రలేఖ హస్తాన్ని పట్టుకొన్నాడు—చిత్రలేఖ ఆపాదమస్తకం కంపించిపోయింది. భగభగమండుచున్న నుప్పుకొగవెలు హస్తాన్ని పట్టుకొన్నవా అనిపించిందామెను. యోగిశరీరమంతా వేడెక్కి మండుచున్నది – "సాకారాన్ని నాదానినిగా చేసుకొనే ప్రయోగం ప్రయోగిస్తున్నాను నర్తకీ ఈ 'సాకారభావాన్ని' నీవె నాలో రేకెత్తించావు. అందుకనే ఇందుకు నీవు తోడ్పడాలి తెలిసిందా ? ..."

చిత్రలేఖకు అంతా తెలుసు ... అసలందుకే ఇచ్చట కొచ్చింది — కాని అనుకున్న దానికి వ్యతిరేకంగా జరిగింది... ఆమె చల్లనిమలయపవనాలతో ఆటలాడ తలంచి వచ్చింది... తీవ్రంగా మండే మంటలో పడి మండిపోదామని రాలేదు. "గురుదేవ్!" అన్నది.

కుమారగిరి చిత్రలేఖను తన బాహుబంధనంలో గట్టిగా బంధించాడు. అతని అధరములు ఆమె అధరములతో కలుసుకొన్నాయి. 'సఖీ! నేనునిన్ను ప్రేమిస్తున్నాను!' అన్నాడుయోగి.

చిత్రలేఖ కుమారగిరి ఒడచే వేసి శ్వాసను తాళలేకున్నది. ఆమె బలవంతముగా కుమారగిరి ముఖాన్నుండి తన ముఖాన్ని తొలగించి ఇట్లన్నది. "గురుదేవ! తమరు మార్గభ్రష్టులవు చున్నారు — తమసాధననుండి విరతులవుచున్నారు" కుమారగిరి బలమైన బాహుబంధం సడలి పోయింది. యోగి త్రుళ్ళిపడి వెనుకకు తగ్గాడు. ఆ కండ్లలోని పిచ్చితనం క్షణాలలోనే లుప్తమైంది. ముఖం వివర్ణత నొందినది. "అరె...! నేనేమి చేశాను? కుమారగిరి బిగ్గరగా — "నన్ను క్షమించాలి దేవి" అనిఅరుస్తూ అతివేగంగా బైటకు పోయెను.

చిత్రలేఖ అచ్చటనే కూర్చుండి గడచిన ఘటనలను గురించి ఆలోచించు చుండెను — కుమారగిరి వద్దకొచ్చింది— ఇప్పుడు తిరిగివెళ్లాలను కొంటున్నది — ఆమె భూమిమీదనే పడుండి ఎక్కిఎక్కి ఏడ్వసాగింది. ఆమె చెడుచేసింది — ఇది చెడ్డదని ఆమెకు తెలుసు — ఆమె స్వయంగానే పతనమైనది — ఇతరులను పతన మొనరించింది — ఇదే ఆలోచిస్తూ ఆమె నిద్రించింది.

కుమారగిరి బైట మైదానంలో అటు ఇటు తిరుగ నారంభించాడు ఇంతకు పూర్వం అతని శరీరం మండిపోయింది. ఇప్పుడో! మస్తిష్కమే మండసాగింది. మొదటి మంటలో సుఖమున్నది — రెండవమంటలో దుఃఖమున్నది, కుమారగిరి

తన కార్యక్షేత్రంనుండి, సాధనా మార్గమునుండి, పతనము కాజొచ్చెను — నిర్బలత్వాన్ని జయించడమే అతనికర్తవ్యం.

ఎదుట గాఢాంధకారం — వెనుక పాటలీ పుత్రం లోని దీపాలు మినుకు మినుకు మంటూ వెలుగుచున్నవి. కుమారగిరి కాళ్లు గాఢాంధకారం వైపుకు సాగినాయి — "ఊ...హు...నన్ను నేనాపు కోవడం అసంభవం ...పతనం అనివార్య...తనను తాను రక్షించుకోవలసి యున్నది" అనుకొంటూ యోగి చాల దూరమేగెను.

యోగి కుమారగిరికి తన అంతరవాణికి తర్కంజరుగ నారంభించింది. యోగికిలా వినపించింది. నీవు పిరికి పందవు...!

"ఎందుకని?"

"నీవెచ్చట కేగుచుంటివి? నిర్బలత్వాన్ని జయించడమే గొప్పసాధన. నీ వీ నిర్బలత్వాన్ని జయించనంతవరకూ, అపూర్ణుడవు. ఇందుకనే చిత్రలేఖ నీవద్దకొచ్చింది నిన్ను నీవు జయించు. చిత్రలేఖను జూచి భయపడుచుంటివా? నీ పతనానికి చిత్రలేఖ కారణంగాదు. నీ నిర్బలత్వమే నిన్ను భయపెట్టుచున్నది. సాధనయనెడి అమూల్య ఆయుధం నీవద్దనున్నది. ఈ ఆయుధ సహాయంతో నిర్బలత్వాన్ని దూరంచేయి"!

కుమారగిరి ఆగిపొయ్యాడు. "అయితేసరే" అని మెల్లగా అనుకొని కుటీరమును చేరుకొన్నాడు. అప్పుడు కుటీరంలో చిత్రలేఖ నిద్రించుచున్నది. ఆమె నునుపైన చెక్కిళ్ళ మీదుగా ప్రవహించిన అశ్రుధారలు ఎండిపోయి చారలు

చారలుగా కనుపిస్తున్నాయి కుమారగిరి చిత్రలేఖ శిరము ప్రక్క నిలబడి ఆమె ముఖమును కొంతతడవట్టే చూచెను. యోగి చిత్రలేఖ ముఖమండలమున ఒరిగెను. చిత్రలేఖ ఎర్రని అధరములలో చిరునవ్వు లోపించలేదు యోగి తన అధరములను ఆమె అధరములకు జోడించాడు. కాని స్పర్శామాత్రించే వెనుకంజ వేశాడు. చిత్రలేఖ అధరములు ఎంత చల్లగా! ఎంత నిర్జీవంగా నున్నవి... !

కుమారగిరి ఏదియో ఆలోచించుచూ తన ఆసనంమీద కూర్చున్నాడు. తిరిగి సాధనలో నిమగ్నుడవ్వ యత్నించాడు. ధ్యానావస్థితుడు మాత్రం కాజాలకపోయ్యాడు. అటుపిమ్మట భవిష్యత్ లో విజయాన్ని పొందాలనే మధుర కల్పనలతో నిద్రించాడు.—

# 17

చిత్రలేఖ ప్రాతఃకాలమున లేచీ లేచుటతోడనే యోగి కుమారగిరిని నిత్యనియమానికి విరుద్ధంగా నిద్రించుచుండుట గాంచెను. ఆమె కుటీరము వెలుపలకు వచ్చెను. ఆమెకాసమయమున సిరోభారముగా నుండెను. శరీరం వేడెక్కి భగభగలాడుచుండెను. రాత్రి యంతా దుఃస్వప్నాలను గాంచుటచే హృదయం ధడధడ లాడుచుండెను.

అది సూర్యోదయం కానున్న సమయం. అప్పుడప్పుడే వికసించుచున్న క్రొంగ్రొత్త పుష్ప సౌరభ భారముచే మందగతిని వీచుచున్న ప్రాతః కాలీనపవనంలో పక్షులకలవరము లీనమై ప్రతిధ్వనించు చుండెను. చిత్రలేఖ బైటకొచ్చి నిల

చింది. ఎదుటనేయున్న వటవృక్షంక్రింద విశాలదేవ్ ఆరాధ
నలో నిమగ్నుడై కూర్చునియుండెను.

చిత్రలేఖ నిలబడియే ఆలోచించు చుండెను. కుమార
గిరి వద్దకుండుట ఉచితమా? కాదా? అన్నవిషయ సమస్యను
విడుతేయ ప్రయత్నించుచున్నది. అయితే ఇప్పుడెక్కడకు పోగ
లదు? అథవా వెళ్లినా బీజగుప్తుడతిరిగి స్వీకరించునా? ఆమెలో
ఉత్పన్నమయ్యే ఈ ప్రశ్నలకు ఆమె జవాబివ్వుకోలేకుండెను.
చిత్రలేఖ అప్పటినుండి ముందుకుసాగి విశాలదేవ్ దరిజేరెను.
అప్పటికి విశాలదేవ్ నైనాలను తెరచి చిత్రలేఖనుచూచి గౌర
వంగా "నమస్కారము దేవీ!" యనెను.

చిత్రలేఖ మనంబున అగస్మాత్తుగా ఒక ఆలోచనలేచెను.
కాని "నమస్కారము" అనిమాత్రం అనిపోయింది — నేను
చిత్రలేఖ తనవద్దకు రావడం చూచి' విశాలదేవ్ ఆశ్చర్య
చకితు డయ్యెను. "దేవీ! నాతో ఏమైనా చెప్పాలా?"
అన్నాడు.

"అవును. నేను చెప్పేది సామాన్య విషయంకాదు.
చాలా గొప్పదైనది. మహత్తరమైనది — అపురూపమైనది
కూడా — నీవు ఇతరులకు చెప్పనని ప్రతిజ్ఞ చేస్తే చెప్పగలను"
"నేనెవరికి చెప్పనని ప్రతిజ్ఞచేస్తున్నాను"

"విశాలదేవ్! అయితే విను— నేనిచ్చటికివచ్చి చాలా
పొరబాటు చేశానను కొంటున్నాను. నేను ఉన్నత పథాన్ని
చేరవచ్చి చేరలేక అతఃపతనమయ్యాను"

విశాలదేవ్ చిరునగవు నగుతూ "అవును!" అన్నాడు. విశాలదేవ్ నవ్వులో వ్యంగ్యం ఇమిడి యున్నట్లు ఆమె గ్రహించింది. "నీవు నామాటలను విశ్వసించ లేక పోతున్నావు. అందుకనే నవ్వుతున్నావు. అవును! నీవు ఆ రాత్రి కుమారగిరి నావద్ద నుండగా చూచితివి. నేనిప్పుడు స్పష్ట పరుస్తున్నాను. నేనిచ్చటకొచ్చి, నా ఆశయాన్ని పూర్తి చేసుకోలేక పొయ్యాను. తీరావచ్చిన తరువాత వెనుతిరిగి చూశాను. పెద్దతప్పు చేశాను. పతనమయ్యాను. ఇంకా అతిగా పతనమవ్వ తలంచుటలేదు. నాతోపాటు కుమారగిరిని కూడా పతనమొనర్చితిని. ఇంతకుమించిన మహాపాపం మరొకటిలేదు. ఈ పాపపరిహారంకోసం నీవునాకు సహాయం చేస్తావా? చెప్పు?"

"తప్పకుండా చేస్తాను".

"విశాలదేవ్! నీవు బీజగుప్తుని భవనమెరుగుదువా?"

"ఎరుగుదును."

"ఆయన భవనంలో శ్వేతాంకుడనే ఒక నవయువకు డున్నాడు, అతనితో నేను కలుసుకోగోరుచున్నానని చెప్ప వలయును"

"మంచిది"

ఇంతలో కుమారగిరి కుటీరం వెలుపలకొచ్చెను. అతనిని చూచుట తోడనే సంభాషణ ఆగిపోయినది. కుమారగిరి పెద్ద నేరస్తుని లాగా సిరవొంచి వీరి ఎదుటకొచ్చి నిలబడెను. కొంచముసేపు ముగ్గురునూ మౌనం వహించిరి. తుట్టతుదకు కుమారగిరియే మౌనమును భంగపరుస్తూ — "నేడు నేను

నియమానికి విరుద్ధంగా ప్రొద్దెక్కేందాకా నిద్రించినందులకు విచారిస్తున్నాను" అన్నాడు. ఈ మాటలను మాత్రం అని కుమారగిరి ముందుకు సాగిపోయెను. విశాలదేవ్ కుమారగిరి ముఖమున ఒక విచిత్రమైన భావపరివర్తనమును చూచెను. ఈ పరివర్తనానికి ఆశ్చర్యపడి విశాలదేవ్ చిత్రలేఖవంక చూడ సాగెను. "దేవీ! నేడు గురుదేవ్ అస్వస్థతగా నున్నట్లున్నారు" అన్నాడు మెల్లగా విశాలదేవ్.

"అవును! గురుదేవులు అస్వస్థతగానే యున్నారు. ఇందుకుకారణం నేనిచ్చట నుండుటయే. విశాలదేవ్! నీవు నాసహాయం కేవలం నాకొరకేంగాదు —— మీ గురుదేవుని కొరకుగూడా చేయవలెను.

"నేను తప్పక చేస్తాను. ఇప్పుడే బీజగుప్తుని యొద్ద కేగి వచ్చెదను"

కుమారగిరి కుటీరంనుండి చాలా దూరమరగెను. అతడు రాత్రివరకూ తిరిగి రాలేదు. సాయం సమయానికే విశాలదేవ్ పాటలీపుత్రంనుండి తిరిగివచ్చి చిత్రలేఖతో నిట్లనెను. – "దేవీ! ఆర్యబీజగుప్తులు కాశీయాత్రకరిగిరి"

గోరుచుట్టుపై రోకటి పోటనునట్లు చిత్రలేఖ ఆమె దుర్విధికి ఆమె చింతిల్లుచుండ ఈ చిచ్చుల పిడుగు వార్త యొకటి తోడయ్యెను. ఆమె నిర్జీవురాలైంది. ఆమె బరువెక్కిన ముఖాన్ని పైకెత్తి – "విశాలదేవ్! ఇప్పుడింక ఉపాయమేది?" అన్నది.

"దేవీ! నాకేమియూ తోచకున్నది"

"నీకేమియూ తోచుటలేదా? నాకునూ ఏమితోచకున్నది. ఇది నాదుర్భాగ్యము" ఆమె కొంతతడవల్లే మౌనము వహించి ఒక అజ్ఞాతసూన్యంలో ఏదియో వెదకుచుండెను. "ఇది నాదుర్విధి బహుశా చేసినపాపానికి ప్రతిఫలమేమో? ఒక్కగానొక్క ఆధారాన్ని విడచాను బీజగుప్తుని ఎందుకు త్యజించాను? – కాదు– కాదు – నేనిచ్చటకు జ్ఞానో పార్జనకు వచ్చాను — అయితే ఇదేనా పొందవలసిన జ్ఞానం! భగవంతుడు నాకు జ్ఞానానిస్తున్నాడు — అయితే ఇదంతా దేనికి? — విశాలదేవ్! ఇందుకు నీవు నేనూ గురుదేవులు గూడా ఏమీ చెయ్యలేము. ఆఖరుకు భగవంతుడు గూడా ఏమీచెయ్యలేడు. కానున్నదేదో కాక మానదు" చిత్రలేఖ నేత్రాలు పిచ్చివాని నేత్రాలువలె మిల మిలా మెరుస్తున్నాయి — ఆమె ప్రశాంతముఖమండలము వికృతరూపము దాల్చెను. ఆమె ఆవేశంతో కంపించి పోయింది –

విశాలదేవ్ చిత్రలేఖ భీకరరూపానికి భయభీతుడై, "దేవీ! మీరు గతజీవితాన్ని అనుసరించ లేరా?" అని మెల్లగా ప్రశ్నించాడు —

చిత్రలేఖ ఫక్కున నవ్వి – "గత జీవితాన్ని తిరిగి అనుసరించుటయా? ఎంత అమాయకంగా ప్రశ్నించావు? నేను చాలాముందుకు సాగివచ్చాను — వెనుదిరగడానికి కాదుసుమా? — వెనుకంజ వేయడం పిరికితనం — పైగా సమాజానికి విరుద్ధం — ఈ ప్రపంచంలో ఎవరు వెనుకడుగు వేయగలరు? అట్లుఎవరు చేయగలిగారు? ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తూ మనుష్యుడు మృత్యువును చేరుచున్నాడు—

వెనుతిరగ గలిగితే అమగుడు కాజాలడు — ముందుకే — ఎప్పుడూ ముందుకే — పుణ్యమే కాని, పాపమే కాని ముందుకు సాగుటయే సహజ నియమము. తెలుసా? ” అని ఆమె అక్కడనుండి వెళ్లిపోయింది విశాలదేవు తన ఎదుట నుండి పోవుచున్న ప్రతిమను చూస్తూ నిలబడిపోయెను.

చిత్రలేఖ ముందుకు సాగిపోయింది— ఒక లతాకుంజము మీద కూర్చున్న కుమారగిరినిచూచి ఆ వైపుకేపోయెను. కుమారగిరి చిత్రలేఖనుచూచి లేచి నిలబడినాడు. “నేను గురుదేవులు దినమంతా కుటీరమునకు పోలేదా?” యని చిత్రలేఖ ప్రశ్నించింది.

“పోలేదు. నర్తకీ! నిజంగా... కుటీరమునకు వెళ్ళడం ......అబ్బా...మహాభయంకరము...!”

“అవునుగాని, ఇందుకు ఉపాయమున్నది.”

“ఉపాయమా? ఒకటే ఉపాయమున్నది నర్తకీ! ఆ ఉపాయం నీకు తెలుసు. సాకార పూజయందు నాకు విశ్వాసం కలగింది. నీ సహాయం లేకుండా సాకారపూజ జరుగుట అసాధ్యం.”

“సాకారపూజ వట్టి భ్రమ.”

“అది భ్రమో! కాదో! నిర్ణయించడం నీ పనిగాదు. నర్తకీ! నీవు నా శిష్యురాలవు నా మాటను అంగీకరించడమే నీ కర్తవ్యం” అంటూ కుమారగిరి తిన్నగా ఠీవిగా నిలబడ్డాడు.

ఈ సారి చిత్రలేఖ భయపడలేదు— సంకోచించలేదు— నిస్సంకోచంగా ఇట్లన్నది— “యోగి! మిమ్ములను మీరు

మరువకండి. మీ ఇష్టంవచ్చినట్లు శాసనం చలాయించడానికి మీ ఎదుట నున్న స్త్రీ నిస్సహాయురాలుకాదు. మీరు నాకు గురుదీక్ష నిచ్చామను కొంటున్నారు. అది భ్రమ. ఇక్కడ మిమ్మల్నిమీరే స్వయంగా మోసగించు కొనుచున్నారు. ఏవ్యక్తినైతే మీరు మీశాసనం క్రింద అధికారాన్ని చెలాయించి, అణచ చూస్తున్నారో, ఆవ్యక్తికి మీరు స్వయంగా దాసులైపోతిరని గుర్తించలేదా ?"

కుమారగిరి నిస్తేజుడై కూలబడ్డాడు. అతడు దీనంగా "నర్తకీ! నిన్ను నేను మనసారప్రేమిస్తున్నాను" అన్నాడు -

చిత్రలేఖ నవ్వి — "మీరు నన్ను ప్రేమించుచున్నారని నాకు తెలుసు. కాని నేను మిమ్ము ప్రేమించుట లేదు! ఒక క్షణంపాటు మీ మీద ఆధిపత్యాన్ని పొందాలనే కోర్కెకలిగింది. అందుకు యత్నించాను — సఫలీకృతురాలనైయ్యాను — దానికేంగాని, పురుషునిపై ఆధిపత్యాన్ని పొందాలనే కోర్కె స్త్రీకి కలుగుట ప్రేమకు ద్యోతకం కానేరదు. ప్రకృతి స్త్రీని శాసకురాలునిగా పుట్టించలేదు — శాసితగా మాత్రమే పుట్టించింది. ఆత్మబలిదానం చేయడానికే స్త్రీ పుట్టబడింది. తనకంటే నిర్బలులను ప్రేమించజాలదు. స్త్రీ క్షేత్రం ఆత్మసమర్పణయే. తన అస్థిత్వాన్ని, ప్రేమకుని, అస్థిత్వలంలో లీనంచేయడమే. కనుక ఏవ్యక్తి తనమీద విజయం పొందుతాడో, ఆవ్యక్తినే స్త్రీ ప్రేమించ గలుగుతుంది. యోగి! ప్రస్తుత సమస్య అందుకు భిన్నంగానున్నది. ఆధిపత్యాన్ని పొందడమే పురుషుని ప్రేమ. స్త్రీ ప్రేమ తన సర్వ

సాన్ని పురుషునకు అర్పించడమే. కాని ఇప్పుడు ఇట్లు జరుగ లేదు. ఇప్పుడు నేను యజమానురాలను. మీరు నాదాసులు. నేను మీమీద ఆధిపత్యాన్ని పొందాను. మీరు ఆత్మ సమర్పణ చేశారు. ఏ బలాన్నాధారంగా గొని మీరు నా ప్రేమ నాసించుచుంటిరి ? ”

యోగి కుమారగిరి నిశ్శబ్దముగా వింటున్నాడు. నర్తకి చెప్పింది కఠోరముగా నున్నప్పటికీ సర్వదా సత్యం. ఈసారి యోగి బలహీనతను అర్థం చేసుకున్నాడు. తన పరాజయ వికారాల రూపం తన కండ్లకు కట్టినట్లు అగుపించెను. కొంచెం సేపు ఆలోచించి లేచి నిలబడినాడు. అతని ముఖ మలినం మెల్లగా దూరం కాజొచ్చెను. నేత్రాలు తిరిగి ప్రకాశించి నాయి. “నిజం చెప్పావు. నేను నీకు ఆత్మార్పణచేశాను. ఇం కంటె నేను బలహీనుడనని రుజువైయింది. నీద్వారా ఈశ్వ రుడు నా గర్వాన్ని అణచాడు. నాకు నా నీచత్వాన్ని ఎత్తి చూపించాడు. భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయించు కొన్నాను—నిన్ను జయించితీరుతాను—ప్రేమించడానికికాదు— కేవలం నీమీద జయంపొందడానికి. నా పవిత్రతను కాపాడు కోవడానికి. కుమారగిరిని భవిష్యత్తులో నీవింత నిర్బలునిగా చూడవని విశ్వసించు” అన్నాడు యోగి.

చిత్రలేఖ గంభీరంగా “అందుకు గురుదేవులకు సహాయ పడదలచాను” అన్నది.

“ఏరకంగా ? ”

"గురుదేవుల మార్గానికి అవరోధం కలుగజేశానని నాకు తెలుసు ఒక మహాపాపాన్ని చేశాను. ఇంక చేయలేను అందుకనే ఆశ్రమాన్ని విడవగోరుచున్నాను".

"అసంభవము! నీవు నా ఆశ్రమాన్ని విడువజాలవు నీవెళ్ళిన నేనింక జయించేదెవరిని? కనుక నీవిక్కడ ఉండి తీరాలి. తెలసిందా?"

"యోగీ! మీరు నన్నుగాదు జయించవలసింది — ముందు మిమ్ముల మీరు జయించుకోవాలి–నేనిక్కడ ఉన్నంత కాలం మిమ్ముల మీరు గుర్తించలేరు. జయించలేరు. నాకు బాగాతెలుసు. కనుక ఇచ్చటనుండి నేను పోవడమే ఉచితం. మీకు కల్యాణదాయకంగూడా."

కుమారగిరి ముఖం ఎఱ్ఱబారింది. కాదు! నాదగ్గరే ఉండాలి. నీవు నన్ను మిక్కిలి నిర్బలునిగా గుర్తించావు. నీ వెళ్ళినచో, నాలో విరోధభావం అంతరిస్తుంది. అప్పుడు నన్ను నేనెలా జయించుకోగలను? విజయానికి ఒకసాధన అవసరం. అందుకే ఈశ్వరుడు నిన్ను నావద్దకంపెను. నేను అసఫలుడ నయ్యాను. అసఫలత నా క్షేత్రంగాదు. కనుక నేను సంపూర్ణ సఫలుడ కానంతకాలం నిన్ను నేను పోనివ్వను. తెలిసిందా?"

"పోనివ్వరా? నన్ను మీరాపగలరా?"

"లేదు! నిన్ను నేనాపజాలను— బహుశా ఈ ప్రపంచంలోని ఏవ్యక్తి నిన్నాపజాలదు. నిర్బలుడు సబలను ఆపగలడా? అసంభవం–అసాధ్యం–కేవలం నేను నిన్ను ప్రార్థించ

గలను—అనురోధించగలను — నీవు నన్ను పతనమొనరించావని ఒప్పుకుంటావా ?"

"నేను మిమ్ములను పతనమొనరించలేదు మిమ్ముల మీరే పతనమొనరించుకొన్నారు. కాని అందుకు నేనుగూడా భాగస్థురాలనే"

"నిజం! నన్ను నేనే పతనమొనరించుకొన్నాను. నన్ను నేనే పవిత్రునిగా చేసుకోగలను. పతనమొనరించుటలో నీ భాగమవశ్యమున్నప్పుడు— పవిత్రునిగా చేయుటలోగూడా ఉండవలదా ? అది నీ కర్తవ్యంగాదా ?"

"చిత్రలేఖ సిరమొంచింది. ఆమె నైనాలు కుమారగిరి నుండి తొలగి నేలవంక చూస్తున్నాయి. "అవును యదార్థమే !"

"అయితే నీవు నా ప్రార్థనను స్వీకరించలేవా ? నా సాధనను నేను పూర్తిచేసుకోవడానికి, కొంతకాలంపాటు నీవు నావద్ద నుండజాలవా ?"

చిత్రలేఖ కొంతతడవు మౌనం వహించినపిమ్మట — "యోగి ! ఎంతకాలాన్ని కోరుచున్నారు ? అని ప్రశ్నించింది.

"కాలమా ? నేను విజయాన్నే సాధించితే నీకు నా వద్దనుండి పోవడానికి అభ్యంతర మేముంటుంది ? నేను విజయాన్ని సాధించితినా, నామార్గం సరియైనదేనని భావించుతాను—అప్పుడు నీవుగూడా ఉచితమార్గాన్నవలంభించగలవు"

"లేదు !— నేను మీ మార్గాన్నవలంభించలేను. — కాని ప్రస్తుతముంటాను—పోవాలనుకొన్నప్పుడు నేను మీకు చెప్పి వెళ్ళతాను—అప్పుడుమాత్రం మీరు నన్నాపజాలరు—!"

# 18

చిత్రలేఖ బీజగుప్తుని జీవితమునుండి అతనికిష్టంలేకుండానే అస్తమించింది. అతనికిష్టం లేకుండానే యశోధర తన జీవితంలోనుదయించింది. బీజగుప్తుడు నవ్వాడు—అతనియెదుట ఒక జీవితసమస్య యున్నది.

కాశీ జనరవములో బీజగుప్తుడు తనహృదయ కల్లోలాన్ని లీనం చెయ్యగోరెను. అట్లు జరుగలేదు. కాని హృదయకల్లోలం మాత్రం మరియొక రూపాన్నిదాల్చింది. చలనచిత్రంలాగా అతని కడ్డ యెదుటను చిత్రలేఖ చిత్రం తొలగి యశోధర చిత్రం వచ్చెను దుఃఖభరితమైన కోలాహాలం సుఖపూరిత మయ్యెను! బీజగుప్తుడు కాశీవచ్చి షుమారు ఒకవారం గడచింది.

ఆరోజు సంధ్యాసమయం. అందరూ ఒకచోట కూర్చుని కాశీనగరంలోని వింత వింత, సుందరమైన దృశ్యాలను గురించి వార్తాలాపము సాగించిరి. "నాకు కాశీవాసం చెయ్యాలని పించుచున్నది. కాని ఏంచెయ్యాను? వివశుడను. ఇంక నన్ను సాంసారిక బంధములు విడువలేవు." అని మృత్యుంజయుడు బీజగుప్తునివంక చూచుచుండెను,

బీజగుప్తుడు మృత్యుంజయుని మాటలలో పూర్తి అర్థాన్ని తెలుసుకొందామనే, ప్రయత్నం చేయుచుండానే ఇట్లనెను. "ఆర్యా! రాగము—విరాగము రతము—విరతము. సంసారము — సన్యాసము, వీటిలో చాలా సూక్ష్మభేదమున్నది. అసలు ఆభేదంగూడా లేని దానిలో సమానమే.

నా. ఈ మాటలను అర్యులు ఆశ్చర్యచకితులు కావచ్చును— విశ్వశించకపోవచ్చునుగూడా—కాని నేను చెప్పేదిసత్యం."

శ్వేతాంకునకు మంచి అవకాశం దొరికింది, మృత్యుంజయుని పక్షాన్ని సమర్థించుతూ, "స్వామీ! సత్యమంటే ఏమిటి? దానికొక రూపమంటూ ఉన్నదా? అది తెలుసు కొందామనుకొంటే తెలుసుకొనేదేనా?—పరిస్థితుల అనుకూలతయొక్క రెండవ నామమే సత్యం పరిస్థితులు ఎల్లప్పుడూ ఒకేరకంగానుండవు" అన్నాడు.

మృత్యుంజయుని ముఖమున చిన్నని నవ్వుదయించెను. "వత్సా! నీవు చెప్పింది యథార్థమైయుండిగూడా అనుచితమైనది. మన ఎదుటనున్న ప్రశ్నను అది సరియైన సమాధానంగాదు—అర్య బీజగుప్తు! మీరు మీవిషయాన్ని ఇంకా కొంచెము స్పష్టీకరించుతారా? అన్నాడు మృత్యుంజయుడు.

బీజగుప్తుడు శ్వేతాంకుని అనుచిత జవాబును నిహతుడయ్యెను. అతడు హీనస్వరంతో ఇట్లు చెను. "విషయం స్వయంగానే స్పష్టమైయున్నది. మనుష్యుడు ఎన్నడూ విరాగి కాజాలడు. విరాగము మృత్యువుయొక్క ప్రతిరూపం సాధారణముగా విరాగమనబడేది. కేవలం అనురాగ కేంద్రాన్ని మార్చుడానికి తగిన రెండవపేరు. అనురాగమంటే కోర్కెలు. విరాగమనునది తృప్తి" బీజగుప్తునిదృష్టి అకస్మాత్తుగా యశోధరమీద పడెను. యశోధరదృష్టి బీజగుప్తునిదృష్టిలో లీనమైపోయెను.

కొంతసేపు మౌనం తన సామ్రాజ్యాన్ని స్థాపించెను. ఆ మౌన సామ్రాజ్యంలో. నిర్జీవిత-శూన్యంయొక్క విషాద

ఛాయ వ్యాపించియుండెను. శ్వేతాంకుడు దక్క అన్యు లెవరూ ఏమియూ ఆలోచించుటలేదు. శ్వేతాంకుడు అను చితజవాబిచ్చాడు—బీజగుప్తుని మాటలను ఖండించి గొప్ప అపరాధము చేశాడు—ఇందుకు శ్వేతాంకుడు చింతిల్లు చున్నాడు—

యశోధర శ్వేతాంకుని చూచింది. అతని ముఖము వివర్ణమైయున్నది. ఆమె శ్వేతాంకుని మనోభావమును గ్రహించింది. ఆమె మౌన సామ్రాజ్యాన్ని భేదించుచూ—„ఆర్య బీజగుప్తు! ఇంకా ఎంతకాలమిచ్చట ఉండాలనుకొంటున్నారు? అని ప్రశ్నించింది.

"ఏమో! చెప్పజాలను. అప్పుడప్పుడూ పాటలీపుత్రం వెళ్ళాలనే కోర్కె కలుగుతుంది. మరుక్షణంలోనే ఇచ్చట ఉండాలని ఉంటుంది" ఈ సారి మృత్యుంజయుని ఉద్దేశించి "ఆర్యా! తమ అభిప్రాయం ఎప్పటివరకు ఉండాలని? అని ప్రశ్నించాడు బీజగుప్తుడు—

మృత్యుంజయుడు యశోధరవంక చూస్తూ — „నా అభిప్రాయమున కిచ్చట తావులేదు. యశోధర కోర్కెమీందనే ఇచ్చట కొచ్చాము. తిరిగి వెళ్ళడంగూడా యశోధరమీదనే ఆధారపడి యున్నది" అన్నాడు.

బీజగుప్తుడు యశోధరను చూచుచుండెను. ఆమె చిరునవ్వు నవ్వుచుండెను. ఆ చిరునవ్వులో ఇంద్రజాలముతో కూడిన చవి ప్రకాశించుచుండెను. నేడు ప్రథమసారిగా బీజ గుప్తుడు యశోధరయొక్క సుధాసంచితమైన వాస్తవిక

సౌందర్య రూపాన్ని తనివితీరా చూచెను. యశోధరగూడా బీజగుప్తుని రెప్పవాల్చకుండా చూచుచున్నది. మృత్యుంజయుడు మరియొక ప్రక్కకు చూచుచున్నాడు.

శ్వేతాంకునికిది అసహ్యముగాతోచెను. „స్వామీ! మీకు నగర పర్యటనచేసే అభిప్రాయంలేదా?" అని ప్రశ్నించాడు శ్వేతాంకుడు.

బీజగుప్తుడు తుళ్లిపడి యశోధరనుండి తనదృష్టినిమరల్చెను. యశోధర తన దృష్టిని శ్వేతాంకునివైపుకు మరల్చింది. బీజగుప్తుడు మృత్యుంజయునితో ఇట్లనెను-„ఆర్యా! నగర పర్యటనను గురించి తమ అభిప్రాయమేమి?

„నేడు నాకు పర్యటన తలంపులేదు".

„దేవీ యశోధరా' మీరు వెళ్ళరా?" యని శ్వేతాంకుడు యశోధరనడిగెను.

„ఇక్కడ ఉండిమాత్రం నేనేమిచేస్తాను?" అని యశోధరనవ్వుతూ అన్నది.

„నాకు వెళ్ళాలనే కోర్కెలేదు" అన్నాడు బీజగుప్తుడు.

„అయితే శ్వేతాంకుని నావెంట పంపించెదరా? అని అడిగింది యశోధర.

„తప్పకుండా"—బీజగుప్తునకు తన మనస్సును వ్యతిరేకంగా చెప్పవలసి వచ్చింది. యశోధర శ్వేతాంకుడు నగర పర్యటనకరిగిరి.

బీజగుప్తుడు మృత్యుంజయుని ఇట్లడిగెను– ‘‘ఆర్యా! తమరుకాశీలో యజ్ఞం చేయాలనుకొంటున్నారు గదా? ఇప్పుడా అభిప్రాయం మార్చుకొన్నరా?’’

‘‘అవును కొంతకాలంపాటు ఆ ఆలోచనను ఆపాను. ఆర్య బీజగుప్త! నాకర్థంగాక అడుగుతాను. యజ్ఞంలో బలి దానం ఇచ్చుటయనే అంశాన్ని తొలిగించగూడదా?’’

‘‘ఎందుకు? ఆర్యులింకా భౌద్ధ భిక్షువుల సిద్ధాంత ములో దిగలేదా?’’ అని నవ్వుతూ అన్నాడు బీజగుప్తుడు.

‘‘ఇందు ఆశ్చర్య పడవలసినదేమున్నది? ఈ రక్తపాతం వల్ల కలిగేలాభం?—రక్తపాతం ధర్మానికి తీరని కళంకా న్నాపాదిస్తున్నది. బుద్ధభగవానుడు చెప్పిందానిలో సార మావశ్యమున్నది.

‘‘సారమేగాదు.బహుశాయదార్థంగూడా ఉన్నదని చెప్ప వచ్చును.’’

కొంతతడవు ఇరువురు-మౌనంవహించిన మీదట, బీజ గుప్తుడు లేచి నిలబడి—‘‘ఆర్యా! నాకిచ్చట మనస్కరించుట లేదు నగర పర్యటన చేసిరావడంలో తమకేమి కష్టముండదు కదా?’’ అని అన్నాడు.

‘‘వెళ్ళాలనే విశేషఅభిలాషా లేదు. వెళ్ళినందువల్ల కష్ట మనునది లేదు. మీకు వెళ్ళాలని వుంటే నేను సిద్ధమే.’’

రథం ద్వారంవద్ద నిలబడియున్నది. ఇరువురూ రథా న్నధీష్టించారు, నగరకోలాహలమునకు విసుగుచెందిమృత్యుం

జయుడు రథాన్ని గంగానది వైపుకు మరలించెను. గంగానది యొడ్డున అనేక నావలు సిద్ధముగా నున్నవి—శ్వేతాంకుడు, యశోధర ఒక నౌకయందు కూర్చునిపోవుచుండ, బీజగుప్తుడు చూచి ,,శ్వేతాంక్!" అని పిలచెను.

శ్వేతాంకు డప్పుడప్పుడు గంగానది వక్షస్థలంలో నాట్యమాడుతున్న నౌకలను చూచుచుండెను. అతనికి బీజగుప్తుని కేక వినిపించలేదు. యశోధర శ్వేతాంకునితో— ,,చూడు! మానాన్నగారు బీజగుప్తులు వచ్చుచున్నారు." అని చెప్పింది.

శ్వేతాంకుడు వెనుతిరిగి చూచాడు. ఇంతలో రథ మొచ్చి ఆగింది. ఇరువురూ రథాన్నుండి దిగారు. వారిరాక శ్వేతాంకునకు బాధకలిగించెను. అతని ముఖము వికృతిచెందినది. అతను మెల్లగా బాధతో ,,నాశనముయ్యింది." అన్నాడు. యశోధర ఈమాటను విన్నది. ,,ఆర్య శ్వేతాంక! జీవితానికి ఓర్పు నిగ్రహం ఎంతో అవసరంసుమా?" అని యశోధర గంభీరంగా అన్నది.

శ్వేతాంకుడు యశోధర గంభీరానికి భయపడికూడా ,,దేవి! ప్రేమకు—నిగ్రహానికి పరస్పర విరోధం" అన్నాడో లేదో బీజగుప్తుడు మృత్యుంజయుడు, దగ్గరకొచ్చిరి.

శ్వేతాంకుని ముఖమున వ్యాపించిన క్షోభ భరిత నిరాశా భావమింకనూ దూరముగాలేదు. బీజగుప్తుడు అతని ముఖముచు బట్టియే భావమును గ్రహించి—,,శ్వేతాంక్! మీరు వచ్చినతరువాత అచ్చటనూండు మనస్కరించక మేమూ వచ్చాం" అన్నాడు.

శ్వేతాంకుడు లేనినవ్వును తెచ్చుకొంటూ-"ముందుగానే రమ్మని నేను స్వామితో చిత్తగించు కొన్నాను". అన్నాడు.

అందరూ నౌకలో కూర్చున్నారు. నౌక గంగాప్రవాహము లోనికి నడచింది. నాల్గువైపులనుండి గంగానదివక్షస్థలములోనికి నౌకలు ఉరుకుచున్నవి అచ్చటచ్చట సంగీత వాయిద్యాల, మనుష్యుల కిల కిల ధ్వనులు ప్రతిధ్వనిస్తున్నాయి. "ఆర్య శ్వేతాంక్! మీకు కాశీ బాగుందా లేక పాటలీ పుత్రమా?" యని ప్రశ్నించెను.

శ్వేతాంకుడు కొంచమాలోచించి— "పాటలీపుత్రమే నాకుబాగుంది. ఏలయన పాటలీపుత్రములోని అష్టైశ్వర్యములు కాశీలోలేవు. కాశీ కేవలం విద్యాకేంద్రం" అన్నాడు.

"ఆర్య బీజగుప్త! మరిమీకో?"

"నాకు ప్రస్తుతము కాశీయే బాగున్నట్లుంది."

ప్రస్తుతమున ఉద్దేశ్యము?"

"దేవీ యశోధర! ఏస్థానమైనా ప్రియమ మయగుట యనునది, పరిస్థితులను బట్టియుండును. మనం స్థలాన్ని ప్రేమించుటలేము. అదిజడపదార్థము—మనం ప్రేమించేది మన మలవడిన వాతావరణాన్ని, ప్రతివ్యక్తికి జన్మస్థానం అధిక ప్రియంగానుండును, అచ్చటే జన్మించి, పెరిగి పెద్దవాడగుటచే అచ్చట కొంతమంది మిత్రులుంటారు, మన జీవితం జడపదార్థముతో నిర్మించ బడినదిగాదు. చేతనావస్తువులతో నిర్మించ బడింది. ఆటిస్థితిలో నాకు పాటలీపుత్ర మధికప్రియంగా

నుండుట సహజమే కాని — ప్రస్తుతస్థితి అందుకు భిన్నంగా నున్నది. ఎప్పుడూ ఒకే పరిస్థితి మనుష్యుని ఆడించలేదు. మన ప్రకృతి పరివర్తనము కోరుచున్నది. మనం ఒక పరిస్థితి నుండి తప్పుకొని మరియొక పరిస్థితిలో చిక్కుకోవటం పరివర్తనానికి అవసరము మన పరివర్తనాభావం పూర్తికానంతవరకూ, సంపూర్ణ తృప్తి కలుగనంతవరకూ. ఆ రెండవ పరిస్థితి మనలనాడించును. యింకా కాశీయంటే నాకు తృప్తి కలుగలేదు. కనుక ప్రస్తుతము నాకు కాశీయంటే అధిక ప్రియము".

యశోధర మందహాసం చేయుచూ,—"ఆర్య బీజగుప్త. మీలో విచిత్రమైన విలక్షణమైన ప్రతిభయున్నది తర్కం అద్వితీయం— అనుపము—" అన్నది తిరిగి శ్వేతాంకునితో "ఆర్య శ్వేతాంక్! జ్ఞానం తర్కించితే వచ్చేదిగాదు. మీరు బీజగుప్తులయెడ జాగరూకత చూపవలయును సుమా అన్నది.

శ్వేతాంకుడు నవ్వుచూ—"దేవి! మేమిద్దరము ఒకే గురుశిష్యులం అట్లయిన నేను నాగురువుగారునైన మహాప్రభు రత్నాంభరుని యెడగూడా జాగరూకత చూపవలయునా?" అన్నది.

యశోధర సంకోచంగా—"అదిఎలాచెప్పగలను?" అన్నది

ఎందుకు చెప్పలేవు యశోధరా! మంచిదని తలంచిన దానిని చెప్పడానికి సంకోచించ గూడదు" అన్నాడు బీజగుప్తుడు.

సంకోచించ వలసిన పనిలేదు. బీజగుప్తా! మీరంటే నాకధిక గౌరవముండుటవల్ల, మీవిషయంలో ఏమైనా అనగ లేను. మనమధ్య భేదభావముంటూ కనుపించదు. కాని మహా ప్రభువు రత్నాంబరులు.——వారు పూజ్యులు...!,......

బీజగుప్తుడు యశోధర ఒకరి నొకరు రెప్పవాల్చకయే చూచు కొనుచుండిరి. ఆనాల్గు నైనాలు కొంతసేపు ఒకటిగా కలసియే యున్నాయి. యశోధర నైనాలలో లజ్జగాని సంకోచంగాని లేదు. ఒక స్పష్టమైన ప్రకాశంమాత్రం ప్రకాశించు చున్నవి. స్వచ్ఛమైన, నిశ్చింతభావం ఆకండ్లలో ఉట్టిపడుతుంది బీజగుప్తుని ప్రతియొక్క నరములోనుండి పరిశుద్ధమైన రక్తం అతివేగంగా ప్రవహింపసాగెను. శరీరమంతా పులకరించింది. బీజగుప్తుడు తన దృష్టిని యశోధరనుండి తొలగించి శ్వేతాంకుని వైపుకు మరలించెను. శ్వేతాంకుని కండ్లు బీజగుప్తుని భావాన్ని అర్థం చేసుకొన్నా యున్నట్లున్నవి. బీజగుప్తునకు తనమీద తనకే క్రోధం కలిగింది. శ్వేతాంకుని మీదకూడా కలిగింది.

"శ్వేతాంక్!"

"స్వామీ!"

బీజగుప్తుడు సంభాళించుకొని—అ...ఏమీ...లేదు మనమిచ్చటకొచ్చి ఎన్నినాళ్ళు అయింది?"

బీజగుప్తుడు చెప్పదలచిన దానిని దాచెనని శ్వేతాంకుడు గ్రహించాడు.

శాశీను కొనివచ్చెను. ఒకలక్ష్య హీనపాంథునివలాగా పాటలీ పుత్రమును విడచి బైటకు వచ్చెను.

“లక్ష్య హీనపాంథుడు!” బీజగుప్తునిఆలోచనమారింది ఏవ్యక్తియైనా లక్ష్యహీనుడా? బీజగుప్తుడు సంధిగ్ధావస్థలో పడ్డాడు—అతని యెదుట వెంటనే మరొక ప్రశ్నలేచింది. మనుష్యునకు ఒకలక్ష్యమంటూ వున్నదా? మనుష్యుడు ఏమి చేయుటకొరకై పుట్టాడు?—ఏమిచేయ గోరుచున్నాడు? ఏమిచే స్తాడు? ఎవ్వరైనా ఇందుకు జవాబివ్వగలడా? ఊహు... అసం భవము మనుష్యుడు పరతంత్రుడు—పరిస్థితులకు దాసుడు—లక్ష్య హీనుడు ఒక అజ్ఞాతశక్తి ప్రతిచ్ఛాయగా నటిస్తున్నది— మను ష్యుని కోర్కెలకు విలువలేదు! మనుష్యుడు స్వావలంబి గాడు—నాశ కర్తగూడాకాదు నిమిత్తమాత్రుడు—”

బీజగుప్తుడు ప్రక్కగా ఒత్తిగిలెను. అతను నిద్రించ లేడు. అర్ధరాత్రిగడచింది. నాల్గువైపుల ఘోరమైన నిస్తబ్ధత వ్యాపించింది బీజగుప్తుడు తిరిగి ఆలోచించసాగాడు ‘నేను రేపు పాటలీపుత్రం ఎందుకు వెళ్లుతున్నాను? చిత్రలేఖను కలుసు కొని ఆమెను నాదరి చేర్చుకోవడానికా? తానుపట్టుబడితే చిత్రలేఖ వ్యతిరేకించలేదని అతనికి తెలుసు—‘వెళ్లను! చిత్ర లేఖ వద్దకిప్పుడెందుకు వెళ్ళాలి? నేను చిత్రలేఖను విడువ లేదే! చిత్రలేఖయే నన్నువిడచింది. అదంతాదేనికి? బ్రహ్మ లిఖితమేమో? బ్రహ్మలిఖితము అయితే చరిచినా చెరగదు ఎందుకు దుఃఖించాలి? చిత్రలేఖ వెళ్ళిపోయింది! నేను నా జీవితాన్నెందుకు నాశనం చేసుకోవాలి?”

బీజగుప్తుడు గట్టిగా కండ్లు మూసుకొని నిద్రించ యత్నించాడు-కాని నిద్రరాలేదు – "త్యాగంవల్ల, వేదన వల్ల, జీవితం నాశనమై పోతుందా? దుఃఖము జీవితంలోని ఒక భాగంకాదా? ప్రతిప్రాణి పుడుతూ పుడుతూ సుఖాన్నే లలాటమున లిఖించుకొని పుడుతుందా? కాదు—సుఖమెంత మహాత్తర పూర్ణమైనదో దుఃఖమూ అంతే అయితేదుఃఖమే దుఃఖాన్ననుభవించాలా? త్యాగ మార్గాన్నే అవలంభించాలి! నేను నాకర్తవ్యాన్ని నెరవేర్చాలి! నాకర్తవ్య మేమిటి?" బీజగుప్తుడు లేచి ఒక చల్లని నీటిగ్లాసును ఖాళీచేశాడు. ముఖము కడుగుకొని తిరిగి పడున్నాడు.

నాకర్తవ్యమేమిటి? నేను పుట్టింది కర్మను చేయడానికి! గార్హ్యస్థ జీవనం గడిపి. వంశాభివృద్ధికి పాటుబడుటకూనా కర్తవ్యం అందుకు వివాహం అవుసరం—నిజంగా చిత్రలేఖ ఇందుకే నా జీవితాన్ని విడచి పోయింది? వివాహమునకు తగిన యోగ్యురాలుగూడా ఉన్నది. యశోధరా! యశోధరా......! సౌందర్యములో చిత్రలేఖకన్నా యశోధర ఏ అంశములోనూ తక్కువగాదు. ఈమె నిజంగా ఒక రత్నం—పవిత్ర ప్రతిమ—యశోధరను వివాహమాడవలసి వచ్చునా? అయితే ఏం? స్త్రీకుండవలసిన సలక్షణములన్నీ యశోధరలోనున్నవి. కాని ఎలా సంభవము? నేనొకనాడు ఆమెను తిరస్కరించాను. ఇప్పుడేముఖంపెట్టుకొని మృత్యుంజయుని అడుగను? మహాసామంతుడైన మృత్యుంజయుడు యశోధరను ఇప్పుడు నాకిచ్చుటకంగీకరించవపోచ్చుగూడా!- ఊహు...ఇప్పుడువివాహవిషయమును గురించి ఆలోచించలేను- చాలా ఆలస్యం జరి

గింది... అలస్యమవశ్యం జరిగింది .....చిత్రలేఖా .....చిత్రలేఖయే నా జీవితంలో నిలచియున్న అనుపమచిత్రం! ...బీజగుప్తుడులేచి నిలబడ్డాడు. ఇంక నిద్రపట్టుట అసంభవమని తలంచాడు. చంద్రుడప్పుడే ఉదయించుచుండెను. బీజగుప్తుడు బైటకువచ్చి గంగానది వైపుకుసాగి వెళ్లినాడు. తెల్లవారు వారుటకింకా రెండుజాముల ప్రొద్దుఉండెను.

బీజగుప్తుడు గంగానది ఒడ్డునకుచేరెను. అచ్చట కొందరు కూర్చొని వార్తాలాపము చేయుచుండిరి. బీజగుప్తుడు గూడా ఒక మూలగా ఒదిగి కూర్చున్నాడు.

అచ్చట ముగ్గురు వ్యక్తులుండిరి. అప్పుడు మాట్లాడుచున్న వ్యక్తివయస్సు షుమారు డెబ్బది వత్సరములుండును. ముఖముముడతలు పడియున్నది. ఆతని సంభాషణవల్లనే ఆతనొక భద్రపురుషుడని. సన్యాసియని బోధపడుచున్నది. మిగతా ఇద్దరూ వయస్సునందు ఈతనికన్నా చాలాచిన్నవారు. అతనికి కుడివైపున కూర్చున్నవ్యక్తి ఇరువదినైదు వత్సరముల ప్రాయముగల సన్నని ఆకారముగల యువకుడు. ఆర్టే పొడగరికాకపోయినా పొట్టివాడుమాత్రంగాదు. గీసిన గీటులోయున అతని ముఖమున చింతారేఖలుదయించి యున్నవి. సన్యాసికి ఎడమప్రక్కగా కూర్చున్నవ్యక్తి కొంచెం మోటుగానున్నాడు. వయస్సుమధ్యాన్నం దాటింది. అతని గడ్డం దట్టంగా పొడవుగా నున్నది. వెంట్రుకలుగూడా మెరయుచున్నవి.

సన్యాసి ఇట్లు చెప్పుచుండెను. ,,ఇప్పుడు సన్యసించ వలసినవయస్సుగాదు నీది మీతండ్రిగారి యాజ్ఞననుసరించి వెళ్ళినీకర్తవ్యం నీవు పాలించు"

ఆ యువకుడు సన్యాసి కాళ్లుపాటుకొని-,,నేను తమ ఆశితుడను. నాకు సన్యసించుటకు దీక్షనివ్వండి. నాజీవితము నకు అనురాగమనునది లేదు. ఈ ప్రపంచలో ఉండాలంటే, ఏదో ఒక ఉద్దేశ్యముండాలి. ఒకసారి విరక్తి కలిగిన తరువాత తిరిగా ప్రపంచంలోనికరిగి ఆత్మవినాశనమును చేసుకోలేను. అచ్చట నాకు శాంతిలభించదు. ఈ రెండు సంవత్సరాల కాలంలో నేనెంత యాతనను అనుభవించానో, తమరు మాతండ్రిగారి నడిగి తెలుసుకో వచ్చును. అని దీనంగా ప్రార్థించాడు.

సన్యాసి ప్రక్కనే కూర్చొనియున్న పొడుగుపాటివ్యక్తి కి ఇట్లనెను. ,,వును! కాని తిరిగి ఇంకో వివాహం చేసుకో మంటే. వినుటలేదు. ఇప్పుడు నీవు నవయువకుడవు. పుట్టుట-గిట్టుటయనునవి ఒకదానివెంట మరొకటి ఉంటూనే ఉంటాయి. నీకు సంతానమా? లేదు. ఇప్పుడు సన్యసించుట ఉచితమా? వివాహం చేసుకొన్న తరువాత నీ జీవితం తిరిగి అనురాగమయమై పోతుంది".

సన్యాసి యువకునితో ఇట్లనెను — " వత్సా! మీతండ్రిగారు యధార్థం చెప్పుచున్నారు. ప్రేమ విద్యాభరిత మైన ఒక కల్పన, స్త్రీపురుష సంబంధం కేవలం ఈప్రపంచము లోనే, ఈప్రపంచాన్ని విడడమూ ఈ రెండు విభిన్నమైన రెండు ఆత్మలు, ప్రేమ కేవలం ఆత్మకు సంబంధించినది. ఈ ఆత్మీయత

స్థిరమైనది గాదు. ఈ ఘనిష్ట సంబంధం అప్పుడప్పుడూ తెగి పోతుంది. ఆ సంబంధం తెగిపోవుటతోడనే జీవితాన్ని దుఃఖ మయం చేసుకోవడం తెలివనుపించుకోదు. నీ కర్తవ్యం వివా హం చేసుకోవడమే— వివాహం అంటే విరక్తిని చూపి, నీవు నీ కర్తవ్యమునునుండి విముఖుడవగుచున్నావు."

"ఇది ఎలా?"

"విను—! స్త్రీ అబల. ఒక అబల కాశ్రయ మీయ డం ప్రతియొక్క పురుషుని కర్తవ్యం వివాహంద్వారానే పురు షుడు అబల కాశ్రయమిచ్చుచున్నాడు. పురుషుడు స్త్రీకాశ్రయ మివ్వకపోతే. ఆమె స్థితి శోచనీయమైపోతుంది. ఇటు పురుషు నకుగూడా ఒంటరి జీవితం గడపుటలో చాలా కష్టాలను ఎదు ర్కొనవలసి యుంటుంది. వివాహాన్నుండి విరక్తుడవై సన్యసించ వలయునను కొంటున్నావంటే, పిరికి పారిపోతున్నావని చెప్పక తప్పదు. నీ కనీస కర్తవ్యాన్నుండి విముఖుడవగు చున్నావు."

"మహారాజా! నేను సర్వభోగవిలాసములను తిలాంజలి నిచ్చి, తపస్సుఅనే అగ్నిగుండంలోదుమికి మండిపోబోతున్నాను. ఇది పిరికి తనమెలా అవుతుంది?"

"నీవు తపస్సులో తపించిపోదామనుకొనేదెందుకు? నీ ఒకర్ని ప్రేమించావు. ఆమె నీకులభించలేదు— అందుకు తపస్సు—! ఈ నీ తపస్సు వ్యర్థమే. ఇది ఒక రకంగా ఆత్మ హత్యతో సమానం. ఈ తపస్సుకు ఒక లక్ష్యమంటూ ఏదీ లేదు. అనవసరంగా నీవు ఆత్మవినాశనమును కోరుచున్నావు"

"తమరు చెప్పింది యథార్థమని నమ్ముచున్నాను" అని సన్యాసికి మ్రొక్కి ఆ యువకుడు తిరిగి వెళ్లిపోయెను.

బీజగుప్తుడు సన్యాసియొద్దకేగి నమస్కరించెను. సన్యాసి చిరునవ్వు నవ్వి— "నీవుగూడా సన్యసించగోరుచున్నావా?" యని ప్రశ్నించెను.

"లేదు. ఇప్పుడు సన్యసించాలనే అభిప్రాయం నాకు లేదు. తమరిప్పుడు చెప్పిన మాటలకు నాకు మిక్కిలి ఆనందం కలిగింది. అందుకని ఇచ్చటకొచ్చికూర్చున్నాను."

"ఈ అర్ధరాత్రి సమయంలో, గంగానది యొడ్డున మానసిక పీడచే పీడింపబడే వాడైనారావాలి. లేదా మహా దరిద్రుడైనా కావాలి. లేకుంటే సన్యాసియైనారావాలి. అన్యులెవరూ రారు."

"తమ అంచనా సరియైనదే. నా మానసికపీడ అసాధారమైనది. తమ నోటతత్సంబంధమైన మాటలను విన్నాను. ఇంకా కొంచెం విపులంగా అడిగి తెలుసుకో వచ్చునా?"

"ఓ...నిరాటంకముగా!"

"అసఫల ప్రేమకు తన జీవితాన్ని అంకితం చేయడం, లేదా బలిదానం చేయడం, ఆత్మహత్యతో సమానమని తమరిప్పుడే శెలవిచ్చారు. ప్రేమస్మృతియొక్క పీడమనుష్యుని జీవితానికి ప్రాకృతికముగదా? ఆ వేదనను అణచడం. లేదాదాని సహజ రూపాన్ని కృత్రిమ ఉపాయములద్వారా మరపించుట ఆత్మహత్యగాదా?"

సన్యాసి కొంతసేపు మౌనంవహించి ఇట్లుచెప్పసాగెను "నీవుచెప్పింది గూడా సమ్యాజనమే, దుఃఖము ఆయాసమయాన్ననుసరించి స్వయంగానే దూరమైపోతుంది. భిన్న భిన్న

స్వభావములతో కూడుకొన్న దుఃఖము దూరమైయ్యే సమయంగూడా భిన్నముగానే ఉంటుంది. ఆ అవధికి ముందుగానే దుఃఖాన్ని దూరంచేయ ప్రయిత్నించడం అసహజము — కాని ప్రతియొక్క అసహజకార్యం ఆత్మహత్యతో సమానం గాదని జ్ఞాపకముంచుకోవాలి. అసహజాన్ని మనం అధికంగా అనుసరించడంవల్ల అది సహజంగా చెలామణీ యగుచున్నది. మనమిప్పుడు ధరించుచున్న వస్త్రాలు, చేస్తున్నభోజనం, అనుభవించుచున్న భోగవిలాసములు, అన్నీ అసహజములే, సహజజీవితం సరళమైనది గాదు. అతికఠినమైనది — భారమైనది ఆ జీవితంలో కోలాహలాన్ని రేకెత్తించడానికి మనుష్యుడు నాట్యాలను వింతవింత తమాషాలను, ఉత్సవాలను, ఊరేగింపులను, చిత్ర విచిత్రములైనపద్ధతులనెన్నిటినో శృష్టించాడు మనం వీటినే మానవజీవితం అంటున్నాము. కుత్రిమ ఉపాయములద్వారా దుఃఖాన్ని దూరంచేయడం ఆత్మహత్యతో సరిసమానంగాదు, అది ప్రాకృతిక మైనప్పటికీ సహజమే ”

బీజగుప్తుడు లేచినిలబడి — “ధన్యవాదం! తమరు నాహృదయ భారాన్ని కొంత తగ్గించారు. తమరిచ్చిన ఉపదేశంవల్ల నేను నా భావి కర్తవ్యాన్ని నిశ్చయించుకొగలిగాను. శెలవు!” అని బీజగుప్తుడు తిరిగి వెళ్లిపోయినాడు.

తెల్లవారు తున్నసమయం. ప్రాతఃకాలీన చల్లనిపవనం మెల్లగా వీచుచుండెను. తూర్పుదిక్కునుండి వచ్చుచున్న వెలుతురు మసక మసకగా నుండెను. పక్షులు ఇటునటు నెగురనారంభించినాయి. బీజగుప్తుడు తిరిగివచ్చి నిద్రించెను.

బీజగుప్తుడు రెండుఝాముల ప్రొద్దెక్కిన తరువాత మేల్కొన్నాడు. శ్వేతాంకుని తీసుకొని యశోధర అవసరమైన వస్తువులను కొనుక్కునే నిమిత్తం బజారుకు వెళ్లింది.

కాలకృత్యాలైన పిమ్మట బీజగుప్తుడు మృత్యుంజయుని వద్దకేగెను. బీజగుప్తుని చూచుట లోడనే మృత్యుంజజయుడు అతనితో — "ఆర్యబీజగుప్త! నేడు మీరు ఆలస్యంగా లేచారు. ? రాత్రి సరిగా నిద్రపట్టలేదా ?" యని ప్రశ్నించెను.

"అవును! నేను ఆలోచనలోనే రాత్రి అంతా గడపాను"

"ఏమాలోచించుచున్నారు ?"

"భావిజీవితాన్ని గురించి ఆలోచించుచున్నాను"

"చిత్రలేఖ జీవితాన్నుండి వెళ్ళిపోయి తరువాత భావి జీవితాన్ని గురించి ఆలోచించడం సహజమే. ఏదైనా ఒక నిర్ణయాని కొచ్చారా?" అంటు ఒక చిరునవ్వు నవ్వాడు మృత్యుంజయుడు.

మృత్యుంజయుని ఆ చిరునవ్వులో దాగియున్న వ్యంగ్యానికి బీజగుప్తుడు నిహతుడయ్యాడు. చెప్పబొయ్యే మాటను ఆపుతూ—"ఇంకా నిర్ణయించలేదు. త్వరలోనే ఏదో ఒక నిర్ణయం చేయాలి" అన్నాడు.

"మీ నిర్ణయం ఎలా ఉంటుందో నాకు తెలుసు బీజగుప్త! మనుష్యుల మనఃప్రవృత్తులను కొంచెం కొంచెంగా అర్థం చేసుకొంటున్నాను"

బీజగుప్తుడు సందర్భాన్ని మారుస్తూ – ఆర్యా! తమ నౌకర్లకు వెళ్ళేందుకు ఏర్పాట్లుచేయమని ఆజ్ఞాపించారనుకొంటాను” అని అడిగాడు.

“అవును! మీ నౌకర్లకుగూడా శ్వేతాంకుని ద్వారా ఆదేశమిప్పించాను”

“మంచిపని చేశారు”

ఇంతలో బైటనుండి యశోధర కంఠధ్వని వినిపించింది. “ఆర్య శ్వేతాంక్! ఈ మణిమాల నాన్నగారికి నచ్చనియెడల మీరే తిరగి ఇచ్చి రావాలిసుమా! మీరు చెప్పబట్టే నేను దీనిని తీసుకొన్నాను” అంటూ యశోధర లోనికి ప్రవేశించింది

“ఆర్య బీజగుప్త! మీరు నిద్రించుచునే యున్నారు. నేను చూడండి! ఎన్నిసామాన్లు కొని తెచ్చానో,— మీరేమీ కొనరా” అని మందహాసము చేయుచూ అన్నది యశోధర.

“దేవీ యశోధర! నాకేమీ అవుసరం లేదు” అన్నాడు బీజగుప్తుడు.

అవుసరమైతే నాకూ లేదు. కాని కాశీనుండి తిరిగి వెళ్ళేటప్పుడు ఏవో కొన్ని సామాన్లు తీసుకవెళ్లాలని తెచ్చాను. అంటూ యశోధర తాను తెచ్చిన సామానులమూటను విప్పి అందు ఒక మణిమాలను బీజగుప్తుని చేతికిచ్చి—“బీజగుప్త! ఇది ఎలా ఉంది? అని అడిగింది.

“బాగానే ఉంది. వెలకూడా జాస్తిగానే ఉండొచ్చు”

“అవును! నేను దీనిని ఖాయంగా తీసుకొనిరాలేదు. నాన్నగారికి చూపించి నచ్చితే పుచ్చుకొందామని తెచ్చాను“

మృత్యుంజయుడు మణిమాలను చూచి– "నీకునచ్చితే పుచ్చుకోమ్మ" అన్నాడు.

యశోధర అన్నివస్తువులను వరుసగా చూపించింది. అన్నీ అందరూ బాగానే ఉన్నవన్నారు.

బీజగుప్తుడు శ్వేతాంకునివంక చూచి — "నీవేమీ తీసుకోలేదా?" అని అడిగాడు.

"నేను ముందుగా స్వామిని అడుగనూలేదు. నాకేమీ అవుసరములేదు"

"కాదు. నీవేమైనా తీసుకోవాలి. నేనుకూడా వస్తాను. దేవీ యశోధర! కష్టమనుకోకుండా ఉ. టే. మీరుగూడా వస్తే బాగుంటుంది. కొన్ని వస్తువు ను నాణ్యంచేసి పెట్టాలి" అంటూ బీజగుప్తుడు యశోధరవంక చూచాడు.

రావడానికేం? రాగలను. కాని ఇప్పుడు రాలేను. అలసి పొయ్యాను. భోజనానంతం వెళ్లదాం."

భోజనానంతరం బీజగుప్తుడు మృత్యుంజయునితో— ,,ఆర్యా! తమరుగూడా వస్తారా?" యని అడిగెను.

"రాలేను. వృద్ధుడనయ్యాను. అదీగాకుండా నగర కోలాహలం నాకేమంత ఇష్టంగా ఉండుటలేదు."

బీజగుప్తుడు యశోధరను శ్వేతాంకుని తీసుకొని బజారుకు వెళ్లాడు. ముందుగా ముగ్గురు రత్నముల దుకాణమువద్ద నాగిరి. బీజగుప్తుడు శ్వేతాంకుడు రత్నాలు పొదిగిన ఉంగరాలను తీసుకొన్నారు. దుకాణంలో ఎదురుగా చాలా విలువ

గతిగిన ముత్యాలహారమొకటి వ్రేలాడు చుండెను. యశోధర ఆ హారమును రెప్పవాల్చకచూచుచున్నది. బీజగుప్తుడు ఆ హారమును బైటకు తీయించి— "యశోధరా! ఈ హారమెలా ఉన్నది?" అని యడిగెను.

"చాలా బాగుంది. ఆర్య బీజగుప్త! నేను ముందుగా దీనిని తీసుకొన్నట్లయితే మణిమాలకు బదులు దీనినే తీసుకొనేదానను-" తిరిగి శ్వేతాంకునితో— "ఇదంతా మీ వల్లే జరిగింది శ్వేతాంక్!" అన్నది నిరాశగా యశోధర.

దుకాణదారునుండి బీజగుప్తుడు ఆ హారమును తీసుకొని యశోధర మెడలో వేసి— "దేవీ యశోధర! ఇది నా కానుకగా స్వీకరించు" అన్నాడు.

బీజగుప్తునికరస్పర్శచే యశోధర కంపించుపోయింది. హారమును తీస్తూ— "ఆర్య బీజగుప్త! తండ్రిగారి అనుమతి లేనిదే మీ కానుకను స్వీకరించ జాలను" అన్నది యశోధర.

హారమును బీజగుప్తుడు తీసుకొని— "దేవీ! ఈ కానుకను స్వీకరించుటలో ఏమీ ఆటంకపర్చవను కొంటాను— నాన్నగారి అనుమతిగూడా సముచితమే" అన్నాడు మెల్లగా.

# 20

కుమారగిరికి చిత్రలేఖ ప్రవర్తనమునకు గొప్ప ఆశ్చర్యం కలిగింది. చిత్రలేఖ వైపుకు తాను ఆకర్షింపబడలేదు. తానే వలచి వచ్చింది. ఇప్పుడు చిత్రలేఖలో ఈ పరివర్తన మెందుకు?

కుమారగిరికి చిత్రలేఖ ప్రవర్తనానికంటే, అధికాశ్చర్యం తన ప్రవర్తనానికే కలుగుచున్నది. చిత్రలేఖను తననుండి వేరు చెయ్యాలని యోగిశక్తి వంచనాలేకుండా ప్రయత్నించాడు. తిరిగి చిత్రలేఖను ఎందుకు స్వీకరించవలసి వచ్చింది, తన విశ్వాసాన్ని తానే స్వయంగా పోగొట్టుకో గోరుచున్నాడా? కుమారగిరి క్షేత్రం విజయం—పరాజయమనేది అతనికొక క్రొత్త విషయం. బహుశా కుమారగిరికి తన బలహీనత తెలిసియే యుండవచ్చును. తనను తాను పరీక్షించుకోవడానికే ఆమెను దరిచేర్చాడు. ఆ బలహీనతను దూరముచేయునెంచి ఆమెను సాధనముగా ప్రయోగించి చూచాడు. ప్రతిఫలం అసఫలత ప్రాప్తించింది. ఆ అసఫలతగూడా మామూలుదిగాదు భయంకరమైనది. అందులోనూ ఒక సాధారణ నర్తకితో పరాజితుడయ్యాడు. స్వయంగా తన పతనానికి తానే దుఃఖిస్తున్నాడు. పైగా నర్తకితో పరాజితుడననే భావం దుఃఖాన్ని క్రోధంగా మార్చింది. "కాదు. చిత్రలేఖను లొంగతీసి వశీభూతురాలను చేసుకోవాలి. అయితే ఏరకంగా?" అని బిగ్గరగా అరచాడు యోగి.

"చిత్రలేఖ నన్నెందుకు ప్రేమించుటలేదు?" కుమారగిరి మనమున ఇదేప్రశ్న ఉదయించింది. "బహుశా ఆమె ఒక వ్యక్తిని ప్రేమించుచున్నందున కావచ్చు. బీజగుప్తునియెడ ఆమె మమకారం తొలగితే, నిశ్చయంగా నన్ను ప్రేమించి, ఆత్మ సమర్పణ చేయగలదు. బీజగుప్తుని చిత్రాన్ని చిత్రలేఖ హృదయమునుండి తొలగించాలి."

చిత్రలేఖ కుమారగిరి ఆశ్రమానికి వచ్చి రెండు నెలలకు పైగా కాలం గడచింది. గత ఘటన ఘటించి అప్పుడే ఒక నెల దాటింది. ఈ మధ్యకాలంలో కుమారగిరి మంచి నిగ్రహం కలిగియున్నాడు— ఏ మాత్రం బలహీనతనుగూడా బైటకు పొక్కనీయలేదు. చిత్రలేఖను దగ్గర ఉంచుకొనే విషయ వాసనను దరిచేర నివ్వరాదని తలంచాడు. కాని ఆ భావం స్థాయీ రూపాన్ని పొందలేక పోయింది. ఒకమారు ప్రజ్వలించిన ఆ అగ్ని ... ఆహుతి ... అంటూ నాలుకలు కోరుచున్నది. కుమారగిరి తన నిశ్చయం మీద దృఢంగా ఉండలేక పొయ్యాడు.

యోగి కుమారగిరి ఆ రోజు రాత్రి చిత్రలేఖను తన వద్ద కూర్చుండ బెట్టుకొని ఇట్లు చెప్పెను— "దేవీ చిత్రలేఖా! అప్పుడే ఒక నెల గడచింది. ఈ మధ్య సమయంలో నన్ను నేను పవిత్రునిగా జేసుకొనుటకు ప్రయిత్నిచాను ఇప్పుడు నాలోని బలహీనత దూరమయ్యెనని తలంచుచున్నాను."

"కావచ్చు" చిత్రలేఖ ఒక చిరునివ్వు నవ్వింది.

కుమారగిరి నీళ్ళునములుతూ— "బీజగుప్తుడు కాశీ యాత్రి కరిగెనట—వెంట మృత్యుంజయుని కుమార్తె యశోధర కూడా వెళ్ళినదని విన్నాను" అన్నాడు.

"యశోధరగూడా మృత్యుంజయుని వెంట వెళ్ళెనా?" చిత్రలేఖ తుళ్ళిపడింది.

ఈసారి కుమారగిరి చిరునవ్వు నవ్వాడు— "ఇందులో ఆశ్చర్యమేముంది? చిత్రలేఖా! నీవే బీజగుప్తునితో యశోధరను వివాహం చేసుకొని గార్హ్యస్థ జీవితమును గడపి సుఖాన్నను భ

వించమని చెప్పి, అతని విడచిపుచ్చావు. నీవు చేసింది ఉచితమే అయినప్పుడు బీజగుప్తుడు యశోధరను వివాహమాడుట ఉచితం గాదా ?"

"నేనెరుగను...నాకు తెలీదు...చిత్రలేఖ స్వరం తీవ్ర రూపం దాల్చింది. దయచేసి తమరు బీజగుప్తుని గురించి నా వద్ద చెప్పకండి."

"బీజగుప్తుని గురించి నీవద్ద మాట్లాడవలదా? నీవు బీజ గుప్తుని ప్రేమిస్తున్నావు. అందుకేనా ? బీజగుప్తుడు మరొక స్త్రీని ప్రేమించడం నీవు సహించలేకున్నావు ! అయితే నీ వాతనిని ఎందుకు విడచిపుచ్చావు? స్త్రీకే సర్వంచేసే అధికా రం ఉన్నదనుకొంటున్నావు ! పురుషునకు అధికారం లేదను కొంటున్నావు బీజగుప్తుడు నీకు దాసుడై ఉండాలనుకొంటు న్నావు. కాని అది అసంభవం."

కుమారగిరి కంఠధ్వనిలో ప్రతిహింసాయుతమైన ఒక తీవ్ర వ్యంగం ఇమిడియున్నది. ఏ స్త్రీచే తాను పరాజితుడ డయ్యాడో ఆమెను ఓడించడమే అతని ముఖ్యోద్దేశ్యం.

చిత్రలేఖ ఆవేశంతో కంపించసాగింది. "నేనుచేసిం దంతా బీజగుప్తుని మంచికోసమే చేశాను. నేను సమాజ దృష్ట్యా బీజగుప్తుని పతనమొనర్చాను. ఇప్పుడాయనను విడచి ఉన్నతపథాన్ని చేరడానికి సహాయపడ్డాను."

ఇదెలా ఒప్పుకొంటాను? నిన్ను నీవు మోసంచేసుకొం టున్నావు. చిత్రలేఖా ! మొదట నీవు నన్ను ప్రేమించి బీజ గుప్తుని విడచావు" కుమారగిరి కంఠం తీవ్రరూపాన్నిదాల్చింది

నేడు కుమారగిరి మరొక్కసారి, చిత్రలేఖ తన జీవితంలోని కొచ్చినతరువాత పోగొట్టుకొన్న వెనుకటి గురుత్వాన్ని. తేజాన్ని ఆస్ఫూర్తిని చూచాడు. "నీవు బీజగుప్తుని మోసగించగలవు—నన్ను మోసగించగలవు—కాని నిన్ను నీవు మోసగించుకోలేవు. నీవు కామాంధకారంచేత ఆ ఆవేశంలోపడి పవిత్రప్రేమను కాలదన్నావు — నాలో కొంత విశేషాన్ని, చూచావు—ఆకర్షింపబడ్డావు—అప్పుడు నీలో పశువృత్తి ప్రబలమై లేచింది—మానవత్వానికే తిలాంజలి నిచ్చావు—నీవు బీజగుప్తుని కోర్కెకు విరుద్ధంగా, అతని జీవితాన్ని అతిభారంచేసి నావద్దకొచ్చావు. అటు బీజగుప్తుడో — ఒక సాధారణమైన నర్తకికై తన పవిత్ర గృహస్థ జీవితసుఖాన్ని బలినిచ్చాడు. అంతేగాదు, కేవలం నిన్ను ప్రేమించి, ప్రేమయొక్క పవిత్ర అనుభూతినిపొంది తన జీవన సర్వస్వాన్ని నష్టమొనర్చుకొన్నాడు"

"ఇంక చాలించండి.....ఇంక చాలించండి-- అని చిత్రలేఖ బిగ్గరగా అరిచింది.

కుమారగిరి నేత్రాలు చిత్రలేఖమీద లగ్నమైనాయి. తరువాత యోగి వికటంగా నవ్వుతూ---"చాలించనా? ఈమాత్రానికే చంచలురాలవైతివా నర్తకీ! లేదు విషయాన్ని పూర్తిచేసియే చాలించెదను. నీవు అనివార్యంగా వినాలి. నీవు చేసినదానికి ప్రతిఫలం నీకులభించింది. బీజగుప్తుడు ఇప్పుడుకూడా నిన్నుప్రేమిస్తాడను కొంటున్నావు---తిరిగి ఇప్పుడు అతనివద్దకు వెళ్ళితే నిన్ను స్వీకరించు తాడనుకొంటున్నావు. అది ఒట్టిభ్రమ. నీవిష ప్రభావాన్ని దూరంచేసే

అమృతం ఆతనికి దొరికింది. యశోధర ఆతనిని రక్షించింది. ఇప్పుడు బీజగుప్తుడు యశోధరతో వైవాహిక సుఖాన్ని, ఆనందాన్ని అనుభవిస్తున్నాడు." అన్నాడు దీర్ఘంగా యోగి

చిత్రలేఖ ముఖం వెల్లనైనది — "యోగీ! తమరు నిజమే చెప్పుచున్నారా? బీజగుప్తులు యశోధరను వివాహం చేసుకొన్నారా? లేదు — యోగీ అది అసంభవము!"

"అసంభవమా?" కుమారగిరి స్వరంలో హృదయానికి శూలంలాగా గుచ్చుకొనే వాడిగల వ్యంగ్యం ఇమిడియున్నది. "నీవు విలాసనావృత్తికి వశీభూతురాలవై, పవిత్ర ప్రేమను కాలత్రొన్ని, నా దగ్గరకు రావడం సంభవమా? బీజగుప్తుడు ఒక స్వర్గతుల్యమైన పవిత్రురాలితో పవిత్ర వైవాహిక సంబంధ మేర్పరచుకొనుట అసంభవమా? ఓ స్త్రీ! స్త్రీ!... నీలోనిండు అజ్ఞానమున్నది. ఎంత అచలవిశ్వాసము! నామీద కలయుంచు నమ్మకం లేదా? అయితే విను... నవదంపతులు నేటి ప్రాతఃకాలమే వచ్చారు. నిన్ను వారికి చెప్పవాదాలిచ్చిరా? ...... విను...... నీకిండ్లతో నవే సి ప్రేమికుడు — కాదు — కాదు — నీ దాసుడు — ఇంకా ప్రేమి పవిత్రయాత్రికులు నవ్వుచుండుట చూచిరా!"

"వారు వచ్చారా?" ఆమె శరీరం వణికిపోతున్నది ముఖం శ్వేతవర్ణమైనది. ఆమె లేచినిలబడి ఆశగా పాటలీపుత్రం వైపుకు అడుగుసాచి చూచింది — "వారొచ్చారా? యోగీ! తమకు నమస్కరిస్తాను ఇదంతా అసత్యమని చెప్పండి."

అసత్యమని చెప్పనా? అహా...హా...హా...హా...! సత్యాన్ని అసత్యమని చెప్పనా? వెళ్ళు... వెళ్ళి నీవు స్వయంగానే చూచిరా?"

చిత్రలేఖ కూలబడింది. "వెళ్ళను... అంతా సమాప్తమైంది.—ఇంక వెళ్ళను—వెళ్ళితే లాభం?—సాధనం దోచుకోబడింది. సర్వనాశనం —చిత్రలేఖ స్వరం కరుణామయమైనది.—

కుమారగిరి చిత్రలేఖ సమీపమునకు మెల్లగా చేరాడు అంతా సమాప్తమైనదా? ఎక్కడన్నా సమాప్తమవుతూ ఉంటుందా? ఒక సమస్య సమాప్తమవడం- రెండవది వెంటనే ఉత్పన్న మగుట యన్నమాట! దేవీ చిత్రలేఖా! సమాప్తమెలా అయింది? కుమారగిరి స్వరం కోమలంగా ఉన్నది అందులో ఒక రకమైన మృదుత్వం— జిలుగు ఉన్నది--"నేను నిన్ను ప్రేమిస్తున్నానని నీకు తెలుసు. నీవు గూడా నన్ను ప్రేమించక పోయినా, ద్వేషించుటలేదు. వాస్తవంగా నీవు నా హృదయ పీఠాన్ని అధిష్ఠించ గోరుచున్నావు--కాని ఇప్పటివరకు బీజగుప్తుని కారణమున. అధిష్ఠించ లేకపోయ్యావు--నీవాతని జీవితాన్ని దుఃఖమయం చేశారు---అతడు నీ జీవితాన్ని దుఃఖమయం చేశాడు. అతడొక ఆధారాన్ని వెతుక్కున్నాడు, నీవు నీ ఆధారాన్ని వెతుక్కోవలదా? చిత్రలేఖా! నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను?" అని యోగి చిత్రలేఖ చెయ్యిని గట్టిగా పట్టుకొన్నాడు

చిత్రలేఖ ఏవిధమైన అడ్డుచెప్పకయే తన చేతిని కుమారగిరి కందించింది.--- ఆమె ముఖాన్ని కొంచెం పైకెత్తి కుమారగిరి నైనాలలో తన నైనాలను లీనం చేసింది,

కుమారగిరి ఉన్మత్తుడై— "ప్రేమ......! ప్రేమే నాధర్మమైపోయింది--- నీవునాజీవితంలోనికి ప్రేమ దీక్షనివ్వడానికే వచ్చావు! రా దేవీ! ఇద్దరం యొక్కటై పోదాము!" అన్నాడు.

కుమారగిరి ముఖము కొంచెం వంగింది. చిత్రలేఖ ముఖం కొంచెం పైకి లేచింది. ఇద్దరి అధరములు కలుసుకొన్నాయి. చాలాసేపటి వరకు ఆఅధరములట్లే కలసిఉన్నాయి.

కుమారగిరి పదే పదే పలువరించసాగెను—, "నీవు నన్ను ముంచివేయడానికొచ్చావు! నేను మునుగుటకు సిద్ధాంగాఉన్నాను. పద......! ఎంతసుఖం...! ఎంత ఆనందం... ఎంత కోలాహలం...! ఎంతహాయి......! ఓ- నా ఆరాధ్య దేవీ! నా ప్రాణమేశ్వరీ—నేను నేను నీ అగాధమైన యవ్వన సాగరంలో మునకలు వేయుచున్నాను" కుమారగిరి నేత్రాలు మూసుకపోయినాయి--- చిత్రలేఖ నేత్రాలుగూడా మూసుకపోయినాయి---ఇద్దరూ మైమరచి ఒకరినొకరు గాఢాలింగనా పాశంలో బ ధించుకొన్నారు.

"ఎప్పుడూ ఇలానే ఉండాలి" అన్నది చిత్రలేఖ".

*   *   *   *   *

ప్రాతఃకాలం చిత్రలేఖ నేత్రాలు తెరచుకున్నాయి. ఆమె వ్యాకులత చెందియున్నది. బీజగుప్తు...బీజగుప్తుడామెను విడచెను. ఇది ఆమెకు సహింపరానిదైనది. ఆమెకు ప్రపంచమంతా అంధకారం! తనకు తనమీాదనే ఆగి ఆగి క్రోధం వచ్చుచుండెను. బీజగుప్తుని ఎందుకు విడచింది?





అప్పుడు కుమారగిరి నిద్రించుచుండెను. అతని ముఖము వికృతమైయుండెను---నిగ్రహాన్ని నిముసములో నాశనంచేసే వాసనావృత్తి అతని తేజోపేతమైన ముఖమండలముమీద ఒక మసక ఆవరను వేసింది. చిత్రలేఖ తదేకధ్యానంగా కుమారగిరి ముఖమును చూచింది. తరువాత ఆమె అకారణంగానే అకస్మాత్తుగా కంపించిపోయింది. ఎక్కువసేపు అచ్చటఉండే సాహసం ఆమెకు సన్నగిల్లింది. వెంటనే బైటకు పోయింది. ఏవ్యక్తితో తాను రాత్రియంతా ప్రణయ క్రీడలు సల్పినదో ఆ వ్యక్తి మొఖము ఇప్పుడింత భయంకరంగా, ఘృణాజనితమెందుకైయుందో, ఆమెకాశ్చర్యం కలిగింది.

విశాలదేవ అప్పుడే ఆరాధానను చాలించెను. చిత్రలేఖను చూచి నమస్కరించి ,,దేవి! మీ మొఖం నేడింత నీరసంగా ఉన్నదేలా?" అని ప్రశ్నించెను.

,,రాత్రియంతా దుస్వప్నాలను చూచాను. అవినన్ను వ్యాకులత పరుస్తూన్నాయి" అని మందహాసం చేసింది చిత్రలేఖ.

,,నేను గురుదేవులింకా కుటీరమునెలుపలకు రాలేదే?"

,,వారింకా ధ్యానావస్థితులైయున్నారు".

,,ధ్యానావస్థితులైయున్నారా? నేను ప్రప్రథంగా గురుదేవులు నియమాన్ని ఉల్లంఘించారు?" అన్నాడు విశాలదేవ ఆశ్చర్యంగా.

కొంత తడవు ఇరువురూ మౌనంగా నుండిరి. తరువాత విశాలదేవ ఇట్లు ప్రశ్నించెను- ,,దేవీ చిత్రలేఖా! మీ స్వప్నాలను గురించి నేను తెలుసుకోవచ్చునా?

“అవి నా గత జీవితానికి సంబంధించినవి. ఇంతకంటె అధికం నీ కనవసరం”

“గత జీవితానికి సంబంధించినవా? దేవీ! మీరు ఉచిత మనుకొంటే, అక్క బీజగుప్తుని జూడా తెలుసు కోస్తారు. బహుశా వారీపాటికి వచ్చియే యుందురు” అన్నాడు విశాల దేవ్ ఆలోచిస్తూ.

“వారు వచ్చారనే సంగతి నాకు తెలుసు. కాని వారి రాకతో—పోకతోనూ నాకేమి ప్రయోజనం లేదు” అన్నది శుష్కించిన స్వరంతో చిత్రలేఖ.

విశాలదేవ్ చిత్రలేఖను చూచి—“దేవీ! మీరు విచిత్రమైనవారు. మిమ్ముల పూర్తిగా అర్ధంచేసుకొనుట అతి కష్టం. మీరారోజున బీజగుప్తునివద్దకు వెళ్ళాలన్నారు. గదా?” అన్నాడు.

చిత్రలేఖముఖం కందగడ్డలాగా ఎఱ్ఱబారింది. “అవును ఆరోజు వెళ్ళాలను కొన్నాను—ఈరోజు అనుకోవడంలేదు. నావ్యక్తిగత జీవితాన్ని గురించి నీవంతగా గుచ్చి గుచ్చి అడుగుట ఎంతవర కుచితమో? ఆలోచించావా?”

విశాలదేవ్ శిరమొంచి మెల్లగా ఇట్లన్నాడు “నిజమే దేవీ! కాని మీవ్యక్తిగతజీవితాన్ని తెలుసుకోవాలనే ఆతురతను చూపడమంటే, నాగురువుగారి వ్యక్తిగత జీవితంయెడ చూపడమన్నమాట అదిసహజం— ఉచితంగూడా దేవీ చిత్రలేఖా! మీరాక మాఆశ్రమ నిగ్రహ పూర్ణశాంతిని భగ్న పరుస్తుందని మీకు తెలుసు. ఈఆశ్రమము ఒక కుటుంబంలాం

టిది. ఇందు ప్రతివ్యక్తి యొక్క ఉచితానుచిత కార్యములను విమర్శించే అధికారం—కలుగ జేసుకొనేహక్కు ప్రతివ్యక్తికి కలదు»

«నేనీ విషయాన్నంగీక రించను»

«సరే, 'పోనీయండి' నేను నేను కేవలం నా సహోపాఠకుని కలుసుకోవడానికి బీజగుప్తునివద్ద కేగుచున్నాను. దేవీ! బాగా ఆలోచించమని ప్రార్థించుచున్నాను. విూరు మాయందు దయచూపాలి»

చిత్రలేఖ పకపకా నవ్వుతూ— «దయ! ఎవర్ని దయ కోరుతున్నావు? ఎవరియెడ దయచూపమంటున్నావు? కసాయివాడిని కనికరించమంటున్నావు? యమకింకరునివల్ల నిర్మాణాన్ని ఆశించుచున్నావు! పొరబడుతున్నావు—భ్రమచెందావు—!» అని చిత్రలేఖ అచ్చటనుండి వెళ్లిపోయింది.

మధ్యాహ్నానికి విశాలదేవ్ నగరాన్నుంచి తిరిగి వచ్చాడుచిత్రలేఖ అతని మార్గాన కెదురు చూచుచున్నది-ఇంత జరిగినా—ఇంత చెప్పినా-- అతని నిశ్చిత నిర్ణయం జరిగి పోయినాగూడా బీజగుప్తుని గురించి తెలుసుకో గోరుచున్నది విశాలదేవ్ కుటీరమునకు తిరిగి వచ్చినప్పటికి చిత్రలేఖ బైటనున్న వటవృక్షముక్రింది పరుండయే యుండెను. విశాల దేవ్‌నుచూచి లేచి నిలబడింది.

విశాలదేవ్ తిన్నగా చిత్రలేఖ వద్దకొచ్చి—«దేవీ! ఆర్య బీజగుప్తునితో కలుసుకొనలేనుగాని శ్వేతాంకునితో కలసు కొని చక్కావచ్చాను. ఎక్కువసేపు అచ్చట 'ఉండ

లేదు. శ్వేతాంకుడు మృత్యుంజయుని భవనమున కరుగుచు న్నాడు. అతనివెంట అందాకా మాట్లాడుచు వెళ్ళాను. తదుపరి తిరిగివచ్చాను-" అన్నాడు.

"నన్ను గురించి శ్వేతాంకుడేమన్నాడు?"

"మీ క్షేమసమాచారముల నడిగాడు. ఏదో తొందర పనిలోనున్నాడు——లేకపోతే ఇచ్చటికొచ్చేవాడే. మరొక విషయం చెప్పనా? ఆ విషయాన్నింటే, మీకు భలే ఆశ్చర్యం కలుగవచ్చు---శ్వేతాంకుడు యశోధరను ప్రేమిస్తున్నాడు-వివాహంగూడా చేసుకోవాలను కొంటున్నాడు-"

చిత్రలేఖ త్రుళ్ళి పడింది. "శ్వేతాంకుడు యశోధరను వివాహమాడ గోరుచున్నాడా? బీజగుప్త యశోధరలను వివాహం అయిపోయిందను కొంటున్నాను!"

ఈసారి విశాలదేవ్‌కు ఆశ్చర్యం కలిగింది. "బీజగుప్తునకు యశోధరను వివాహమా? ఇదెలా జరుగుతుందనుకొంటు న్నారు? బీజగుప్తులుగూడా యశోధర వైపుకు ఆకర్షింపబడి రట——! కాని వివాహంమాత్ర చేసుకోరట వారికి మీమీద స్థాయీ అనురాగమున్నదని శ్వేతాంకుడుగూడా చెప్పాడు"

"ధన్యవాదం! విశాలదేవ్! నీయెడ నేను పలికిన కఠినోక్తులను క్షమించు. ఇంక గట్టిగా చెప్పుచున్నాను. నేడే ఇచ్చటినుండి వెళ్ళిపోతాను"

చిత్రలేఖ తిన్నగా కుటీరములోనికి వెళ్ళింది. విశాలదేవ్ చిత్రలేఖ స్వభావాన్ని సరిగా తెలుసుకోలేకపొయ్యాడు. "గొప్ప విలక్షణమైన స్త్రీ" అనుకొన్నాడు

అప్పుడు కౌమారగిరి పరుండి చిత్రలేఖను గురించి ఆలోచించుచున్నాడు. అతని మనసు చికాకుగా వున్నది. చిత్రలేఖను చూచుటతోడనే పిచ్చివానిలాగా— "నా రాణి— ఇప్పుడు దాక ఎక్కడున్నావు? రా రాణి" అంటూ ఆమెవైపుకు వెళ్ళసాగెను. చిత్రలేఖ కండ్లను చూచినమీదట అతని పిచ్చి కొంత తగ్గింది. ఆమె నేత్రాలు ఈర్ష్య, క్షోభం, విషాద భావాలనుకమ్మి శ్రీణాతో ప్వుచున్నవి. ఆమె నిప్పులు గ్రక్కుతూ, "నీచుడా— పశువా— దూరంగా ఉండు—" అన్నది.

కుమారగిరి దూరంగా తొలగాడు. "నీవు నన్ను మోసగించావు— కామాంధుడా— నీవబద్ధమాడావు— నీ తపస్సాంతా నిష్ఫలమై పోతుంది, యుగయుగాలవరకు నీవు నరకంలోపడి నుండి, మశియై మాసిపోతావు— నేను వెళ్ళుతున్నాను— ఇంక నీవు నన్నాప జాలవు" అని గద్దించి పలికింది. చిత్రలేఖ.

"నేను చేసిందంతా నీ ప్రేమాంధతవల్ల చేశాను." అన్నాడు సాహసించి కుమారగిరి.

"పైశాచిక పిపాసువా—! నీకు ప్రేమంటే ఏం తెలుసు? కేవలం నీవు నీకోసమే జీవిస్తున్నావు— మనశ్శ్యమే నీకేంద్రం నీకు ప్రేమించడంకూడా తెలుసా? పశువా! ప్రేమ త్యాగమయం— ప్రేమ బలిదానం— ప్రేమ మమత్వాన్ని విస్మరిస్తుంది— నీ జప తపములు— నీ ధ్యానం— నీ సాధనా— నీ ఆరాధన— ఇవన్నీ భ్రమలే— సత్యానికి ఎన్నో కోసులదూరం— నీవు నీవు నీ తృప్తి కోసం గృహస్థాశ్రమ భాధలను పిరికిచెంది, సన్యాస

మనే బురఖాతో ప్రపంచాన్ని మోసగించుచున్న ఘరానీ మోసగాడవు. నీకామతృప్తికోసం నన్ను దగాచేసిన దగాకోరువైయుండికూడా ఇంకా "ప్రేమ" అనే పవిత్రశబ్దాన్ని ఉచ్చరిస్తున్నావా?"

కుమారగిరి ఈఅవమానాన్ని సహించలేకపోయాడు. కుమారగిరి చివాలునలేచి—"నర్తకీ! ఛా!...... నాకు నీఅవసరం లేదు—నీవెనన్ను క్రిందికి పడదోశావు—పైకి కూడా లేస్తాను... నీవునన్ను ఓడించావు—నిన్ను నేను ఓడించాను. నీవునన్ను ఏమని దూషిస్తున్నావు? ముందునిన్ను నిన్ను నీవు చూచుకో—నిన్నునీముఖమున తాండవించుచున్న పైశాచికత్వాన్ని చూచుకోలేనంత అసమర్థురాలవుగా వని అనుకొంటున్నాను— పో—నీ అభిశాపాన్ని నీతోనే తీసుకపో—" అని ఆవేశంలో అవతలకు వెళ్ళిపోయాడు యోగి.

# 21

మృత్యుంజయుని వద్దనుండి శ్వేతాంకుడు తిరిగివచ్చి బీజగుప్తునితో "స్వామీ! యోగి కుమారగిరి శిష్యుడు విశాలదేవ్ కనుపించి చిత్రలేఖ కుశలంగానే యున్నదని చెప్పినాడు" అన్నాడు.

బీజగుప్తుడేమీ జవాబివ్వలేదు.

తమకుచితమనుకొంటె నేను వెళ్ళి ఆమెను చూచివస్తాను.

"వలదు అంతా వ్యర్థం"

చిత్రలేఖ విషయమంటే బీజగుప్తునకేమీ రుచించుట లేదని శ్వేతాంకుడు గ్రహించెను. శ్వేతాంకుడు అచ్చటనుండి వెళ్ళిపోయెను.

బీజగుప్తుని వ్యాకులత పాటలీపుత్రం వచ్చిన తరువాత తగ్గలేదు సరిగదా పైపెచ్చు పెరిగిపోయింది. అతని ఎదుట రెండుమూర్తులున్నాయి. హృదయంలో రెండు భావాలకు ఘోరయుద్ధంజరుగుతుంది. చిత్రలేఖ వెళ్ళిన తరువాత అతడు తన హృదయ శూన్యతను చవిచూచాడు--- ఆశూన్యతను ఇంక బీజగుప్తుడు సహించలేకుండెను. ఆ శూన్య హృదయం లోనికి యశోధర ప్రవేశించినది. అతడు ఆమెను వివాహ మాడి తన దానినిగా చేసుకోగోరుచుండెను. కాని ఒక పర్యా యం ఆమెను తిరస్కరించాడు---ఇప్పుడు మళ్ళీ ఆ యశోధ రిని నాకిచ్చి వివాహముచేయమని మృత్యుంజయుని యాసిం చడం తగనిపని అని భావించాడు. అతని ఆత్మ అందుకు అంగీ కరించుటలేదు.

బీజగుప్తుడుమౌర్యసామ్రాజ్యంలో సేనాసమితిసభ్యుడు పాటలీ పుత్రం వచ్చిన తరువాత రాచకార్యములయందు అత నిమనస్సు నిలుపుకున్నది.

బీజగుప్తుని హృదయంలో విషాద కల్లోలంచే ప్రేరిత మైన క్షణిక విరక్తి భావం పెచ్చుపెరిగి పోవుచున్నది. అతడు బైటకువెళ్ళుట బొత్తిగా మానుకున్నాడు. ఆవిశాల నగర ప్రజా కోలాహలం,ఉత్సవాలు, ఆనందోల్లాసములు బీజగుప్తు నకు రంపకోత కోయుచున్నవి.

నేడు శ్వేతాంకుడు చిత్రలేఖ విషయం తెచ్చి హృదయంలో మరొక కల్లోలమును రేకెత్తించాడు. అతడు ఆ రాత్రి నిద్రించ లేదు. చిత్రలేఖ కుశలంగానే సంతోషంగానే యున్నది— బీజగుప్తుడు దుఃఖితుడు. యెలాంటి భర్తను—! యెలాంటి విష మత—! ఎంత తగనిపనియైనా సరే యశోధరను వివాహం చేసుకొని తీరాలి. ఈ హృదయ శూన్యతను దూరం చెయ్యాలి.

ఆ రాత్రి శ్వేతాంకుడు కూడా నిద్రించలేదు. బీజగుప్తుని స్వరంలో, హావభావములలో, చిత్రలేఖ యెడ ఇదివర కెన్నడూ చూడనటువంటి ఉదాసీనతను, నిరాశను, నిర్లక్ష్య భావముల ప్రతిబింబాన్ని శ్వేతాంకుడు చూచాడు.

ఉదయమయ్యింది. ఆరోజు బీజగుప్తుడు అపరిమితానందములో నున్నాడు. తన వివాహాన్ని గురించి నేడే మృత్యుంజయునితో ప్రస్తావించాలని నిశ్చయించుకొన్నాడు. అతడు బైటకు వెళ్ళాడు. నేడు ప్రథమసారిగా అతని ముఖమున వెనుకటి చిరునవ్వు కనిపించెను. పరిహాసం చేయగల్గుచున్నాడు. శ్వేతాంకుడా సమయమున లేడు. ఒక పరిచారికతో శ్వేతాంకుని పిలువమని చెప్పెను.

శ్వేతాంకుడు వచ్చాడు. అతడేదో చింతాక్రాంతుడైనట్లు అతని ముఖభంగిమయే చెప్పుచున్నది. „శ్వేతాంక! ఈరోజున ఆరోగ్యం బాగుండలేదా?" అన్నాడు బీజగుప్తుడు.

శ్వేతాంకుడు సిరమొంచుకొనియే జవాబిచ్చాడు. „స్వామీ! ఆరోగ్యానికేమి భిన్నం లేదుగాని మానసిక స్థితి బాగుండలేదు!"

"కారణం?"

శ్వేతాంకుడు కొంతతడవు మౌనం వహించి అటు పిమ్మట ముఖము పైకెత్తి— "స్వామీ! తమరు నాయందు చూపుదయ అపారము. తమరేనాకు మేలును చేయగలరు" అన్నాడు—

బీజగుప్తుడు నవ్వి—"శ్వేతాంక్! నిన్ను నేను సోదరునిగా చూచుకుంటున్నానని నీకు తెలుసు, నాస్వాధీనంలోఉండి నాకు సాధ్యపడేది ఏమైనాసరే నీకోసం నేను చెయ్యసిద్ధంగా నున్నాను" అన్నాడు.

"నాకు తెలుసుకనుకనే తమరిని ప్రార్థించ సాహసించుచున్నాను. నేను సామంత మృత్యుంజయుని కుమార్తె యశోధరను వివాహమాడ గోరుచున్నాను".

బీజగుప్తుని శరీరంజలదరించింది. అతనికి ఒక్కసారిగా వేలకొలది తేళ్లుకుట్టినట్లు అనిపించింది. కొన్ని క్షణాలపాటు శ్వేతాంకుని వంక విమూఢుడై అట్లే చూచాడు. "ఏమన్నావు? యశోధరను వివాహమాడ గోరుచున్నావా? అందుకు నా సహాయ మెందుకు?"

"తమరీ ప్రస్తావనను మృత్యుంజయుని ఎదుట పెడతారని"

"శ్వేతాంక్! మృత్యుంజయుడు యశోధరను నాకిచ్చి వివాహం చేస్తానన్న విషయం నీకు తెలుసు—అప్పుడు చిత్రలేఖ కారణంచేత తిరస్కరించాను. చిత్రలేఖ నా జీవితా

న్నుండి తొలగిన తరువాత నేను యశోధరను ప్రేమిస్తున్నట్లు గూడా నీకు తెలిసు?"

"నాకు తెలుసు స్వామీ! కాని వివాహం అనే విషయం తమ హృదయంలో ఉదయించెనని మాత్రం ఎరుగను"

"అది అసంభవము సుమా—! నేను యశోధరను ప్రేమిస్తున్నాను—నేటిరాత్రియే యశోధరను వివాహంచేసుకొందామనే నిశ్చయానికొచ్చాను" బీజగుప్తుడు ఉద్విగ్నుడైపోయాడు. అతనిస్వరం గంభీరమైపోయింది—"నన్ను ఏమిచేయమంటున్నావు శ్వేతాంక! ఈ వేదన—ఈ దుఃఖము—ఈ కల్లోలము నాకు చాలదా? నాకీవిధాన్ని నాశనం చేసుకోమంటావా? కాదు......ఇది అసంభవము—శ్వేతాంక! వివాహం తప్పక చేసుకొంటాను.

శ్వేతాంకుని నేత్రాలు అశ్రుపూరితమైనాయి. అతడు బీజగుప్తుని ఎదుట చేతులు జోడించి—"స్వామీ! నన్ను క్షమించండి—నేను అపరాధిని—నన్ను క్షమించాలి నా స్థానాన్ని నేను అతిక్రమించాను—నన్ను శిక్షించండి—స్వామీ తమ హృదయం విశాలమైనది...తమరు అనన్యు—నన్ను క్షమించండి" అని ప్రార్థించాడు.

"నన్ను పిచ్చివానిగా చేయకు శ్వేతాంక! వెళ్ళు—ఊ—ఇచ్చటనుండి వెళ్ళు—వెళ్ళమని ప్రార్థిస్తున్నాను" అని బిగ్గరగా అరచాడు బీజగుప్తుడు.

శ్వేతాంకుడు మెల్లగా అచ్చటనుండి వెళ్ళిపోయాడు.

"—హా! భాగ్యమా...!" అని బీజగుప్తుడు తలను మోదుకొన్నాడు. తరువాత తనలో తాను ఇట్లనుకొనెను—

“శ్వేతాంక్! ఏమిటీ వింత...? కాదు... నేను తప్పక వివాహం చేసుకొంటాను. సహించే అధికారం నాకు లేదా?”

బీజగుప్తుడు లేచినిలబడ్డాడు—“నేనిప్పుడే వెళతాను. నా నిర్ణయాన్ని ఎవరూ అడ్డలేరు—యశోధరను వివాహం చేసుకొందామనే నిశ్చయం జరిగిపోయింది. ఇంక నిశ్చయాన్ని మార్చుకోవడం అసంభవము!” బీజగుప్తుడు రథాన్ని తెప్పించాడు.

అతడు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు—“శ్వేతాంకునకు యశోధరను ప్రేమించే అధికార మెక్కడున్నది? నేను యశోధరను ప్రేమిస్తున్నట్లు అతనెరుగడా? బీజగుప్తుని శరీరం యావత్తు భగభగ మండిపోవుచున్నది. అతని నాలుక తడి యారిపోయింది. ఒక గ్లాసు చల్లటి నీరును త్రాగాడు. ఆ వ్యాకులత కొంచెం తగ్గింది. వేడెక్కిన బుర్ర కొంచెం చల్లబడింది. “అయితే ఇందు శ్వేతాంకుని అపరాధ మేమున్నది? అతను ప్రేమించడం సహజమే—యువకుడు—అతనికి రక్తమాంసాలు ఉన్నవి. ఇవన్నీ ప్రాకృతిక ప్రేరణలే. అదీగాకుండా చిత్రలేఖ యెడ నా ప్రేమ చచ్చిపోయిందని అతనికేమి తెలుసు!”

బీజగుప్తుని ఆలోచన పూర్తిగా మారిపోయింది. చిత్రలేఖ యెడ నా ప్రేమ చచ్చిపోయిందా? ఇది నిజమా? నేను ముందు ఒక స్త్రీని ప్రేమించి ఇప్పుడు రెండవ స్త్రీని ప్రేమిస్తున్నాను. ఎంత నిర్భాగ్యుడను? వాస్తవంగా ప్రేమను స్థాయిత్వంలేదా?

బీజగుప్తుడు పెద్ద సందేహంలోపడ్డాడు. ప్రేమసజీవమై నదని, స్థాయిత్వం కలదని అంగీకరించ సిద్ధంగాలేదు. కాని అతడు స్వయంగా అనుభవించే స్థితిలేదు—"కాదు—ప్రేమ అస్థాయిత్వం కలదికాదు. సజీవమైనదే-అయితే ఇదంతా నే నెందుకు చేయబోతున్నాను? చిత్రలేఖ పగను తీర్చుకోవడా నికా? కాదు—!" చిత్రలేఖ విషయంలో అతని మనస్సులో అన్య ఆలోచనలేమీలేవు.

రథం ద్వారంవద్ద సిద్ధంగానున్నది. బీజగుప్తుడు యశోధర భవనంవైపుకు సాగాడు. అతని ఆలోచనా పరం పర మాత్రం ఆగలేదు—"నిగ్రహానికర్థం ఇదేనా? ఈప్రపం చంలో స్వార్థమే, స్వార్థమా! అయితే పశువుకు మనుష్యు నకు భేదమున్నది! ప్రతివ్యక్తి తాను తనకోసమే జీవిస్తు న్నాడు— ప్రతివాడు మమత్వంచే ప్రేరేపించబడి ఏపని నైనా చేస్తున్నాడు— నాకూ ఈప్రపంచలోఉన్న అన్య ప్రా ణులకుఉన్న భేదమేమిటి? యశోధరతో నా వివాహం...... దీని పరిణామము ఎలాఉంటుంది? ఒకవ్యక్తి జీవితం నాశనమై పోతుంది. ఆవ్యక్తి నాకు ప్రియమైన సోదరతుల్య శ్వేతాం కుడు- నేను నాసిద్ధాంతములనుండి పతనమవుతాను- నేను యశోధరను ప్రేమించగలనా? ఇప్పుడు నేను ఏదోఆవేశంలో పడి ఆమెను వివాహం చేసుకొంటాను- కాని భవిష్యత్ లోనో—? లేదు- నాకు వివాహం చేసుకొనే అధికారంలేదు- ఆలోచించె నామార్గాన్ని నేను నిర్ణయించుకొన్నాను, సఫల తకానీ- అసఫలితకాని- దుఃఖంకానీ-సుఖంకానీ -ఏదినాకు లభించినాసరే నామార్గాన్ని నేనువిడువను. ఇతరుల సుఖా

నికి భంగంకలిగించడం—కేవలం తనసుఖాన్నే ప్రధానంగా చూచుకోవడం నీచత్వం—పిరికితనం— నేను ఇతరులకేగాదు—నాకు నేనుస్వయంగా అన్యాయం చేసుకొంటున్నాను. మన భాగ్యరేఖలో సుఖ దుఃఖాలు రెండూ లిఖించియే యున్నవి. ఈరెండింటిని సాహసోపేతంగా అనుభవించుటయే మనకర్తవ్యం»

ఇంతలో రథం మృత్యుంజయుని భవనంవద్దకు చేరింది. బీజగుప్తుడు తనరాక మృత్యుంజయునకు తెలిపాడు— మృత్యుంజయుడు వెంటనే బైటకువచ్చి ముందుకుశల క్షేమము లనడిగాడు. తరువాత ఇప్పుడు రావడానికి కారణమేమని అడిగాడు.

బీజగుప్తుడు కొంతతడవాలోచించి— «నేను తమ పుత్రిక వివాహ ప్రస్తావనను తీసుక వచ్చాను» అన్నాడు.

మృత్యుంజయుని ముఖమున చిన్నని నవ్వుదయించెను. «ఆర్య బీజగుప్త! చెప్పండి!»

బీజగుప్తుడు మృత్యుంజయుని చిరునవ్వులోని అంతరార్థాన్ని గ్రహించాడు «ఆర్యా! నన్నుగురించి నేనేమీ చెప్పతలంచలేదు. నా నిర్ణయం మీ కిదివరకే చెప్పాను. తమపుత్రికను శ్వేతాంకునకు ఇచ్చి వివాహంచేయాలి నేపస్తావనను తెచ్చాను. శ్వేతాంకుడు మంచి వంశజుడు—అందమైన వాడు—సభ్యుడు—శిక్షితుడు—అతడు వాస్తవంగా తమ పుత్రికకు తగిన వరుడు బహుశా నా కంటే యోగ్యుడు.........»

ఈ ప్రస్తావనను విని మృత్యుంజయుడు ఆశ్చర్య చకితుడైనాడు. బీజగుప్తుడు స్వయంగా తనను గురించి ప్రస్తావించుతాడనుకున్నాడు మృత్యుంజయుడు. శ్వేతాంకుని మాటవిని మృత్యుంజయుడు నిరుత్తరుడైనాడు. కొంత తడవు మౌనము వహించిచవిూద ఇట్లు చెప్పెను. ,,ఆర్య బీజగుప్త! శ్వేతాంకుడు యోగ్యుడై కావచ్చు, కాని ధనవంతుని పుత్రుడు కాదు. అతడు నిరుపేదవాడు. అట్టి స్థితిలో నేనేమీ ఆలోచించలేను".

ఈ సారి' బీజగుప్తునకు ఆశ్చర్యంకలిగెను—

"ఆర్యా!, తమరు అతుల ధనాదిపతులు. అదీకాకుండా తమకు యశోధర దక్క వేరే సంతానములేదు."

"ఆర్య బీజగుప్త! నా ఈసంపత్తిమీద నాకన్యకేట్టి అధికారంలేదు. ఆ అధికారం నా దత్తతపుత్రునకుంటుంది. ఆర్యా! తమరు స్వయంగా ఏలచేసుకొనరు? " అని ప్రశ్నించాడు మృత్యుంజయుడు.

"ఆర్య మృత్యుంజయ! నేను వివాహం చేసుకొనను. శ్వేతాంకునకు యశోధరనిచ్చి వివాహం చేయడం నిశ్చయంగా అసంభవమేనా? "

"అవును! శ్వేతాంకుడు మంచి వంశజుడు, యోగ్యుడని తెలిసియుండిగూడా నిర్ధనుడుగానున్నంతకాలము యశోధరను ఇచ్చి వివాహంచేయలేను"

బీజగుప్తుడు కొంచెముసేపటివరకూ ఏదియో ఆలోచించి ఇట్లుచెప్పెను—"ఆర్యా! నేను శ్వేతాంకుని నాదత్త

పుత్రునిగా చేసుకొంటాను. అతడు నా యావత్తు సంపదకు అధికారి కాగలడు. అప్పుడు తమ కభ్యంతరముండదను కొంటాను."

"బీజగుప్త! అది అసంభవము — ఇప్పుడు మీ వయస్సు ఏమించిపోయింది? మీరు భవిష్యత్ లో వివాహం చేసుకొంటే మీ సంతానమే ఉత్తరాధికారి కాగలదు!"

"అదీ నిజమే. కాని ప్రస్తుతము నేను వివాహం చేసుకోవద్దనుకొంటున్నాను. అయినా మనుష్యుని మతికి నిలక డెక్కడ యున్నది? కాని నేను శ్వేతాంక్ యశోధరల వివాహం చేయగోరుతున్నాను. వారిరువురి సుఖంకోసం నేనెంత త్యాగమైనా సరే చేయ సిద్ధంగానున్నాను. ఆర్యా! నేను నాసంపదనంతా శ్వేతాంకునకు దానంగా ఇస్తాను."

మృత్యుంజయుని కొక్కసారి ఆకాశాన్నుండి పడ్డట్లని పించింది. "మీకు తెలియదు బీజగుప్త! మీరు ఆవేశంలో ఏదో అంటున్నారు!"

"నన్ను గురించి మీరు విచారించవలదు. నేను తమ ఎదుట నా యావత్తు సంపదను శ్వేతాంకునకు దానమిచ్చెద నంటిని. ఇందుకు తమరే సాక్ష్యం. ఇంక మిగిలింది సామంత పదవిని గురించి—అందుకు రాజాజ్ఞ అవసరం. దానికి నేడే సామ్రాట్‌లో కలుసుకొని ఏర్పాటు చేయించుతాను. ఇంక తమరు అభ్యంతరం చెప్పరాదు."

మృత్యుంజయుడు విప్పారిన నేత్రాలతో బీజగుప్తుని వంక చూచాడు. "ఆర్య బీజగుప్త! అవకాశాన్నిస్తున్నాను.

బాగా ఆలోచించండి—స్వీకారం జరిగినమీదట కాదనుటకు వీలులేదుసుమా !—"

బీజగుప్తుడు ప్రతిసశబ్దాన్ని పూరించి మరీ చెప్పాడు—

"ఆర్య మృత్యుంజయ ! నేను చెప్పింది చేసితీరుతాను- నేను మనుష్యుడను- ఆడితప్పుట ఎరుగను—"

"అయితే అంగీకరించాను" అన్నాడు మృత్యుంజయుడు కంపితస్వరంతో.

బీజగుప్తుడు లేచి నిలబడి — "నేను వెళ్ళివచ్చెదను. దానపత్రము, సామంత పదవిని గురించి రాజాజ్ఞ మొదలుగా గల ప్రబంధములు నేడే పూర్తికాగలవు. తమరు వివాహానిధి నిర్ణయించండి" అన్నాడు.

మృత్యుంజయుడు లేస్తూ— బీజగుప్త ! నేను ప్రపంచాన్ని బాగా పరికించాను. కాని మీరు మనుష్యులుకారు. దేవతలంటున్నాను" అన్నాడు. అతని కండ్లవెంట ఆనందాశ్రువులు రాలుచున్నవి.

బీజగుప్తుడు తన భవనమునకు చేరుకొన్నాడు. సరాసరి శ్వేతాంకుని గదిలోకి వెళ్ళాడు- శ్వేతాంకుడు నిద్రించుచుండెను. ఆతని పక్కబట్టలు తడిచియున్నవి. అతని కండ్లవెంట కారే అశ్రువులు ఇంకనూ ఎండిపోలేదు. బీజగుప్తుడు శ్వేతాంకుని మేల్కొలిపెను. శ్వేతాంకుడు లేచి—"స్వామీ! ఏమి ఆజ్ఞ? అన్నాడు.

"సామంత శ్వేతాంక్ ! ఇంక నీవు నన్ను స్వామీ అనవలదు"

శ్వేతాంకుడు విస్మయ నేత్రాలతో చూస్తూ "తమరే మంటున్నారు ?" అన్నాడు.

నేను నిజాన్ని చెప్పుతున్నాను విను ! నేను నీ వివాహాన్ని గురించి ఆర్య మృత్యుంజయునితో మాట్లాడాను. ముందుగా వారు అభ్యంతరము చెప్పారు. ఆ అభ్యంతరాన్ని పోగొట్టుటకు నేను నీకు నా యావత్తు సంపదను, పదవిని దానం చేస్తున్నాను. ఇంక ఆమెను నీకిచ్చి వివాహం చేయడానికి అభ్యంతరం లేదు.

శ్వేతాంకుడు చాలా సేపటివరకు నిశ్చలుడై, విమూఢుడై, బీజగుప్తునివంక చూచాడు. అటు పిమ్మట బిగ్గరగా ఏడ్చాడు. "లేదు...! లేదు...! స్వామీ ! నేనంగీకరించను— నేనెంత పాపాత్ముడను— స్వామీ నన్ను క్షమించండి— క్షమించండి స్వామీ! నేను తమ జీవిత కుసుమమును నలిపి నాశనం చేశాను. ఈ నరాధమునిమీద ఇంతదయా! నేనంగీకరించను" అని శ్వేతాంకుడు ఏడుస్తూ బీజగుప్తుని పాదాలమీద పడినాడు.

బీజగుప్తుడు శ్వేతాంకునిలేపి, "శ్వేతాంక్ ! అపదలచిందేదో అయిపోయింది. నాయెడ నీ హృదయంలో ఏదైనా స్నేహభావముంటే, నేనుచేసిన దానిని నీవంగీకరించాలి. ఈ ప్రపంచము ఎదుట నన్ను మిథ్యావాదిగా తయారు చెయ్యకు. నేనీవైభవాన్ని పూర్తిగా అనుభవించాను. ఇప్పుడు మనస్సు మారింది. ఈ వైభవాన్ని నీవనుభవించు. నన్ను స్వీకరించవలసినదిగా ప్రార్థించుచున్నాను. పదవీదాన పత్రమునకు రాజాజ్ఞ అవుసరం. తగిన ఏర్పాట్లు చెయ్యాలి" అన్నాడు.

# 22

చిత్రలేఖ స్వస్థానమునకే తిరిగి వచ్చింది. ఆమె అపరాధం చేశానని తలంచి బీజగుప్తుని కలుసుకోవడానికి సాహసించలేకపోయింది. కలుసుకోలేదు.

చిత్రలేఖ ఔశ్వర్యముతో కూడిన తన భవనమునందే సాధనాయుత జీవితం గడుప నారంభించింది. ఈ జీవితంలో ఆమె శాంతిని చూచింది — పశ్చాత్తాపమనే అగ్నిలో సహర్షంగా తపించి పోవడానికి సిద్ధంగానున్నది. తనకుతనయడ ద్వేషం పుట్టింది. ఆమె ప్రస్తుత కార్యక్రమము రాత్రింబవళ్లుఏడ్వడమే.

ఆమె బీజగుప్తుని ప్రేమిస్తున్నది. బీజగుప్తునియడ ఆమె హృదయంలో ఎంత ఘనీభూతమైన ప్రేమయున్నదో ఇన్ని రోజుల వియోగం తరువాత అనుభవంలో చూచింది. కాని కుమారగిరి మూర్ఖత్వానికి, పిచ్చితనానికి, మోసపోయి ఒక క్షణంలో ఆత్మ సమర్పణచేసి భ్రష్టురాలైంది. ఆమె బీజగుప్తుని హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నది కనుకనే అతనిని మోసగించ తలంచుటలేదు తాను అపరాధంచేసింది — ప్రతిఫలం నిరాశాపూర్ణమైన వేదన, సహింపరాని ఆ యగ్ని జ్వాలలో హతమై పోవుటయే ఆమె కిష్టం. వియోగం బలపడిన కొలది ఆమెకు సుఖంగానున్నది. ఎప్పుడూ ఏడ్చుటలోనే ఆమెకు శాంతి లభించుతుంది.

ఈ రకంగా చిత్రలేఖకప్పుడే ఒక మాసం గడచింది. ఒక రోజు ఆమె కూర్చుని ఏడ్చుచుండగా "ఆర్య శ్వేతాంకులు తమర్ని కలుసుకో గోరుచున్నారు" అని ఒక దాసీ చెప్పెను.

ఆమె త్రుళ్లిపడి లేచింది. "బీజగుప్తులు పిలిపించారా? ఎక్కడున్నాడు? నేనే వెళతాను!"

శ్వేతాంకుడు అతిథిభవనంలో కూర్చుని చిత్రలేఖకై ఎదురు చూచుచున్నాడు. చిత్రలేఖను చూడగానే అతనికి ఆశ్చర్యం కలిగింది. ఆమె తెల్లంగా పాలిపోయింది. వెనుకటి సౌందర్యమంతా వికృతం దాల్చింది. అతడు గుర్తించలేక పోయ్యాడు. "దేవీ! మీరిలా ఉన్నారేల?" అని శ్వేతాంకుడు ప్రశ్నించెను.

"బాగానే ఉన్నాను" అంటూ చిత్రలేఖ కూర్చున్నది. కొంచెంసేపు ఇద్దరూ మౌనంగానున్న తరువాత "ఆర్య బీజగుప్తులు కుశలంగా నున్నారా?" అని చిత్రలేఖ అడిగింది.

శ్వేతాంకుని ముఖమున చిన్న దుఃఖరేఖ ఉదయించెను.

"ఆర్య బీజగుప్తులు బాగానేయున్నారు. కాని వారిలో ఒక గొప్ప మార్పు కలిగినది."

"మార్పు కలిగిందా?" చిత్రలేఖ కుతూహలం పెరిగింది– "ఎలాంటి మార్పు? వారు వివాహం చేసుకున్నారా?"

ఒక వచ్చీరాని చిరునవ్వుతో శ్వేతాంకుడిట్లనెను — "లేదు! వారు వివాహం చేసుకొనలేదు. వివాహం నేను చేసుకోబోతున్నాను. సామంత మృత్యుంజయ కుమార్తె యశోధరకు—నాకు వివాహం కానున్నది, అందుకు మిమ్ము ఆహ్వానించడానికొచ్చాను — కాని ఆర్య బీజగుప్తులు ఒక పెద్దత్యాగాన్ని చేశారు — వారు నిజంగా దేవతలు— నేను నిర్ధనుడనని సామంత మృత్యుంజయులు వారి పుత్రికను నా

చ్చుటకు నిరాకరించిరి. ఆ లోటును తీర్చుటకు బీజగుప్తులు తమ పదవినీ, యావత్తు సిరిసంపదలను నాకు దానమిచ్చి పాటలీపుత్రమును విడచి వెళ్లిపోతున్నారు— కేవలం నా వివాహం కోసం వేచియున్నారు"

చిత్రలేఖ హృదయం కొట్టుకోనారంభించింది. నైనాలు అశృపూరితమైనాయి. "బీజగుప్తులు ఇంతపని చేశారా ? శ్వేతాంక్ ! తెలుసా? ఇది ఒక గొప్పత్యాగం— దీనికంతటికీ మూలకారణం నేనే. శ్వేతాంక్ ! నీకు సాధన్యవాదాలు— నీవివాహం ఎప్పుడు జరుగుతుంది?"

"వచ్చే ఆదివారంరోజున వివాహం జరుగుతుంది. సోమవారం విందు జరుగుతుంది. ఆ విందుకు సామ్రాట్ తదితర రాజ్యపాలకులు, సామంతులు వస్తారు దేవీ ! ఆ విందుకు మీరు రావడం అత్యవసరం."

"శ్వేతాంక్ ! క్షమించు ! నేను మరొకరోజునవస్తాను కాని విందుకుమాత్రం రాజాలను. నేనిప్పుడు మరొక జీవితాన్ని గడుపుతున్నాను. ఆ మహోత్సవలోనికి రావడం మరేమంత బాగుండదు" అన్నది చిత్రలేఖ.

"దేవీ ! యశోధరా ! మీరు నన్ను సోదరునిగా భావిస్తున్నారు. ఇది సోదరుని అనురోధంసుమా !"

"నేను రాజాలను శ్వేతాంక్ ! నా నిర్ణయం నిశ్చితమైనదని నీకు తెలుసు. నాకు నీమీద సోదరప్రేమ యున్నది. తప్పకుండా నేను మరొకరోజు వస్తాను"

“ఇంక మీ ఇష్టం! కాని ఇచ్చట ఒకవిషయం చెప్ప డం అవసరం. సోమవారం రాత్రికే ఆర్య బీజగుప్తులు పాటలీ పుత్రాన్ని విడచి వెళతారు. బాగా ఆలోచించండి.”

“ఆర్య బీజగుప్తులు ఆరాత్రికే వెళ్లెదరా?” చిత్రలేఖ ముందు కొంచెం సంకోచించింది. కాని మరుక్షణంలోనే దృఢంగా ఇట్లన్నది. “అయితే నాకేం? నా నిర్ణయం నిశ్చిత మైనదే” !

శ్వేతాంకుడు లేచి నిలబడి—“మీ ఇష్టం దేవీ”అన్నాడు.

*　　*　　*

శ్వేతాంకుని వివాహం జరిగిపోయింది. మరునాటి విందుకు సామ్రాట్, అన్య అథితులు వచ్చారు. బీజగుప్తుడు అందరకు స్వాగతమిస్తున్నాడు. అతడు అందరితోనూ మంద హాసముచేయుచూ సంభాషించుచున్నాడు. కాని హృదయం దహించుక పోతుంది. చిత్రలేఖ రాకపోవడం అతనికెంతో బాధగానున్నది. ఆఖరిసారిగా పాటలీపుత్రమును విడచేముందు ప్రాణప్రియురాలను చూడగోరుచున్నాడు. కాని ఆమె రాలేదు. అప్పటి అతనిస్థితిని తెలుసుకోనాలంటే అట్టి అనుభవాన్ని పొందిన వాడై నాకావాలి లేదా గొప్ప కళాకారుడై నాకావాలి.

భోజనానంతరము శ్వేతాంకునకు సామ్రాట్ ధన్యవాద మొసంగి సామంతు అనే పేరుతో సంభోధించాడు. తరువాత అతని దృష్టి బీజగుప్తునిపై పడింది బీజగుప్తుని పిలచి సామ్రాట్ చేయిపట్టుకొని, లేచి నిలబడినాడు. వెంటనే అన్య అథిలందరూ నిలబడినారు. భవనం అంతా నిశ్శబ్ధంగాఉన్నది. సామ్రా

ఇట్లు చెప్పనారంభించెను— “బీజగుప్త! మీరు పవిత్ర హృదయులు— మహాత్యాగులు—అసాధ్యాన్ని సాధ్యంచేసిచూపారు—మీరు మనుష్యులు కారు— నిజంగా దేవతలు— అందుకు గౌరవ సూచకంగా నేడు మీ ఎదుట భారత్ సామ్రాట్ మౌర్యచంద్రగుప్తుడు సిరమొంచుతున్నాడు”అని చంద్రగుప్తుడు బీజగుప్తుని ఎదుట సిరమొంచెను. అంతట అచ్చట నిలబడియున్న అథితులందరి సిరములు వాటంతటవి వంగిపోయినాయి. స్త్రీల మధ్యనుండి ఒక విధమైన రుధనధ్వని వెలువడింది.

బీజగుప్తుడు సామ్రాట్ ఎదుట సిరమొంచి— “మహారాజా! నేనింత ఆదరానికి అయోగ్యుడను— నేడు నేను బిక్షుకుడనై దేశాటన చేయబోతున్నాను. నన్నాశీర్వదించండి అన్నాడు.

తరువాత మెల్లగా బీజగుప్తుడు ద్వారంవైపును సాగెను. అథితులందరూ రెండుప్రక్కలా బారులుతీరి నిలబడినారు. వారి మధ్యనుండి బీజగుప్తుడు నడచెను. బీజగుప్తుని ముఖమున ఒక దైవికమైన చిరునవ్వు ఉదయించెను.- అతిథులు అతనిలో ఒక విధమైన తేజాన్ని చూచారు. ఆబాలగోపాలం చేతులు జోడించి నిలబడ్డారు. బీజగుప్తుడు వైభవోపేతమైన ఆగుంపు నుండి—శాంతి—త్యాగమనే గురుత్వంతో వెళ్ళిపోయెను.

బైట బీజగుప్తుని సేవకులు నిలబడి యున్నారు. బీజగుప్తుని చూచుటతోడనే వారు ఏడ్వసాగిరి. బీజగుప్తుడు ఒక క్షణంపాటు ఆగాడు. ప్రతివ్యక్తిని తేరిపారజూచాడు. “మీరంతా శ్వేతాంకుని నన్నుగా భావించండి—నన్ను మరువండి— అన్నాడు బీజగుప్తుడు.

సేవకులు భోరున విలపించసాగిరి. అందులో కొంత మంది ఏక కంఠంతో "మేమూ మీతో వస్తాము" అన్నారు.

బీజగుప్తుడు గంభీరంగా— "ఏమంటున్నారు? ఇది నా ఆజ్ఞ! ఇచ్చటనుండి ఎవరూ వెళ్ళగూడదు" అన్నాడు.

సేవక బృందము భయంతో వెనుకకు తగ్గింది. బీజగుప్తుడు ముందుకు సాగిపొయ్యాడు. అర్ధరాత్రి గడచిపోయింది నగరమంతా నిశ్శబ్ధంగా నున్నది. బీజగుప్తుడు ఆ అంధకారాన్ని చీల్చుకొంటూ సాగిపొయ్యాడు. కాలినడకనే పోసాగెను. అతని శరీరంమీద సాధారణదుస్తులే ఉన్నాయి. వెండినాణకలు మాత్రం కొన్ని ఉన్నవి. బీజగుప్తునకు కాళ్ళచప్పుడు వినిపించింది. మెల్లమెల్లగా ఆధ్వని పెరిగింది. బీజగుప్తుడు వెనుతిరిగి చూచాడు. అంధకారంలో అతనికేమీ కనుపించలేదు. మరి కొంతదూరము వెళ్లాడు. పదధ్వని మరింత పెరిగిపోయింది. ఆ అంధకారంలో నిండా ముసుగుపెట్టుకొన్న ఒకమూర్తి బీజగుప్తుని ఎదుటకు వచ్చి "ఓ! నా దేవతా!" అన్నది.

నడచెనడచె బీజగుప్తుని కాళ్లు ఆగిపోయినాయి. నీవెవరవు? అని అడిగాడి బీజగుప్తుడు.

"నా దేవతా! ఓ ......నా ... ఆరాధ్యా దేవత! నన్ను క్షమించండి! అని ఆమూర్తి బీజగుప్తుని పాదముల మీద పడింది.

బీజగుప్తుడు కర్కశస్వరంతో— "చిత్రలేఖా! నాజీవిత అభిశాపమా—! నీ విచ్చటి కెందుకొచ్చావు? వెళ్లు... వెళ్ళు ...!" అని వెనుకకు తగ్గి "అప్పుడంతా సమాప్తమైనది ... ఎందుకొచ్చావు?" అన్నాడు.

,,నా దేవతను పూజించడానికొచ్చాను—" నా దేవత చరణ ధూళిని తీసుకోవడానికి వచ్చాను— చిత్రలేఖ నిలబడి— "నాథా! నేను మీ జీవితాన్ని నాశనం చేశాను. మిమ్ముల భ్రష్టులను చేశాను. మీ వికసించె నిండుయవ్వన భాండవములో నిప్పుకణాలు పోశాను— నన్ను శపించన్నది. చండి—శిక్షించండి—చావమోదండి—కాని ద్వేషించకండి"

బీజగుప్తుని శరీరమంతా కంపించిపోయింది. అతను గద్గద స్వరంలో—"చిత్రలేఖా! అంతా అంతమైంది— నీవె అంతం చేశావు—నీవు కుమారగిరి కుటీరంనుండి నావద్దకు రాలేదు— నేను పూర్తిగా నిరాశ చెందాను— ఇప్పుడు చంచలుని చేయడాని కెందుకొచ్చావు? ఇప్పుడు నావద్ద ఏమీ మిగిలిలేదు — హృదయంలో ఉత్సాహంలేదు—చేతిలో చాలినంత వైభవమూ లేదు— నన్ను పోనివ్వు" అన్నాడు.

చిత్రలేఖ బీజగుప్తుని చేయిపట్టుకొని—"కాదు—! ఇప్పుడు మిమ్ముల నేను పోనివ్వను— స్వామీ! ఒకరోజు మీరు నా అతిథిగా వుండాలి— వెళ్ళవలసి వస్తే రేపు వెళ్ళవచ్చును" అని ప్రార్థించింది.

బీజగుప్తుడు చేతిని విదిలించుకొని— "నా ఎదుటనుండి ముందు తొలుగు—నర్తకీ! తప్పుకో! నీవు సన్నాపజాలవు — నీవు నీ వినాశకారి కృత్యానికి పరిణామాన్ని చూచి పకపకా నవ్వు! తొలగు! నన్ను పోనివ్వు—" అని బీజగుప్తుడు ముందుకు సాగెను.

చిత్రలేఖ బీజగుప్తుని పాదములను పట్టి—నేను మిమ్ముల పోనివ్వనంటున్నాను. మీరు నా వెంట నా భవనంవరకూ

రావాలి—బీజగుప్త—! నా నాథా! నాయెడ మీ హృదయం లోని ప్రేమ చచ్చిపోయిందా? చెప్పండి..." అని చిత్రలేఖ వెక్కి-వెక్కి ఏడ్వసాగింది.

బీజగుప్తుడు తనను తాను ఆపుకోలేకపోయ్యాడు. 'ఆహా నాలో నీయెడఉండే ప్రేమ చచ్చిపోతే ఈ వైభవాన్ని ఎందుకు విడుస్తాను. చిత్రలేఖా! నీయెడ నాకున్న ప్రేమను చంపుకో ప్రయత్నించాను — కాని అట్లు జరుగలేదు. ఇక ముందుగూడా జరుగదు" అని బీజగుప్తుడు చిత్రలేఖను లేవతీసి ఆలింగనము చేయగోరెను. చిత్రలేఖ దూరంగా తొలగి "ఆగండి—! నాశరీరాన్ని ముట్టకండి—! నేను అపవిత్రురాలను! పాపిని—పరమ పతితను— నాథా! నా భవనమునకు దయ చేయండి— తమ శాపాగ్నిలో మాడ్చి నన్ను పవిత్రురాలని గా చేయండి!"

"పద... పద...! చిత్రలేఖా! ఈ ప్రపంచంలో నీ ఒక్క-దానిమాటను తిరస్కరించలేక పోతున్నాను— ఇంకెంత క్రిందికి పడద్రోయ దలచావో — పడద్రోయి — కాని నీవు నన్ను రేపు ఆపగనిమాత్రం మాట ఇవ్వు"

"రేపు ఆపనని మాట ఇస్తున్నాను"

ఇద్దరూ చిత్రలేఖ భవనానికి చేరుకొన్నారు. ఆమె బీజగుప్తునకు శయనించడానికి తగిన ఏర్పాట్లు చేయించి—"నాథా! తమరు శయనించండి - రేపు వుదయం మాట్లాడుతాను" అని చిత్రలేఖ వెళ్ళిపోయింది. బీజగుప్తుడు మాట్లాడకుండా ఆమెను అలానే చూస్తూ ఉండిపోయెను.

—

ఉదయమే చిత్రలేఖ బీజగుప్తునివద్దకొచ్చి– "స్వామీ తమరు తను పాదామృతం నాకివ్వండి" అన్నది.

బీజగుప్తునకు ఇదంతా ఆశ్చర్యంగానున్నది. "ఇదెందు లకూ ? అన్నాడు.

"నన్ను నేను పవిత్రురాలనిగా చేసుకొంటున్నాను. స్వామీ ! నేను నా మార్గాన్ని తప్పాను. యోగి కుమారగిరి కామవృత్తికి సాధనమయ్యాను. ఆవేశంలోపడి నేను నా శరీరాన్ని అతనికర్పించాను. ఇప్పుడా శరీరాన్ని పవిత్రంచేసుకోగోరుచున్నాను" చిత్రలేఖ జరిగిన కథనంతా పూసగ్రుచ్చినట్లు బీజగుప్తునకు వివరించింది. "ఇప్పుడు తమరు నేనెందుకు రాలేకపోయ్యానో తెలుసుకోగలరు– క్షమించగలరుకూడా !"

"కేవలం ఈ చిన్నవిషయానికేనా?" బీజగుప్తుడు నవ్వి –"చిత్రలేఖ ! నీవు పెద్దపొరబాటు చేశావు. నన్ను అర్థం చేసుకోలేకపోయ్యావు. నీవు నన్ను క్షమించమని వేడుకొంటున్నావా? చిత్రలేఖా ! ప్రేమ స్వయంగానే త్యాగమయం– విస్మృతి – తన్మయితా – ప్రేమయొక్క లక్షణాలు. ప్రేమ యొక్క ఈ విశాల ప్రాంగణంలో అపరాధమంటూ లేనేలేదు. అయినప్పుడు క్షమాపణ అంటూ ఎలా ఉంటుంది? అయినప్పటికి నా నోటితో అనిపించదలస్తే అంటున్నాను ——

"క్షమించాను !"

చిత్రలేఖ బీజగుప్తుని పాదాలు పట్టుకొని "అయితే నాథా ! తిరిగి నన్ను స్వీకరించండి !"

"అసంభవము! దేవీ చిత్రలేఖా! ఇప్పుడు నేను భిక్షుకుడను — వైభవాన్ని త్యజించాను — ఇప్పుడెలా సాధ్యం ?"

"నాధా! నావద్ద తరగని ధనరాశి యున్నది. నేను మీదానను — ఈధనం మీదే! భిక్షుకుడనని ఎందుకనుకొంటున్నారు ?"

"నీ సంపద — నీ ధనరాసులు నా కుపయోగపడేవు గావు. నేను తిరిగి వైభవాన్ని స్వీకరించడానికి త్యజించలేదు. తిరిగి ఆ క్షేత్రంలో ప్రవేశించకుండా వుండటానికే త్యాగము చేశాను. నిన్నుగూడా భిక్షుగత్తె రూపంలో స్వీకరించగలను"

చిత్రలేఖ లేచి నిలబడింది—— "అయితే అలాగే ఈ ప్రపంచంలో మనమిద్దరమూ — భిక్షుకులమై పోదాము—ప్రేమ — కేవలం ప్రేమే మనకాధారం. నా దేవతా! నేను నా సంపత్తిస నేడే దానం చేస్తున్నాను. ఈ రాత్రికే మనం ఈ అగాధమైన ప్రపంచ సాగరంలో ప్రేమయనే నౌకమీద ప్రయాణం సాగిద్దాం —"

చిత్రలేఖ ముఖమండలమున మెరపు మెరసిన కాంతి ఉదయించింది. ఆమె నేత్రాలలో ఒకరకమైన జ్యోతి వెలిగింది. ఆమె ఆత్మ పరిశుద్ధమై ప్రకాశించింది. ఆమె కోర్కె పల్లవించింది. ఆమెకు అపారమైన ఆనందం కలిగింది.

బీజగుప్తుడు చిత్రలేఖను తనివితీరా ముద్దు పెట్టుకొన్నాడు —— మనసారా ఆలింగనం చేశాడు. ఆనందముట్టిపడుచుండ — "మనమెంత సుఖవంతులము ?" అన్నాడు బీజగుప్తుడు.

# ము గిం పు.

ఒక సంవత్సరం తరువాత!

మహాప్రభు రత్నాంబరుడిట్లడిగెను— "వత్సా శ్వేతాంక్ నీ వివాహం జరిగింది—— గృహస్థుడవయ్యావు——బీజగుప్తుడు కుమారగిరి — ఈ ఇద్దరిలో ఎవరు పాపాత్ములో, ఇప్పుడు నీవు చెప్పగలవు ?"

శ్వేతాంకుడు రత్నాంబరుని ఎదుట గౌరవముగా సిర వొంచి— "మహాప్రభూ! బీజగుప్తులు దైవ సంభూతులు. ఈ ప్రపంచంలో వారు త్యాగానికి ప్రతిమూర్తులు — విశాలహృదయులు — కుమారగిరి పశుతుల్యుడు. అతడు అతనికోసమే జీవిస్తున్నాడు. నిజంగా అతడు జీవించడం వ్యర్థం. అతడు జీవిత నియమాలకు ప్రతికూలంగా నడుస్తున్నాడు. వ్యక్తిగత సుఖంకోసం ఈ ప్రాపంచిక బాధలనుండి విముఖుడైనాడు. కుమారగిరి పాపాత్ముడు" అన్నాడు.

వత్సా విశాలదేవ్! నీవు యోగివద్ద గురుదీక్ష పొందావు — యోగివయ్యావు. బీజగుప్తుడు — కుమారగిరి — ఈ ఇద్దరిలో ఎవరు పాపాత్ములో ఇప్పుడు నీవు చెప్పగలవు?

విశాలదేవ్ గౌరవంగా సిర వొంచి — "మహాప్రభూ! యోగి కుమారగిరి విజయులు. మమత్వాన్ని [illegible] చేసుకొన్నారు. వారి సాధనా — జ్ఞానం — వారి[illegible]నటువంటిది. బీజగుప్తుడు వాసనావృత్తికి దాసు[illegible]. [illegible]

జీవితమంతా కలుషితమైన ప్రాపంచిక భోగవిలాసములలో లీనమై యున్నది. వాడు నిజంగా పాపాత్ముడు. పాపభూయిష్టమైన ప్రపంచమునకు వాడు ముఖ్య భాగస్వామి” అన్నాడు.

రత్నాంబరుడిట్లు చెప్పెను – “మీ ఇద్దరూగూడా వేరువేరు పరిస్థితులలో మెలగారు. కనుక పాపము మీ అభిప్రాయములు గూడా వేరువేరుగానే యున్నవి. మీ విద్య పూర్తియైనది – మీరు వెళ్ళుచున్నారు – నా అంతిమ పాఠాన్నిగూడా విని వెళ్ళండి ---

ప్రపంచంలో పాపమంటూ లేనే లేదు. అది కేవలం మనుష్యుని విషమదృష్టి కోణానికి రెండవపేరు. ప్రతి వ్యక్తి ఒక విశేష మనఃప్రవృత్తితో జన్మిస్తాడు. ప్రతివ్యక్తి ఈ ప్రపంచమనే నాటకరంగములో అభినయించడాని కొస్తున్నాడు. తన మనః ప్రవృత్తిచే ప్రేరేపింపబడి తన పాఠాన్ని వర్తించుతాడు. ఇదే మానవ జీవితం. మనుష్యుడు స్వభావానికి అనుకూలంగానే ఏపనినైనా చేస్తాడు. స్వభావం సహజమైనటువంటిది. మనుష్యుడు సర్వ స్వతంత్రుడుకాడు – పరిస్థితులకు దాసుడు – వివశుడు – వాడు కర్తగాడు. కేవలం నిమిత్తమాత్రుడు. ఇంకా పాపము పుణ్యమనేది ఎక్కడున్నది ?

మనుష్యుడు మమత్వ ప్రధానుడు. ప్రతి మనుష్యుడు సుఖాన్ని కోరుతాడు. కేవలం వ్యక్తులసుఖకేంద్రం వేరువేరుగా ఉంటుంది. కొందరు ధనంలో, కొందరు మధుసేవలో, కొందరు వ్యభిచారములో. మరికొందరు త్యాగంలోనూ సుఖాన్ని

పొందుతారు. ఈ ప్రపంచములోని ఏ వ్యక్తి దుఃఖము లభించాలనే కోర్కెతో పనిచేయడు. ప్రతివాడు ప్రతిపని సుఖాన్ని పొందడానికే చేస్తాడు, ఇదే మనుష్యుని మనఃప్రవృత్తి.

"ఇందువల్లనే ప్రపంచంలో పాపానికి ఒక పరిభాష అంటూ పుట్టలేదు - ఇకముందు పుట్టబోదు. మనం పాపం చేయడంలేదు - పుణ్యం చేయడంలేదు. కేవలం చేయవలసి వచ్చిందేదో చేస్తున్నాము.

రత్నాంభరుడులేచి నిఃబడి - "ఇది నా అభిప్రాయం. ఇందు మీరు ఏకీభవించినాసరే - ఏకీభవించకపోయినా సరే. మిమ్ములను ఏకీభవించమని బలవంతము చేయను. వెళ్లి సుఖంగా ఉండండి! ఇది మీకు నా ఆసీర్వాదం! అన్నాడు.

సమాప్తం.





## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A 10 8 13 133 |
| పుస్తకం పేరు | చిలక జోస్యం |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 257 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యవలసినది | A |
| తప్పులు | NO |